# విమానయానము.

మోదుకూరి విశ్వనాథము,

ఎల్. యమ్. ఇ. (ఆనర్సు) గారిచే

భాషాంతరీకరింపబడియె.



బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడినది.

1930.



# కృతిసమర్పణ

హిందుదేశ పరిశ్రమాభివృద్ధికి మనో
వాక్కాయ కర్మలతో తోడ్పడు
మహనీయుల పాదపద్మములకు
ఈ చిన్నిపాత్రమును
భక్తితో సమర్పించుచున్నాను.

— మోదుకూరి విశ్వనాథము.



# పీఠిక.

ఆంగ్లేయభాషలో 'విమానములో అయిదువారముల ప్రయాణము' అను చక్కని గ్రంథమును సుప్రసిద్ధ గ్రంథ కర్తయగు జూల్సు వెర్ను అనువారు వ్రాసి యున్నారు. ఆయన గొప్ప ప్రకృతిశాస్త్రరహస్యములలో సామాన్యజనులకు అభిరుచి కలుగజేయుటయే ఆయన యుద్దేశ్యము. ఇట్టి గ్రంథము లెన్నియో ఆంగ్లమున గలవు. ఆంధ్రమున లేవు. ప్రపంచనాగరకత యెంతయో వృద్ధిజెందుచున్నది. గుఱ్ఱపు బండ్లనుమించు మోటారుకార్లు వచ్చినవి. రైళ్లబాగయోడల మించి ఆకాశమున సంచరించు విమానములు వచ్చినవి. టెలిఫోనును మించు రేడియో వచ్చినది. ఈ ప్రకృతిశాస్త్రశోధనలు స్వతంత్రజాతులవారు చేయుచున్నారు. వాటి లాభముల ననుభవించుచున్నారు. ఆ ప్రభుత్వములును ప్రత్యేకముగ ధన సహాయము జేసి పరిశోధనలను జేయించుచున్నవి. పరాధీన దేశమగు మన దేశములో ప్రకృతిశాస్త్రజ్ఞానమునకు దగిన ప్రోత్సాహము లేదు. ప్రజలు మాంద్యమునందున్నారు. పుక్కిటిపురాణకథలే వ్యాపించియున్నవి గాని ప్రకృతిశాస్త్రగ్రంథములయందు అభిరుచిగలవారు మిగుల తక్కువగ నున్నారు. రైళ్ళలో ప్రయాణముచేసినటులే విమానములో ప్రపంచ మంతయు సంచరించుకాలము వచ్చుచున్నది. విమానముల

సంగతి ఆంధ్రజనులకు దెలియుట బహు అవసరము. విమాన మునుగురించి ఆంగ్లములో వ్రాయబడిన అతిసులభమైనగ్రంథమును తెలుగులోనికి భాషాంతరీకరించుటవలన శ్రీ పోడుకూరి విశ్వనాథముగారు మిగుల భాషాసేవ జేసియున్నారు. విశ్వనాథముగారు ఇంజనీరింగునందు తీర్ణులై పరిశ్రమశాస్త్రములయందు అభిరుచిగల యువకులు. తెలుగులో ఈ గ్రంథమును చక్కని శైలిలోవ్రాసి, మిగుల నుపకారము జేసియున్నారు. ఆంధ్రమహాజనులు ఈగ్రంథకర్తకు దగిన ప్రోత్సాహము గలుగ జేయుదురుగాక.

అయ్యదేవర కాళేశ్వరరావు,

విజ్ఞానచంద్రికామండలి పథ్యుడు.



# ఉపోద్ఘాతము

నేను చిన్నతనమునుండియును పదార్థవిజ్ఞానశాస్త్ర సంబంధముగల గ్రంథములను చదువ నభిలాషగలవాడ నగుటచే ఆంగ్లభాషయందు 'జూల్సవెర్న్' అను గ్రంథకర్తచే వ్రాయబడిన గ్రంథములను, యంత్రశాస్త్రసంబంధముగల గ్రంథములను చదివియుంటిని. ఇటువంటి గ్రంథములు తెనుగు భాషయందు బహుస్వల్పముగ నున్నందున విద్యార్థులకుండు ప్రోత్సాహముతో జూల్సువెర్నుచే వ్రాయబడిన 'Five weeks in a balloon' అను పేరుంబరగు గ్రంథమును భాషాంతరీకరణ మొనర్ప యత్నించి కొంతవరకు వ్రాసి యంత్రశాస్త్రవిద్య నభ్యసింప బొంబాయినగర మేగుచు దానిని మూల బడ వైచితిని. ఆ చదువు పూర్తియైనపిమ్మట గొందరు స్నేహితుల ప్రోత్సాహముచే మూలనున్న పుస్తకమును బైటికిదీసి భాషాంతరీకరణమును పూర్తిచేసితిని. దానిని నామిత్రులగు మ॥ రా॥ శ్రీ సాతులూరి వీరరాఘవయ్యంగారు బి. ఏ. బి. ఇ. డి. శ్రమదీసుకొని పూర్తిగా చదివి లోపములను సవరించి ముద్రింప ప్రోత్సాహ మొసగినందున వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

జూల్సవెర్న్ అను గ్రంథకర్త ఆంగ్లభాషయందు ప్రకృతిశాస్త్ర యంత్రశాస్త్ర సంబంధముగల గ్రంథములను

చదువరులకు శాస్త్రకాఠిన్యత లేక యింపుగా నుండుటకుగాను ఆ యా శాస్త్రములను మానవజీవితమునకు వినియోగపడున టుల వ్రాసి యుండెను. ఈ విమానయానమునందు ఉదజని విమాననిర్మాణము, అందు ప్రయాణము జేయుట, ప్రయాణముఁ జేయునపుడు గలుగు కష్టసుఖములు వివరింపబడి యుండెను.

యంత్రశాస్త్రమును తెనుగున వ్రాయుమని ప్రోత్సాహమొసఁగుచు యంత్రశాస్త్రపదములను తెనుగున నేర్పాటు చేయుటయందు నాకుఁ దోడ్పడి తగు సహాయము నొసఁగిన మున గాల దివానుగా బనిచేసి కీర్తిశేషులైన మ॥ రా॥ శ్రీ॥ కొమ రాజు లక్ష్మణరావుగారి యాత్మకు మత్కృతజ్ఞతావంద నములు.

పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, గణిత శాస్త్రము అభిమానవిద్యగా గైకొనిన విద్యార్థుల భాషాపరి జ్ఞానమెంతవరకుండునో పాఠకులకు విదితమే గనుక యీపొత్త మునందుఁ బెక్కులోపము లుండవచ్చును. ఆ యా లోపము లను నాకు దెలియఁజేయు పాఠకులు వందనీయులు.

మో. విశ్వనాథము.



## ఇందువచ్చిన శాస్త్రపదములకు ఇంగ్లీషు అనువాదము.

ఆమ్లములు; Acids
ఆమ్లజని; Oxygen
అక్షాంశరేఖ; Latitude
ఉదజని; Hydrogen
ఉత్ప్లవనశక్తి; Ascending force
ఉష్ణమాపకము; Thermometer
ఋణధ్రువము; Negative pole
కమానులు; Springs
కర్బనకణికలు; Carbon rods
గుండము; Crator
గంధకికామ్లము; Sulphuric acid
జడత్వము; Inertia
జలపాతము; Water fall
తప్తలోహము; Molten iron
తారతమ్యగరిమ; Specific gravity.
దూరదర్శిని; Telescope
ధనధ్రువము; Positive pole
ధ్రువరేఖ; Longitude
నావికాఅయస్కాంతము; Mariner's compass
నిరక్షరేఖ; Equator
నిష్పందజల శాస్త్రము; Hydrostatics
పథికసంఘము; Travellers club
పరావర్తము; Reflection
పీడనము; Pressure
ప్రయోగము; Experiment
పరిశోధన; పరిశీలన; Research
ప్రవాహ విద్యుచ్ఛక్తి; Voltaic Electricity
బాష్పము; Steam
బాష్పజము; Boiler
భారమాపకము; Barometer
భూగోళపరిశోధనలు: Geografical researches
ఎడారిలంక; Oasis
వల్వము; Valve
వాణిజ్యవాయువులు, Trade winds
వ్యాకోచము; Expansion
విఘటనము; Decompose
విద్యుద్వాహకములు; Electrodes
విమానము; Balloon
విహంగవిమానము; Aeroplane
రక్షకనావలు; Life boats
సంకోచము; Contraction
సంధులు; Joints
స్థానాంతర్గతము: Displacement
స్థిరత్వభారము; Ballast
సున్నితకాలపరిమాణయంత్రము; Chronometer.



విమానము అగ్నిపర్వతముమీదుగా ఐసుచున్నది.

# విమానయానము.

## ప్రథమాధ్యాయము.

"తే. గరుడ గంధర్వ యక్ష రాక్షస సురేంద్ర
వరులచే సాధ్యపడక నావలయు నెడల,
నభ్రపథమున దిరిగెడునట్టి మహిత,
యానము నాకు దయచేయు వరద యీశ."

—భాగవతము.

లండను నగరములోని 'వాటర్లూ' యను ప్రదేశమందు జరిగిన భూగోళ పరిశోధనాసంఘ సమావేశమునకు జనులు మిక్కుటముగ విచ్చేసియుండిరి. ఆసభ నలంకరించిన యగ్రాసనాధిపతి చక్కని యుపన్యాస మొసగుచు సభ్యుల మనముల రంజింప జేయుటవలన సభ్యులు చేయు కరతాళధ్వను లాయుపన్యాసకునకు గొంత విశ్రాంతి నొసగుచుండెను. ఆయుపన్యాస మీక్రిందివిధముగ ముగిసెను.

"ఇంగ్లాండుదేశ మెల్లప్పుడును భూగోళ పరిశోధనలయం దన్ని దేశములకు నగ్రస్థానము నధిష్టించుచుండెను. (వినుడు_వినుడు) మన శాముయులు ఫెర్గుసనుగారు ఇంగ్లాండుదేశపు కీర్తిని వృద్ధిచేయుదురని తలంచుచున్నాము. ఆయన వ్రాసిన విమా

నయానము నెఱవేరినచో ఆఫ్రికాదేశపు పటము సంపూర్ణముగ వ్రాయనగును. ఈకార్యము నెరవేరజాలనిచో ఆఫ్రికాదేశపు ప్రవేశము సామాన్యజన సామర్థ్యమునకు దుర్లభకృత్యములలో నొకటిగ పరిగణింపబడును."

వినువారల యుత్సాహ మధికమగుటచే "ఫెర్గుసనుగారికి జయమగుగాక" యను ధ్వనులు బయలువెడలెను. ప్రపంచకజ్ఞాన సంపాదనకై పట్టుదలతో పనిజేయు కార్యశూరులు భూగోళమందలి అయిదుఖండములనుండియు తెంచి సభనలంకరించిరి. వారు మనోధైర్య సాహసబలములచే మునుగుచున్న నావల నుండియును, అగ్నిబాధల నుండియును, గండ్రగొడ్డళ్ళ సంకటముల నుండియును, దుష్టకర్రలబారినుండియును, చిత్రవధలనుండియును, నరమాంస భక్షకులవాతనుండియును తప్పించుకొనియుండిరి. భూగోళపరిశోధనాసంఘసభ్యులెల్లరీ యుపన్యాసము నాలకించి అమితోత్సాహమును పొందిరి.

ఇంగ్లాండుదేశమునందీయుత్సాహము వాక్చూరతతోనంత మొందక వెంటనే కార్యరూపమును దాల్చెను. లంకసాలలో నెంత త్వరితముగ ధనము తయారగునో అంతవేగముగ విరాళములరూపమున విత్తము సమకూర్చబడెను. ఖర్చులకై 2,500 పౌనుల ద్రవ్యసహాయమును సభవారు తక్షణమే ఫెర్గుసనుగారి కొసగిరి.

సభ్యుడొకఁడు లేచి "ఫెర్గుసనుగారిని చూడఁగూడదా?" అని ప్రశ్నించెను.

"ఫెర్గుసనుగారిని చూచుట కభ్యంతరములేదు. వారు మీ యిష్టానుసారము నడచుకొనువారే." అని సభాధ్యక్షుఁడనెను.

ఫెర్గుసనుగారి నాహ్వానించు కేకలు నలుదిక్కులనుండియు వినవచ్చెను.

ఒక వృద్ధసేనాని "ఇదియంతయును కపటనాటకము" అనెను.

"ఫెర్గుసను అను మానవుఁ డున్నటుల నాకుఁ దోఁచుట లేదు" అని మఱియొకఁ డనెను.

"వానిని సృష్టించవలెను" అని మఱియొకడు చెప్పెను.

అప్పుడగ్రాసనాధిపతి లేచి ఫెర్గుసనుగారిని పిలువ పంపెను.

సభ్యులెల్లరు కరతాళ ధ్వనులు చేయుచుండ ఫెర్గుసను సభలోనికేతెంచెను. అతఁడు నలుబది వత్సరముల ప్రాయము గలిగి మిగుల యెత్తరిగాక యుండెను. అరుణకమల కాంతుల క్రిందుపడుపజాలు ముఖసౌందర్య మాతని సిద్ధ సంకల్పతను జాటుచుండెను. దీర్ఘనాశికయును, ఆకర్ణాంత నేత్రములును గల ముఖకాంతి వాని వర్చస్సునకు నిర్మలోదకంబునకు పద్మ సౌరభము గూర్చు శోభ నిడుచుండెను. వాని యాజానుబాహు

వులును, విశాల వక్షస్థలమును, నిడుదలగు కాళ్ళును, గంభీర స్వభావమును ఆకాలమున మానవున కసాధ్యమగు భూగోళ పరిశోధనలయందు ఘనత వహించుటకు సృష్టింపబడిన మహాత్ముం డీతండే యని చెప్పకయే చెప్పుచుండెను. ఆ భవిష్యన్మహానుభావుడు స్నేహభావములో ప్రార్థించుటచే కరతాళధ్వనులు మాని సభలోని జనులందరును చిత్రపటముల చెలువు దాల్చి నిశ్శబ్దముతో నేకాగ్రతతో నుండిరి. సింహాసనమున కేగి, హస్తము నూర్ధ్వముగ చలింప జేయుచు నీక్రిందిమాటను మృదుకంఠముగ నుచ్చరించెను.

"దిగ్విజయమస్తు"

ఈ పదోచ్చారణము వలన సభ్యులెల్లరు కోబ్డెన్, బ్రైట్ అను వారలు చెప్పెడి పలుకుల కైనను జనించనట్టిదియు, ఇంగ్లాండు దేశమందలి పర్వతములను నేలమట్టము జేయు ద్రవ్యసహాయము వేడిన పాల్మరుస్టనుగారి నుడువుల కైనను జనింపని యాశ్చర్యమును బొందిరి.

డాక్టరు శాముయలు ఫెర్గుసనుగా రెవరు ? ఏ కార్యమును జేయ బూనుకొనెను?

ఆంగ్లేయ యుద్ధ నౌకాసమూహములో నాయకపదవి ననుభవించిన ఫెర్గుసను తండ్రి తన కుమారునకు విద్యలన్నియు జెప్పించి, సముద్రయానముగూడ నేర్పెను. కుమారుడు తండ్రి యంతవాడై భయమనునది యెట్టిదియో యెరుగక ప్రకృతి

శాస్త్రమునందు నేర్పుతో పరిశీలనములు చేయుచుండెడి వాఁడు. ఇతఁడు నిష్పంద జలశాస్త్రమును, పదార్థ విజ్ఞానశాస్త్రమును, కొంతవరకు వృక్షశాస్త్రమును, వైద్యవిద్యను, జ్యోతిశ్శాస్త్రమును నేర్చుకొనెను. తనతండ్రి గతించుటకు ముందు ఫెర్గుసను ప్రపంచమంతయు దిరిగివచ్చెను.

శామ్యుయెలుఫెర్గుసను 1805 వ సంవత్సర ఇంగ్లాండున కేతెంచి పరిశోధనా దేవత నుపాసింప సంకల్పించి మెక్లూరను నాయకునితో అమెరికాదేశమును జూచి బేరింగు జలసంధి మొదలు ఫేరువేలాగ్రము వరకును జనెను. పలుకష్టములకు లోనై పెక్కు దేశముల నీరమును గ్రోలినను ఫెర్గుసనుబలమునకు చలనము లేదు. అన్నకోశమును తన యిష్టానుసారము నడిపించును. నిద్రాదేవత వానికి వశవర్తినియై కనుసన్నల మెలగజొచ్చెను.

సభ ముగిసినపిదప లండను నగరమందలి పాల్మాలులో నున్న ప్రయాణికుల ఉపాహారగృహమునందు ఫెర్గుసనునకు విందొసగిరి. పళ్ళెరములు ఫెర్గుసనుకీర్తికి తగినటుల పెద్దవిగను, అందులో నుంచబడిన పదార్థములు బహురుచ్యములుగను నుండెను. ఉపాహారప్రదాపకు లెల్లరును ఆఫ్రికాదేశమునకు జనిన పథికుల నామములను ఆంగ్లేయాక్షరసరణి నుచ్చరించుచు వారి జ్ఞాపకార్థమై ఫ్రెంచిసారాయములను తృప్తిగ గ్రోలిరి.

# రెండవ అధ్యాయము.

దినతంతి వార్తాపత్రికయందీ దిగువసంగతి వ్రాయబడి యుండెను. "ఇటుపిమ్మట ఆఫ్రికాదేశమునందు విదేశీయులు చొరలేని ప్రదేశము లుండుటకుదు. అరువదిశతాబ్దములనుండి శాస్త్రజ్ఞులకు పరిశోధకులకు నగమ్యగోచరముగ నున్న ఆఫ్రికా దేశాంతర్భాగములు నేడు విదేశీయుల దృష్టిపథంబునం బడుట నిజమని చెప్పవచ్చును. విన్సాము క్లాప్టన్ అను వారలు జరిపిన మార్గముల ద్వారా జక్ స్కానను అను యొడారిని జేరిన డాక్టరు బార్తు అను వానివల్లను, గుడ్ హోపాగ్రమునందుండి జాంబిసీ ముఖద్వారమువరకును పరిశోధనలను జేసిన డాక్టరు లివింగు స్టన్ అనువానివల్లను, ఆఫ్రికాగర్భమున నున్న సరస్సులను కనుగొనిన గ్రాంటు, స్పీకి నాయకులచేతను, కనుగొనబడిన మూడుమార్గములు మన నవీనపరిశోధకునకు నిశ్చితములై యున్నవి. ఇట్టి మహాసియుల పరిశోధనలను ముత్యములు డాక్టరు ఫెర్గుసనుగారి సాహసకృత్యమను పట్టుదారముచే గుచ్చబడి ఆంగ్లమాతకు కంఠహారములై వెలుగుచున్నవి.

ఈ సాహసుడు ఆఫ్రికాదేశమును తూర్పుతీరమునుండి పడమటతీరమునకు విమానము నెక్కి దాటనున్నాడు. మేము వినినసంగతి నిజమైనచో నీతడు జాంజిబారు ద్వీపమునుండి బయలు దేరును. ఎచ్చట దిగునో తెలియదు. ఈ ప్రయాణపుఖర్చులకై లండనునగర భూగోళ పరిశోధనా సంఘమువారు 2500

పౌనుల ద్రవ్యసహాయమును ఫెర్గుసనుగారి కొసగిరి. ఈప్రయాణ ఫలితములను ముందు తెలియజేయుదుము."

ఈవ్యాసము నానాదేశముల ప్రజలచే చదువబడుటచే కొందరీకార్యమును నమ్మజాలక వ్యాసకర్తచే ఫెర్గుసను సృష్టింపబడె ననిరి.

లండనునగర భూగోళ పరిశోధనా సంఘమును గూర్చి యును, పత్రికసంఘమును గూర్చియును హేళనజేయు వ్యాస మొండు జినీవాపట్టణమందలి భూగోళసంఘపత్రికయందు కానవచ్చెను. గోతాపట్టణములో ప్రకటింపబడు "మితిలంజర్" అను పత్రికలో ఫెర్గుసను స్నేహితుడైన పీటర్మను వ్రాసిన ప్రత్యుత్తరముచే జినీవాపత్రిక హేళనస్వభావమును వీడెను.

విమానయానమునకు వలయు యత్నములు లండను నగరమున చేయ నారంభింపబడెను. లోయన్సులోని నేతగాండ్రు ఉదజనివిమానమునకు వలయు పట్టువస్త్రములను చేయ మొద లిడిరి. రజల్వ్యాటను ధూమనౌకను పెనటు నాయకుని యాధి పత్యముక్రింద ఆంగ్లేయ దొరతనమువారు డాక్టరున కొసగిరి. స్నేహితులెల్ల ఫెర్గుసనునకు వీడుకోలు వ్రాతల నంపిరి. పేరిసు పట్టణమునందుండు పరిశోధనాసంఘమువారు ప్రయాణమును బాగుగా వర్ణించి వ్రాసిరి. డాక్టరు కోనరు వేరొక పత్రికలో ప్రయాణము జయప్రదముగ కొనసాగుటకు వలయు సాధనము లను, మధ్యకలుగు కష్టములను, విమానయానమును గూ

ర్చిన మంచిచెడ్డలను విపులముగ వివరించి, బయలుదేరుస్థానము జాంజిబారుకన్న అబిసీనియాదేశమందలి మెశోవారేవుస్థలము మంచి దని వ్రాసెను. ఈ మెశోవానుండియే 1768 సం॥న జేమ్సుబ్రూసు నైలునదియుత్పత్తిస్థానమును చూచుటకు బయలు దేరెను.

ఇంగ్లాండు వరించబోవు కీర్తికాంతను జూచి అసూయాభావముతో ఉత్తరఅమెరికాఖండపు పత్రికయొండు ఫెర్గుసను గారిని ఆఫ్రికానుండి అమెరికాకు విమానములో కూర్చొని రావలయు నని నాహ్వానించెను. అమెరికా, ఫ్రాన్సు, ఇంగ్లాండు, జెర్మనీ, ఇటలీ, స్పెయిను, పోర్చుగలు, స్వీడను, నార్వే మొదలుగాగల దేశములందు యీవార్తను ప్రకటించని పత్రికయే లేదు.

ఇంగ్లాండునందు సహితము ఫెర్గుసను కలడా లేడా యనియును, విమానయానము నిజమా కల్లా యనియును, జయప్రదముగ కొనసాగునా సాగదా యనియును వాదప్రతివాదములు పెరిగి పందెములు వేయబడుచుండెను. నమ్మినవారు, నమ్మనివారు, పండితులు, పామరులు, పిల్లలు, పెద్దలు డాక్టరుఫెర్గుసను విమానయానమునుగురించి యోచించువారే. ఫెర్గుసను ఆకాలపు అవతారమూర్తివలె ప్రకాశించుచుండెను. అడిగినవారికెల్ల తన ప్రయాణమునుగూర్చి నుడువుచుండెను. కొంద రాతనికి సహాయార్థమై జనుట కిష్టపడినను ఫెర్గుసను నిరాకరించుచుండెను.

# మూడవ అధ్యాయము.

ఫెర్గుసనునకు స్కాట్లాండు దేశీయుడైన డిక్కు కెనడీ యను చెలికాడొకడు గలడు. వీరిద్దరికిని రూపురేఖాదులలో నించుకయు భేదము గానరాదు. విద్యావివేకమునను, స్వభావ పరివర్తనములను వీరిరువురకును మిగుల వ్యత్యాసము గలదు. ఈవ్యత్యాసము వారిస్నేహమును వృద్ధిజేసెనే గాని నష్టపరుపలేదు. స్కాట్లాండు దేశజుల స్వభావసిద్ధగుణములే కెనడీకి గలవు. అవేవన ఉన్నదున్నట్లు వక్కాణించుట, పంతమును చెల్లించుకొనుట, ఇతరులమాటను వినకుండుట. ఇతని నివాసస్థానము ఎడింబరోవద్ద నీతునగరము. చేపలను పట్టుటయందును, వేటయందును మిగుల నిపుణుడు. ఆరడుగులకన్న నెక్కువ పొడవును, హెర్క్యులీసునకు గల బలమును, సూర్యరశ్మిచే నెఱ్ఱబారినటులుండు మొఖమును, నల్లని నేత్రద్వయంబును గలిగియుండెను. ఫెర్గుసనునకును, కెనడీకిని గల స్నేహము హిందూదేశమందలి సైన్యములో జేరినపు డంకురించెను. డిక్కు గజారూఢుడై పులులను వేటాడుచుండ ఫెర్గుసను వృక్షశాస్త్ర నిదర్శనములకై మొక్కలను వెదకుచుండెను. ఏదేశ మేగినను ఫెర్గుసను లండనునగరమునకు తిరిగివచ్చిన వెంటనే స్కాట్లాండున కేగి కొన్నివారములు కెనడీవద్ద గడపుచుండెడివాడు. డిక్కు భూతకాలమును గూర్చియును, ఫెర్గుసను భవిష్యత్తును గూర్చియును మాట్లాడుచుండిరి. టిబెటు దేశమునుండి వచ్చిన

పిదప రెండేండ్ల వరకును నూత్నపరిశోధనలను గురించి ఫెర్గుసను తలపెట్టలేను. అందుచే నాతని ప్రయాణ పిపాసయు, పరిశోధనా క్షుద్బాధయును శాంతిజెందె నని కెనడీ సంతసించెను. కాని ఆఫ్రికా దేశమును దాటుటకు యత్నించుచుండె నని తెలియదు. పరిశోధనము చేయుటయెంతయో నిపుణుడైనను నరమాంసభక్షకులమధ్యను అడవిమృగములనడుమను దిరుగుట ప్రాణహాని కరము. ప్రకృతిశాస్త్రమును వృద్ధిపరచుటకై యిదివరకు పడిన కష్టములతో తృప్తిజెంది యుండు మని కెనడీ తనచెలికానికి సలహా నొసగెను.

ఒకనా డుదయమున దిన తంతి వార్తాపత్రికయందు ఫెర్గుసను వ్రాసిన విమానయానమును గురించి వ్రాయబడిన వ్యాసమును చదివెను.

"ఇతడు ఉదజనివిమానములో కూర్చొని ఆఫ్రికా దేశమును దాటునా? రెండు సంవత్సరముల నుండి యోచించిన దిదియా?" ఆశ్చర్య కోపావేశుడై కెనడీ పలికెను.

కెనడీ నివసించు యింటి యజమానురాలగు ఎల్సైతను నామె ఫెర్గుసను పరిహాసార్హము నుడివి యుండుననని పలుకగా;

"వానిస్వభావము నాకు తెలియదా! వానికి స్వయముగ జనించినబుద్ధియేగాని వేరొండు గాదు. గాలిలో ప్రయాణమొనర్ప కుతూహలమా! రాపులుగులతో పోరాడ సంతోషమా! అట్లు జనకుండ జేసెదనుగాక! వాని యిష్టప్రకారము

జేయనిచ్చినచో నొకనాడు చంద్రమండలమందలి వింతలను చూడ బయలుదేరును." కెనడీ కినుక కన్నుగవ నిప్పునెరసులు నెరయ మెరయ పండ్లు పటపట గొరకుచు, పిడికిలిని బల్లమీద గట్టిగా గ్రుద్దెను. వెంటనే కోపావేశమున ధూమశకటము నధిరోహించి మరుచటి దినమునకు లండనునగరమును జేరెను. ముప్పావుగంట కాలములో ఫెర్గుసను నివసించు గృహమున కేగి తలుపు నైదుసారులు తట్టెను. ఫెర్గుసను స్వయముగా జని తలుపును తెరచెను.

"నీవేనా! కెనడీ!"

"అవును. నేనే."

"వేటతరుణమున లండను నగరమున కేల వచ్చితివి?"

"నీవు వ్రాసిన అవివేక కృత్యమును వారించుటకు."

"ఏమి టా కార్యము?"

"ఈవ్యాసము నమ్మదగినదా?" అని కెనడీ దినతంతి వార్తాపత్రిక నొసగెను.

"ఓ! ఇదియా నీ వనునది! ఆపత్రికలు తమ యిష్టప్రకారము వాగుచుండును. కొంచెము విశ్రమించుము."

"నేను కూర్చొనను. నీవు యీ విమానయానమును జేసెదవా?"

"అవును. ప్రయాణమునకు వలయు సామగ్రి తయారగుచున్నది. నేను——"

"ఆ సామగ్రిని పారవేయుము."

"నాప్రయాణమును గురించి సీకు జెప్పలే దనియా కోపము!"

"అదిగో! నాప్రయాణ మనుచున్నాడు!"

"నాకు కొన్ని తొందరపను లుండుటచే వ్రాయజాలకపోతిని. కాని నీపేర వ్రాయకుండ యెన్నటికిని జనియుండను."

"నేను కోరున దదియే."

"నిన్నుకూడ నా వెంబడి కొనిపోవుదును."

అందుపై కెనడీ కోడెదూడవలె గంతులువైచి.

"మన మిద్దరమును విమానయానము చేయుటకన్న పిచ్చివాండ్రఆసుపత్రికి జనుట మంచిది."

"నిన్ను నా వెంట గొనిపోవుట నిజము. ఎందరో రానున్నారు. నే నందుల కంగీకరించలేదు. నేను చెప్ప బోవుసంగతులను సావధానమనస్కుడవై వినినచో నేను తలంచిన కార్యము మంచి దని నీవే కొనియాడుదువు."

"నీవు చెప్పినది వాస్తవమా?"

"ముమ్మాటికిని."

"నేను రానిచో నేమి జేసెదవు?"

"నీవు తప్పక వచ్చెదవు."

"రాని యెడల?"

"నే నొంటరిగ జనుట నిశ్చయము."

"సరియె. మనము కూర్చొని నెమ్మదిగ మాట్లాడుదము. ఆసంగతి నిజమైనచో వినదగినదే." అని కెనడీ తలయూచుచు బల్లయొద్ద కూర్చుండెను.

"భోజనముచేయుచు మాట్లాడుదము." అని ఫెర్గుసను పలికెను.

వారిద్దరొక చిన్న బల్లకడ కూర్చుండిరి. వారిముందొక పళ్ళెరమున పెద్ద గోధుమరొట్టెయును, మాంసశకలములును, ఒకపెద్ద కడవనిండ కాఫీయును నుంచబడెను.

"శామ్యుయలు! నీవు పూనినకార్యము మిక్కిలి హానికరమైనది. ఈకార్యమును నీవు నిర్వహింపజాలవు. మానవునకు దుర్లభకృత్యములలో నొకటి." అని కెనడీ నుడివెను.

"మనకు సాధ్యమగునో కాదో పిదప యోచింపవచ్చును."

"పిదప యోచించుట యేల? ఆకార్యము మనము చేయలేము."

"ఎందుచేత ?"

"అపాయములు మెండు."

"అపాయములు ఎవరికి తప్పును? బల్లవద్ద కూర్చుండి భోజనముచేయుటమాత్రము అపాయముగాదా! ఈయకాండ

తాండవముతో ప్రయోజన మేమి? భవిష్యత్తునుగూర్చి యోచించుటయే మంచిది." అని ఫెర్గుసను నొక్కి వక్కాణించెను.

"నామాటలను లక్ష్యపెట్టవా? నీ వింకను నిరంకుశాధికారివేనా?" అని కెనడి భుజముల నెగరవేయుచు ననెను.

"అవును, మంచికార్యములలోమాత్రము నిరంకుశాధికారినే. అదృష్టదేవత మన కేమి దాచియుంచెనో యని యోచింపగూడదు. నుదుట వ్రాసిన వ్రాలును తప్పింప నెవరి తరము."

కెనడీ ప్రత్యుత్తర మొసగలేదు. నోరున్నవానిదే రాజ్యము.

"సరే. ఆఫ్రికాను దాటుటకు భూమార్గము లేదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"భూమార్గమున జనుట కష్టము. ఇంతవరకు జనిన పరిశోధకులు పడిన బాధలకు కారణమే యది. మంగోపార్కు నైలునదిమీద చంపబడెను. వోజలనువాడు 'వ్వాడై' దేశములో మాయమాయెను. ఔడ్నె మర్మరువద్ద చనిపోయెను. శకటో వద్ద క్లాపర్టను ప్రాణముల విడచెను. ఫ్రాంసుదేశీయుడైన మొయిజను ముక్కలుగ నరకబడెను. మేజరు లెవింగు టారిగ్గులచే పరలోకప్రాప్తి పొందెను. 1860 వ సంవత్సరము ప్రారంభమున హేంబర్గునివాసియగు రోషరు మరణించెను. ఇంకను కొందరు అకాలమృత్యుప్రవాత బడిరి. వారు చనిపోవుటకు

సుఖ్యకారణములు ఆకలిబాధ, చలి, జ్వరము, క్రూరులచే హింసింపబడుట మొదలగునవి. ఈబాధల ననుభవించకుండ జనులకు మంచిమార్గ మున్నప్పుడేల విడువవలయును? అందుచే అవనీపథము నతిక్రమించి మన మంబరవీధి నేగుటయే మంచిది." అని ఫెర్గుసను గంభీరోపన్యాసము నొసగెను.

"నీవు చెప్పిన సంగతులు సత్యములే. కాని విమాన యాన మింతకన్న నపాయకరముగదా ?"

"అపాయమేమున్నది? విమానమున కపాయము రాకుండ చూచుభారము నాది. అపాయము వాటిల్లినను భూమి మీదకు దిగి కాలినడకను నేగు పరిశోధకులవలె తిరుగవచ్చును. ప్రాణభయముమాత్రి ముండదు. కాని మన విమానమున కట్టి యాపద రాకుండ చూడగలను."

"పడకుండ నెట్లాపగలవు?"

"పడదు. ఆఫ్రికా దేశమును దాటువరకును నిలబడి యుండును. విమానయానముచే మనకు భూమార్గమున జను వారలకు సంభవించు ఎండవానలు, గాలిదుమ్ములు, ప్రతి కూలవాతావరణము అడవిమృగములభయము, క్రూరుల బాధలు కలుగవు. ఎండవేడిమి హెచ్చినచో నూర్ధ్వముఖముగ నేగవచ్చును. చలి హెచ్చినచో క్రిందకు దిగవచ్చును. పర్వతములను, నదులను దాటగలము. రాబోవు గాలివాన, తుపానుల నవలీలగ దాటగలము. శ్రమ విశ్రాంతులు మనలను

బాధించవు. క్రొత్తనగరములపై తిరుగుదుము. కొండగుహాల యందలి ప్రతిశబ్దముగుండియును ప్రతిధ్వనిని పుట్టించునంతటి వడితో మారుతము వీచినను దానితో సమానముగ పరుగిడ గలము. ఆఫ్రికాదేశ మంతయును కాలిక్రింది పటమువలె కాన్పించుచుండ భూమికి సమీపమున తిరుగుచుందుము." అని డాక్టరు నుడువ "ఉదజని విమానములను నడుపు సాధన మును కనుగొంటివా?" అని కెనడీ ప్రశ్నించెను.

"లేదు. అది కలలోనివార్త."

"అయినచో నెచ్చటి—"

"ఎచ్చటికో తెలియదుగాని తూర్పునుండి పడమటకు జనుట నిశ్చయము."

"ఎందువలన?" అని తిరిగి "ఓహో! వాణిజ్యవాయు వులా! వాటిమాటయే మరచితిని. ఏదైననొకటి విమానమును నడుపుటకు కావలెనుగదా!" అని కెనడీ అనుకొనెను.

"సర్వము సిద్ధముగ నున్నది. ఆంగ్లేయరాజ్యాంగమువా రొకస్టీమరును నా యాధీనమం దుంచిరి. ఇంతియేగాక నే ననుకొనిన కాలమునకు మూడు నాలుగు నావలు ఆఫ్రికాదే శపు పడమటితీరమున మనకొరకు తిరుగుచుందును. మూడు నెలలలో మనము జాంజిబారునకు జని విమానమును ఉదజని తో నింపి బయలుదేరవలెను."

"మనమా!"

"ఇంకను నీ కభ్యంతరము గలదా?"

“ నాకు వేయి సందేహములుగలవు. దేశమునుచూచుటకై భూమికి దిగుటకును తిరిగి ఎగురుటకును ఉదజని వ్యయముగును గదా! అందుచే గాలిలో నెంతకాలము తిరుగగలము?”

“ నీ కా యనుమాన మింకను పోలేదు. ఉదజనిలో నొక్క యణువైనను వ్యయపడదు. ”

“ క్రిందకు దిగుటెట్లు ? ”

“ దిగవచ్చును. ”

“ ఎట్లు ? ”

“ అదియే నా రహస్యము. బాగుగా నాలోచించి నా యభిప్రాయమే నీయభిప్రాయముగ భావించి నాకార్యమును నీకార్యముగ నెంచుకొనుము. దిగ్విజయమస్తు! తథాస్తు! ” అని డాక్టరనెను.

“ దిగ్విజయమస్తు! తథాస్తు! ” అందులో నొక మాటకైన నర్థము తెలియకుండగనే చిలుకపలుకలవలె కెనడీ యామాటల నట్లే యుచ్చరించెను. తన స్నేహితుని ప్రయాణము నాపవలెనను తలంపు మాత్ర మింకను కొంచెము గలదు. శాముయలు తన ప్రయాణమునకు వలయు సామగ్రిని నేకరింపనేగెను.

---

# నాలుగవ అధ్యాయము

ఫెర్గుసను నిర్ణయించిన అంబరతల ప్రయాణమే నిరపాయకరమైనది. జాంజిబారు ద్వీపమునుండియే బయలుదేరుటకు కొన్ని కారణములు గలవు. జాంజిబారు ద్వీపము నిరక్షరేఖకు దిగువ 430 మైళ్ళ దూరమందున్న అక్షాంశరేఖయందలి 6 వ కళయందు నెలకొనియున్నది. నైలునదీ జన్మస్థానమును కనుగొనుటకును, ఆదారియందున్న సరస్సులను చూచుటకును పూర్వము కొందరీద్వీపమునుండియే బయలుదేరిరి.

1849 వ సం॥న డాక్టరు బార్తు అను పరిశోధకుడును, 1858 సం॥న బర్టను స్పెకీగార్లును, భూమార్గమున జని సాంతముగ జూడకయే తిరిగివచ్చిరి. ఫెర్గుసను బార్తు స్పెకీగార్ల కార్యమును కొనసాగింప బూనుకొనెను.

సుదానుదేశమునుజూడ నేగిన రిచ్చర్డుసన్ అను పరిశోధకునికి సహాయార్థమై బార్తు ఓవ్విగ్గులు బయలుదేరి ట్యునిసు పట్టణమున నతనిని కలుసుకొని యచ్చటనుండి మువ్వురును ట్రిపోలీ, మర్జుకు పట్టణముల జూచి, ఏస్పియాను యెడారి లంక మీదుగా ఏషదీసు పట్టణమున కేగి, ఏస్పియానునకు తిరిగివచ్చి కాన్నుపట్టణమునుజూచి ఔరకోలో గ్రామమున కేగిరి. రిచ్చర్డుసన్ చనిపోవుటచే బార్తు ఓవ్విగ్గులిద్దరు కౌకా నగరము మీదుగా ట్రిపోలీ, నోర్నో పట్టణములజూచి 1851

సం॥రం మార్చి 29 తేదినాటికి చాడు సరస్సు దక్షిణతీర మును జేరగలిగిరి. అచ్చటనుండి జోలావల్లెనుజూచి కౌకానగరమునకు తిరిగివచ్చి, మందబర్గము, కానసువల్లెలను జూచి మెసనా పట్టణమున కేగిరి.

ఓవర్వెగ్గుకూడ చనిపోవుటచే బార్తు ఒంటరిగ శకటూ నగరమును జూచి నైజరునదిని దాటి టింబక్టూ పట్టణమున యెనిమిదినెలలు నివసించి యాపురవాసులచే బాధపడి 1855 సం॥ ఆగష్టు నెలాఖరుకు ట్రిపోలీపట్టణమునకు తిరిగివచ్చెను. స్నేహితులందరిని గోల్పోయి సెప్టెంబరు 6 వ తేదీనాటికి బార్తు లండను నగరమును జేరెను.

బార్తు ఆఫ్రికా దేశమున ఉత్తర అక్షాంశరేఖయందలి 4 వ కళను పశ్చిమధృవరేఖయందలి 17 వ కళను దాటలేదని ఫెర్గుసను నోటుపొత్తమున రచించియుండెను.

బ్రిగారోలెట్టు, పెనిటు, మయానీ, ఏండియాడిబోనో, గిలామ, లెజీను మొదలగు పరిశోధకులు 18 వ శతాబ్దములో అయిదారు కళలు అనగా 360 మైళ్ళదేశమును మాత్రమే చూడగలిగిరి.

1768 సం॥న బ్రూసు, 1844 సం॥న క్రాప్, రెబ్మను అనువారలున్ను హయార్లిగ్, తోరగటగ, మెయిజను, డోవరు మొదలగు పరిశోధకులు 1859 వ సం॥ వరకును ఆఫ్రికాదేశ మందలి కొన్ని పట్టణములను చూచిరి.

1857 వ సంవత్సరమున బర్టను స్పెకీగార్లు లండను నగర భూగోళ పరిశోధనా సంఘమువారిచే ఆఫ్రికా దేశపు సరస్సులను జూచుటకు పంపబడిరి. వారు జాంజిబారును జూన్ 17 వ తేదీని వీడి పశ్చిమముగానున్న కెజా నగరమును నాలుగు నెలలకు జేరుకొనిరి. కెజానగరము మంచి వర్తకస్థానము. అచ్చట జనుల ఆచార వ్యవహారాదులు, రాజ్యాంగపద్ధతులు మతాచారములు మొదలగువాటిని గురించి బర్టను స్పెకీగార్లు కొన్ని గ్రంథములను వ్రాసిరి. 1858 ఫిబ్రవరి 14 వ తేదీ నాటికి దక్షిణ అక్షాంశరేఖలోని ౬,౮వ కళలకు మధ్య నెలకొని యున్న టాంగు న్యైకా యను గొప్ప సరస్సును చూడగలిగిరి. ఆసరస్సుతీరమున నరమాంసభక్షకులు నివసించియుండిరి.

ఆసరస్సును మేనెల 26 తేదీని వీడి, జూన్ 20 తేదీకి కెజానగరమున కేతెంచిరి. బర్టనచ్చట మూడుమాసములు వ్యాధి పీడితుడై యుండ స్పెకీ ఒంటరిగ ఉత్తర దిశగా మూడు వందలమైళ్ళ దూర మేగి ఉకురూ సరస్సును ఆగస్టు 3 వ తేదీ నాటికి చేరగలిగెను. ఆగస్టు 25 తేదికి స్పెకీ కెజానగరమునకు తిరిగివచ్చి బర్టనతో 1859 మార్చి నెలలో జాంజిబారు ద్వీపమునకు చేరెను.

వారిద్దరును ఇంగ్లాండు దేశమునకు జని పేరిసు పరిశోధనా సంఘమువా రొసగిన వార్షికబహుమానమును బడయుగలిగిరి.

బర్టను స్పెకీగార్లు దక్షిణ అక్షాంశరేఖయందలి రెండవ కళను తూర్పు ధృవరేఖయందలి 29వ కళను దాటలేదని డాక్టరు ఫెర్గుసను తన నోటుపొత్తమున రచించి యుండెను.

బర్టను స్పెకీగార్లు చూచిన దేశమునకును, బార్తు చూచిన దేశమునకును మధ్యగానున్న దేశమును చూడవలెనని ఫెర్గుసను పూనుకొనెను. ఈమధ్యదేశము 720 మైళ్ళు పొడవుగలిగి 12 కళల నావరించియున్నది.



# ఐదవ అధ్యాయము.

ఫెర్గుసను బయలుదేరుటకు వలయు సామగ్రిని సేకరించుచుండెను. ఉదజని విమానమును చేయించుచు, చేయువిధానమును రహస్యముగ నుంచెను. అరబ్బీభాషలను మాండింగియను భాషలను నేర్చుకొనుచుండెను. కెనడీ ఫెర్గుసనును విడువలేదు. తనకు తెలియనీయక యేవిమానములో నెక్కి పారిపోవునో యన్న భయ మాతనిని విడువలేదు. కెనడీ వాదములన్నియు ఫెర్గుసను ప్రతివాదములచే నిరుత్తరములగుచుండెను. అందుచే తనమాట చెల్లదని కెనడీ భయపడుచుండెను. అతని స్థితి మిగుల విచారకరముగ నుండెను. నీలమేఘావృతమగు నాకాశమునుగాని, విమానమునుగాని తలచుకొనినప్పుడెల్ల నాతని

గుండెలు ఝల్లుమనుచుండెను. నిద్రాలోపసహితము విమానయానమువలన గలుగబోవు శిరోభారమును పొందినట్లును, కొన్ని యోజనముల యెత్తుననుండి క్రిందపడినటులను కల గనుచుండెను. ఈపీడకలలు వచ్చినపుడు మంచముమీదనుండి క్రింద పడెను. అట్లుపడినపుడు తగిలిన దెబ్బను ఫెర్గుసనునకు చూపించెను.

"చూచితిరా! గజము యెత్తుననుండి పడినందుననే ఇంత దెబ్బతగిలినది!" అని కెనడీ విచారసూచకముగ ఫెర్గుసనుతో నుడివెను.

"మన కట్టిభయము లేదు."

"పడినచో?"

"ఎన్నటి కట్లు జరుగనేరదు"

కెనడీ మారుపలుకలేదు. ఫెర్గుసను కెనడీతో మాట్లాడునపుడు కెనడీని తనసహచరునిగ గైకొని ఉత్తమపురుష బహువచనమును తరుచుగ ప్రయోగించుచుండెను. అందువలన కెనడీ తనకు వశుడగునని భావించెను.

"మనము ఎక్కుచున్నాము. మనము సిద్ధముగ నుండవలెను. మనము......రోజున బయలుదేరుదము. మన విమానము, మనపరిశోధనలు, మనసన్నాహము" మొదలగుపదములను ఫెర్గుసను వుపయోగించుటచే కెనడికి కష్టముగ నుండెను.

తాను జనకుండుటకు నిశ్చయించినను పెనుభూత మావహించినటుల భయపడసాగెను. ఫెర్గుసనుతో నే మాటయు ధైర్యముగ నుడువజాలకుండెను. కారణములేకయే ఎడింబరో నుండి తనదుస్తులను, తుపాకులను తెచ్చుటకు సేవకుని పంపెను. ప్రయాణమున సహాయముండదని తోచినను, ప్రయాణము నాపవలెనను తలంపాతనిని పూర్తిగ విడువలేదు. తనకుతోచెడి సందేహములతో ఫెర్గుసనును తరుచుగ వేధించుచుండెను.

“నైలునది యుత్పత్తిస్థానమును కనుగొనుట ముఖ్యమా? మానవలోకమున కదెటుల నుపకారి యగును? ఆఫ్రికా దేశజులకు నాగరికత గరపిన నేమిలాభము? ఆంగ్లేయ నాగరికతయే ఉత్తమోత్తమ మనుటకు నిదర్శనము లేమి గలవు? ఆఫ్రికనుల నాగరికతయే యుత్తమ మేల కాగూడదు? ఈప్రయాణము కొంతకాల మాపగూడదా! కొన్నిరోజులలో ఆఫ్రికా దేశము యితరదేశీయులకు కొట్టినపిండి యగునే! అప్పుడింత ప్రయాస ముండదుగద! స్వల్పకాలములో ఆఫ్రికా దేశము యితరదేశీయులు నివసించుటకు నిరపాయస్థల మగునేమోగదా!” ఇటువంటి ప్రశ్నలు కెనడీ వేయుచుండుటచే ఫెర్గుసను భయపడి త్వరగ బయలుదేరుటకు నిశ్చయించెను.

“కెనడీ! ఆకీర్తిని నేను బడయుచుండ చూడజాలవా? రాయలుసంఘమువారు నాకు చేసిన మర్యాదను నిలబెట్టుకొనుట నీకు యిష్టము లేదా?” అని ఫెర్గుసను కెనడీని ప్రశ్నించెను.

"కాని..." అనుమాట కెనడీకి సులభముగ వచ్చుచుండెను.

"నాప్రయాణమువలన తెలియు సంగతులు ప్రస్తుత పరిశోధకులకు సహాకారిగదా! ఆఫ్రికా గర్భమున కొందరు మానవులు నివసించుచున్న దెరుగవా!"

"కాని......"

"నేనుచెప్పు సంగతులను వినుచు యీపటమును చూడుము." కెనడీ చూచుచుండెను.

"నైలునది పొడవునను చూచుచు గొండొకోరో వరకును జనుము."

"ఆ! ఇదిగో గొండొకోరో యిచ్చట నున్నది."

"అచ్చట కంపాసుతో నొకచుక్క పెట్టుము. ఆస్థానము నెంతటి సాహసుడైనను దాటలేదు. జాంజిబారు ద్వీపపు తీరమున దక్షిణ అక్షాంశ రేఖలోని ఆరవకళను చూడుము."

"కనబడినది."

"దాని వెంబడి కెజా వరకును జనుము."

"కెజా కనబడినది."

"ఇప్పుడుధృవరేఖయందలి 33 వ కళ కై పైనచూడుము ఉకెరూ వరస్సు కనబడగలదు. అచ్చట స్పెకీ చనిపోయెను.

"నేనచ్చటనే యున్నాను. కొంచెము పైకేగినచో సరస్సులో పడియుందును. మీరు పైకి లాగలేకపోవుదురు."

"సరే! దానితీరమున నివసించు అడవిజాతివారు నుడువు సంగతులచే మన మేమి యూహింపవచ్చునో నీకు తెలియునా?

"తెలియదు."

"ఈసరస్సు అక్షాంశరేఖలోని రెండవ కళయందలి 30వ కళవరకును వ్యాపించియుండి దాని కుత్తరదిశగా చిన్నప్రవాహ మొండు బయలుదేరి నైలునదిలో కలియుచున్నదనియును."

"ఇది చాల వింతగనున్నదే!"

"కంపాసుకొనను ఉకెరూ సరస్సుకొనయందు గుచ్చి యీ రెండుచుక్కలమధ్య నెన్నికళలు గలవో చూడుము?"

"సుమారు రెండుకళలు గలవు."

"రెండుకళ లన్న నెంతదూరము?"

"తెలియదు."

"రెండుకళ లన్న 120 మైళ్ళు. ఇప్పుడు జరుగుచున్న సంగతి నీకు తెలియునా?"

"తెలియదు."

"భూగోళ పరిశోధనాసంఘమువారు స్పెకీ కనుగొనిన సరస్సును తమ కార్యములకు కేంద్రస్థానముగ భావించిరి. స్పెకీయును, హిందూ సైన్యాధిపతియగు గ్రాంటనువాడును పరిశోధనకై కొంత సైన్యముతో బయలుదేరిరి. వీరు ఆ

పరస్సును నలువైపులను చూచుటకును, గొండాకోరోవరకును జనుటకును ప్రభుత్వమువారి సమ్మతిని పొంది 5000 పౌనుల ద్రవ్యసహాయమును గూడ బడసిరి. పరిపాలకులు కొంత సైన్యమునుగూడ వారి స్వాధీనమం దుంచిరి. రాయల ప్రతినిధి యగు జాను పెతెరిక రాణీగారిచ్చిన 700 పౌనులను పుచ్చుకొని ఖార్తోమువద్దనున్న ధూమనౌకనిండ తిండి సామగ్రి నిడి గొండొకోరోకును గొనిపోయి స్పెకీ దండున కొసగునటుల యాజ్ఞాపింపబడెను."

"కాలినడకనా?"

"అవును, భూమార్గముననే. కాఫ్ అను పరిశోధకుడు నైలునది వెంబడి జనుటకె యత్నించుచున్నాడు."

"అతడుకూడ కాలినడకనేనా?"

"కాదు కంచరగాడిదమీద నెక్కి. కారాములో నున్న డిహాబ్లీయను సహాయప్రతినిధి యొక సంఘము నేర్పరచి ఓజలను పరిశోధకుని వెదకుటకె నియోగించెను. నోజలునకు స్నేహితుడును సహాచరుడును నగు వార్కను తనతండ్రికి వ్రాసిన జాబులు చూడ ఓజలు 'వారా' యొద్ద ఖైదిగ నుంచబడెనని తెలియనయ్యె. అతనిని చెరవిడిపించి తీసికొనివచ్చుట కొరకు డిహాబ్లీ ప్రానుకొనెను. వీటర్మను సంఘకార్యదర్శిగా నుండి వలయు ఖర్చులను ప్రకృతిశాస్త్రజ్ఞులనుండి చందాలుగా పొబ్బెను. ఆసంఘము మెసోవానుండి బయల్వెడలి నైలు

నదికిని చాడు సరస్సునకును మధ్యనుండు దేశమును వెదకుటకు ప్రానుకొనెను. అందుచే మనము చూడదలచుకొనిన దేశము చూడబడును.”

“బాగున్నది. అందరు పరిశోధకులు జనుచుండ ఆవృథా కార్యమునకు మన మేల ప్రానుకొనవలెను?”

ఫెర్గుసను కెనడీకి ప్రత్యుత్తర మొసగలేదు.

---

## ఆరవ అధ్యాయము

ఫెర్గుసనున కొక సేవకుడు గలడు. వానిని జో వని పిలచె దరు. యజమానునికి వినయ విధేయతగ సేవజేయుచు యజ మానుని యాజ్ఞలను శిరసా వహించుచుండెను. ఫెర్గుసను వాని మంచి స్వభావమును కనుగొని యింటిపెత్తనము వాని కొసగి ప్రతికార్యమును వానిచేతనే చేయించుచుండెను. జోవు తన య జమానుని రుచియే తనరుచిగ భావించి వంటచేయును. ఫెర్గుసను తీన బీగములను కూడ జోవున కొసగెను. ఆఫ్రికా దేశమును దాటవలెనని ఫెర్గుసను తలచినపుడే జోవుకూడ ఆతనివెంట జనుటకు నిశ్చయించెను. ఫెర్గుసనున కంతటి నమ్మకమైన బంటింకొకడు లేడు.

జంతుప్రదర్శనారామమునందలి వానరములకు కన రతు నేర్పుననిని జోవున కియ్య నొప్పు. దుముకుట, ఎగురుట

చెట్లెక్కుట మొదలుగాగల విద్య లతనికి తృణప్రాయములు. ఫెర్గుసను మేధావికి కెనడీ భుజమైనచో జోవు కుడిచేయి యగును. ఫెర్గుసనుతో పెక్కుప్రయాణములు చేసియుండుట చే జోవునకు ప్రకృతిశాస్త్రజ్ఞానము కొంతకలదు.

జోవునకును కెనడికిని ప్రయాణమునుగూర్చి వాదప్రతివాదములు జరుగుచుండెను. జోవు సహేతుకముగను కెనడీ విరుద్ధముగను చర్చించుచుండిరి.

"కెనడీ!" అని జోవు పిలచెను.

"ఎందుకు?"

"కాలము మీరుచున్నది. చంద్రమండలమున కెగురుచున్నటుల దోచుచున్నది?"

"చంద్రమండలమా? అపాయకరమగు ప్రయాణమే!"

"అపాయకరమా! ఫెర్గుసనుగా రుండ అపాయ మేమి!"

"జోవు! నీవు నుడువునది వాస్తవమే. కాని ఫెర్గుసను వ్రాసిన కార్యము మూర్ఖపుపట్టుదలతో కూడినది. అతడు బయలుదేరకుండును గాక!"

"బయలుదేరడా! బారోనగరమునందలి మెకేలుకర్మాగారమునందు తయారగుచున్న విమానమును జూడలేదా!"

"నేను మాత్రము రాను."

"ఆప్రయాణమున జూడబోవు వింతలు మనదృష్టిపథమ

బున నెన్నడైన బడునా? ఆహా! ఆవిమానము సహితమెంత చక్కగా నున్నది. మన మందులో సౌఖ్యముగ నుండవచ్చును.'

"యజమానునితో జనుట నీ కిష్టమా?"

"ముఖ్యముగ. యజమాను డెచటి కేగినను నే నాతనిని వెంబడించుట నిశ్చయము. మన మింతకాలము కలసి మెలసి యుండగా యజమానుని వీడియుండు టెట్లు? యజమానుడు కష్టపడుచుండ చూచువా రెవ్వరు? వ్యాధిగ్రస్థుడైనచో పరిచర్య చేయువా రెవ్వరు? జోవు తనయజమానుని వీడి నిముషమైన నుండజాలడు." అని జోవనెను.

"ఎంతటి శూరుడవు."

"నీవుకూడ వచ్చుట లేదా?"

"వచ్చెదను. నేనువచ్చు టెందులకో తెలియునా? ఫెర్గ్యుసను పూనిన కార్యమును వారించుటకే! జాంజిబారువర కేగి అచ్చటినుండి మరలునట్లు చేయుదును."

"కెనడీ! ఎంత అమాయకుడవు. తాను చేయదలంచిన పనిలోని మంచి చెడుగులనన్నిటిని మునుముందే సమగ్రముగ పరిశీలించి పిదప కార్య మొనరించుటకు ఫెర్గుసను సంసిద్ధుడగును. అటుల నారంభించిన కార్యము నంత మొందింపక పరిత్యజింప జేయుటకు దైవమునకైన తరముగాదు."

"ఆతని ప్రయాణము నెవ రాపుదురో నీవే చూచెదవు గాక!"

"అట్టితలంపు నీకుండుటవలన ప్రయోజనము లేదు నీముఖ్యకర్తవ్యము మా వెంబడివచ్చుటయే. నీవంటి వేటగానికి ఆఫ్రికా దేశము ముఖ్యముగ పోవలసిన ప్రదేశము. మా వెంట రానిచో మిగుల విచారించెదవు.

"ఫెర్గుసను నాసహేతుక మగు వాదనకు లోబడినచో నేను విచారించను."

"మనభారము నేడు ఫెర్గుసను తూనికవేయు నన్నసంగతి నీకు తెలియునా?"

"ఏమి? మనము కూరగాయలమా, తూనికవేయబడుటకు?"

"కూరగాయలము కాకపోయినను మనభారము విమాన పరిమాణ మేర్పరచుటకు కావలయును."

"నేను తూపించుకొనను."

"తూపించుకొననిచో విమాననిర్మాణ మెట్లు?"

"తూనికవేయకుండగనే విమానమును నిర్మింపవలెను."

"తూనికలేనిదే విమానము నిర్మింపబడదు. భారము హెచ్చినచో విమాన మెగురజాలదు."

"ఎగురకుండుటయే నాకు కావలసినది."

"రా; యజమానుడు నీకొరకు వేచియున్నాడు."

"నేను రాను."

"యజమానుడు లేనందున అట్లనుచున్నావు. అతనే రమ్మనినచో మారుపలుకక వచ్చెదవు."

"నేను రాను."

ఆసమయమున ఫెర్గుసను ప్రవేశించి కెనడీ ముఖపర్చస్సునుజూచి "కెనడు, జోవుతో కలిసి రమ్ము. గుమ్ములను తూపించవలెను." అనెను.

"కాని—" అని కెనడీ ప్రత్యుత్తర మీయుచుండ "సీటోపి ఇదిగో! తలపైనిడుకొని రమ్ము." అని డాక్టరనెను. కెనడీ మారుమాటాడక ఫెర్గుసనును వెంబడించెను. వారు ముగ్గురును మైకేలు కర్మాగారమున కేగిరి. కెనడీని భారపుకాటామీది కేగుమనినప్పుడు మారుపలుకక తా నట్లు చేయుటచే తన యుద్దేశమునకు భిన్నము కా దని తలచి ఫెర్గుసను చెప్పినట్లు చేసెను.

"నూటయేబది మూడుపౌనులు" అని ఫెర్గుసను చదివెను.

"నేను తేలికగ నుందును." అని జోవు కాటామీద కేగెను.

"నూటయిరువది పౌనులు" అని డాక్టరనెను.

"నాభారము నూటముప్పదియైదు" అని డాక్టరు ముగ్గురిభారములను నోటుపుస్తకమున రచించెను.

"ముగ్గురము జేరి 400 పౌనులకన్న నెక్కువ లేము,"

"నీప్రయాణమున కవసరమైనచో నేను ఇరువది పౌనులవరకు తగ్గెదను" అని జోన్సు అనెను.

"నీ వటుల చేయుటచే లాభములేదు. మాత్రిగా తినుచుందుము. ఈపౌనును తీసికొనుము." అని డాక్టరు కపౌనును జోన్సున కొసగెను.

---

## ఏడవ అధ్యాయము.

వినువీధి జరించు విమానపరిమాణమును గురించి ఫెర్గుసను యోచించి విమానము చిన్నదిగా నుండుటకయి విమానమును ఉదజనితో నింపుట కేర్పాటుచేసెను. గాలికన్న ఉదజని 14½ రెట్లు తేలికపదార్థము. ఉదజనివాయువును స్వల్పవ్యయముతో చేయనగును. వెంటగొనిపోవు పనిముట్లు, తొట్టి, బుట్ట, మనుజులభారము మొదలయినవి చేర్చి లెక్కించిచూడ నాలుగువేల పౌను లయినది. అంతటి భారము కొనిపోవుట కెంతటి శక్తికావలయును? పట్టువస్త్ర మెంత కావలయును?

49566 ఘన అడుగుల గాలిబరువు 4000 పౌనులు. ఈ ఘనపరిమాణముగలగాలిని స్థానాంతర్గతము చేసినయెడల 4000 పౌనుల భారమును కొనిపోవుశక్తి కలుగును. విమానము 49566 ఘనఅడుగులపరిమాణమును గలిగియుండి దానిని 14½ర రెట్లు తేలికగనున్న ఉదజనితో నింపినయెడల 3724 పౌనుల భారము

మిగులును. లోపలనుండు ఉదజనికిని పైనుండుగాలికినిగల భార వ్యత్యాసముచే విమానమునకు గాలిలోనెగురుశక్తి కలుగుచున్నది. విమానము 49,566 ఘనఅడుగుల ఉదజనితో నింపబడి ఉదజనికన్న తక్కువ తారతమ్యగరిమగల వాయుప్రదేశమునకు గొనిపోబడినయెడల విమానపు బుట్టలోనుండు ఉదజని రేణువులశక్తి హెచ్చి పైనున్న వాయుపీడనతో సమమగువంతవరకు ఉదజని పరిమాణము హెచ్చుచుండును. అందుచే పట్టువస్త్రము చిరిగి విమానములోనున్న మనుజుల కపాయము వాటిల్లును. విమానములు మూడింట రెండుభాగములు మాత్రమే ఉదజనితో నింపబడినయెడల విమానపుగుడ్డ కపాయము వాటిల్లదు. ఫెర్గుసను సగభాగము మాత్రము ఉదజనితో నింపనెంచెను. విమానపు అడ్డకొలత 50 అడుగులు. నిడివికొలత 75 అడుగులు. ఈపరిమాణ మపూర్వముకాదు. 1784 వ సంవత్సరమున లియన్సునగరములో మాంటుగోల్ఫియరు అనువాడు 34,000 ఘనఅడుగుల పరిమాణముగల విమానమును తయారుజేసి దానితో 20 టన్నుల భారము నెత్తగలిగెను.

ఫెర్గుసను రెండువిమానముల నుపయోగించుచుండెను. ఒక విమానపుగుడ్డ అంబరవీధిని చిరిగినను రెండవవిమానముండుటచే ప్రాణాపాయముండదు. రెండువిమానములను జంటగ నడుపుట కష్టము. ఉత్పతనశక్తి సమానముగ నుంచుట

కష్టతరము. అందుచే పైనుదివిన పరిమాణము గల పెద్ద విమానములో 45 అడుగుల అడ్డకొలతయును 68 అడుగుల నిడివి కొలతయును గల రెండవ విమాన మమర్చబడెను. చిన్నవిమానము పెద్దవిమానములోని ఉదజనిలో వ్రేలాడు చుండును. వాయువల్యము ఒక విమానములోనుండి రెండవ విమానములోని కమర్చబడియుండెను. అందుచే రెంటియం దలి ఉదజనిని కలుపవచ్చును. దిగునపుడు చిన్నవిమా నములోని ఉదజని వ్యయపడకుండ వల్యమును మూసి పెద్ద విమానములోని ఉదజనినే వినియోగింప నగును. పై విమానములోని ఉదజనియంతయు వ్యయమయినచో పైవిమానపుగుడ్డను పారి వేయవచ్చును. అందుచే విమానపుభారము చాలవరకుతగ్గును. అప్పుడు విమానము సరంగునకు లొంగియుండును. పైవిమాన మాకస్మికముగ చిరిగినను రెండవవిమానము దాని స్థానము నాక్రమించును.

రెండు విమానములును రబ్బరుతో పూతపూయబడిన గట్టాపెర్చా యను మెత్తని పట్టుగుడ్డతో చేయబడినవి. గట్టా పెర్చా నీటిని జొరనీయకపోవుటయేగాక ఆమ్లములచే చెడదు. విమానమున కాయువుపట్టైన బుట్టపైభాగమునందలి పట్టుగుడ్డ జంటగానున్నది. ఈ పట్టుగుడ్డ ఉదజనివాయువు నెంతకాలమైన నాపగలదు. పైవిమానపువైశాల్యము 11,600 చదరపు టడు

గులు, చిన్నవిమానపు వైశాల్యము 9,200 చదరపులడుగులు. పెద్దవిమానపు పట్టుగుడ్డభారము 650 పౌనులు. చిన్నవిమానపు పట్టుగుడ్డభారము 515 పౌనులు.

మనుజులు కూర్చొను తొట్టెని వహించు వల పట్టుతాళ్ళ టితో చేయబడినది. తొట్టి గుండ్రముగానుండి 15 అడుగులు అడ్డకొలతను గలిగి పేముతో నల్లబడినది. కుదుపులేకుండుటకై తొట్టి కడుగుభాగమున కమానులమర్చబడియుండెను. వల యొక్కయు బుట్టయొక్కయు భారము 280 పౌనులు.

ఫెడ్డసను యినుపరేకులతో నాలుగుపెట్టెలను చేయించి వాటిని యినుపగొట్టములతో సంధించెను. రెండంగుళముల సర్పాకారపు గొట్టము 25 అగుడుల పొడవును 15 అడుగుల వెడల్పునుగలిగి రెండుశాఖలుగ నేర్పరుపబడెను. నాలుగు పెట్టెలు తొట్టిలో నడుగుభాగమున నుంచబడెను. ప్రవాహ విద్యుచ్ఛక్తి సామగ్రిలభారమున్ను, 25 గేలనుల నీటి భారమున్ను చేర్చి 700 పౌనులు. విమానముతో కొనిపోబడు నితర పరికరముల వివరము:— రెండు భారమాపకములు, రెండు ఉష్ణమాపకములు, రెండు నావికాఅయస్కాంతములు, రెండు సున్నితకాల పరిమాణయంత్రములును, దూరదర్శనియును. గ్రీనువిచ్చి నక్షత్ర గణితశాలయందు భౌతికప్రయోగములు చేయుటకు ఫెడ్డసనున కనుజ్ఞయీయబడెను.

విమానముతో యినుపలంగరులు మూడు, పట్టునూలుతో గట్టిగాను తేలికగాను చేయబడిన యేబదియడుగుల నిచ్చెన యును, తేయాకు, కాఫీపొడి, బిస్కట్లు, ఉప్పుతో ఊరవేసిన మాంసము, పచనముచేసినకూరలు, సారాయి, 22 గేలనుల నీటిపీపాలు రెండు, ఒకగుడారము, రెండు కంబళ్ళు, తుపాకులు, రవ్వలు, ఘాటాలు, తుపాకిమందు, గుండు మొదలగు సామాను కొని పోబడుచుండెను.

విమానపు భార వివరము:—

| | | |
|---|---|---|
| ఫెర్గుసను | 135 | పౌనులు |
| కెనడీ | 153 | ,, |
| జోవు | 120 | ,, |
| పెద్దవిమానము | 650 | ,, |
| చిన్నవిమానము | 510 | ,, |
| తొట్టి వల | 280 | ,, |
| ఇతరపనిముట్లు | 190 | ,, |
| ఆహారపదార్థములు | 386 | ,, |
| నీరు | 400 | ,, |
| ఉదజనిపరికరములు | 700 | ,, |
| ఉదజనిభారము | 200 | ,, |
| | 3724 | పౌనులు |

తాత్కాలికముగ నుపయోగపరచుటకు 276 పౌనుల స్థిరత్వభారమును చేర్చినచో 4000 పౌనులైనది.

# ఎనిమిదవ అధ్యాయము.

రెండు విమానములును తయారైనవి. ఒకవిమానములో నొక విమాన ముంచబడెను. ఉదజనితో పూరించిచూడ లోప మేమియును కాన్పించలేదు.

జోవు మిగుల నాతురుడై యుండెను. గ్రిఫు వీధినుండి మైకేలు కర్మాగారమునకు పలుమారు తిరుగుచుండెను. అడిగి నను అడుగకున్నను విమానయానమునుగూర్చి జోవు ప్రీతిమను జునితోడను ముచ్చటించుచుండెను. విమానము నితరులకు చూపించినపుడును యాజమానుని ప్రయాణము వర్ణించునపు డును జోవు చేతిలో ఒకటి రెండు షిల్లింగులు పడుచుండెను.

ఫిబ్రవరి 16 వ తేదీని రిజల్యూటు నౌక గ్రినువిచ్చి వద లంగరును వేసెను. ఆనౌక 800 టన్నుల భారముగలది. కేమ్సురాసు ధృవపరిశోధన కేగినపుడు ఆహారములను గొని పోయిన దీనావయే. ఈనావనాయకుడగు పెనటుశాంతమూరి. రిజల్యూటు నావయందు నాలుగు ఫిరంగులు గలవు. అవి అంత వర కే ప్రాణిని పూరించి మెరుగవు. ఫిబ్రవరి 18వ తేదీని నరం గులు విమానమును నావలోని కెక్కించిరి. పనికరములన్నియు నావలో నుంచబడెను. ఉదజనిని తయారుచేయుటకై పదిటన్నుల గంధకి కామ్లమును, పదిటన్నుల యినుమును కొనిపోబడెను.

ఫెర్గుసను నడుపు కెనడీకిని నావలో రెండుగదులు ప్రత్యేకింపబడె ను. కెనడీకి ఫైరునను వెంట జనుట కిష్టములేకున్నను రెండుజోడు

గుండ్ల తుపాకులను, ఎడింబరోత్రో పధ్రియను వానిచే తయారు కాబడిన బందూకును, 6 గుండ్ల పిస్తోళ్ళను రెండింటిని, తుపాకి మందును, సూటాలను, రవ్వలను, గుండ్లను తీసికొని కెనడీ ఫెర్గుసనుతో నావ నధిరోహించెను. రిజల్యూటు నావాధికారి యును అతని పరిజనమును ప్రియాణీకుల కాహ్వానమొసగిరి. జోవు సంతోషమును వెలిగ్రక్కుచున్నను కెనడీమాత్రము మౌనమును వహించియుండెను. ఫిబ్రవరి 20 వ తేదీని భూగోళ పరిశోధనాసంఘము తరపున వైమానికులకు విందొసగబడెను. నావ నాయకుడును వాని పరివారమును విందున కతిథులుగ జనిరి. అతిథి యభ్యాగతులెల్లరును ఫెర్గుసను కెనడీ జోవుల భావిసౌఖ్యప్రాప్తిసూచకముగ సారాయిని తృప్తికరముగ గ్రోలిరి. అందు కెనడీనామ ముచ్చరింపబడినపు డతని వదనకాంతులు కొంచె మెర్రబారెను. దాస నతిథులు అజ్ఞానసంజనిత వినమ్రభావచిహ్నముగా దలంచిరి. వారు ఫలహారములను భుజించుచుండ చక్రవర్తిని “ఫెర్గుసను కెనడీలు పూనిన కార్యము నెరవేరునుగాక” అను యాశీర్వచనమును తంతిమూలముగ తెలియబరచెను. రాణిగారి క్షేమమునకై సారాయిని తిరిగి గ్రోలిరి. భోజనానంతరము పరిశోధకులకు కరస్పర్శముల నొసంగి విందునకు విచ్చేసిన బంధుగులందరును తమతమయిండ్ల కేగిరి. వెస్టుమినిష్టరు వంతెనవద్ద వేచియున్న నావలోనికి వైమానికులు ముువ్వురు నెక్కిరి. నాయకుడు తనపరివారముతో నావ నధి

రోహించిన వెంటనే నావ తేమ్సునదీ ముఖద్వారమునుండి గ్రీనువిచ్చి చేరెను. అచ్చట వేచియున్న రిజల్యూటు ధూమ నౌక (steamer) లోని కేగి వైమానికులును సరంగులును నిదురించిరి. రిజల్యూటుస్టీమరు 21 వ తేదీ ప్రాతఃకాలమున ధూమమును విడుచుచుండెను. అయిదుగంటలకు లంగరు లూడదీయబడెను. నావయందలి జనులందరును విమానమును గురించి మాట్లాడుచుండిరి. ఫెర్గుసను పూర్వపు పరిశోధనల నీవిధముగ వర్ణించెను.

"డువేరియర్ యనువాడు ఉత్తరసహారా యెడారిని చూచి టౌరిగ్గుయోధులను కొందరిని పేరిస్‌నగరమునకు గొనిపోయెను. ఫ్రెంచిరాజ్యాంగమువారు రెండుసంఘములను బంపగా నొక సంఘము సహారా ఉత్తరదిశనుండియును ఒక సంఘము దక్షిణదిశనుండియును బయలుదేరి రెండుసంఘము లును టింబక్టూయొద్ద కలిసెను. దక్షిణమునుండి విలింగుస్టన్ 1862 సం||రం మార్చినెలలో మెకంజీతో 'రొవ్రూనియా' యను నదీతీరమును జూచెను. ఆరువేల సంవత్సరములనుండియు జనుల కందని మాత్రినిఫలమై వారిమానసముల నువ్విళ్లూర జేయు ఆఫ్రికాదేశమందలి పెన్నిధానసీమ లీనాటికి కరతలామలకము, కరగతమన్నమాట చెలంగుటచే పరిశోధకుల ప్రయత్నశతములు పందొమ్మిదవ శతాబ్దాంతమునకు ఫలవంతము లయ్యెనని ముమ్మాటికి నొక్కి వక్కాణింపవచ్చును."

స్టీమరులోని సభ్యులెల్లరును ఉపజనిభారమునుగూర్చి ప్రశ్నింప ఫెర్గుసను వారిసందేహముల నన్నిటిని రూపుమాపెను. వెంటగొనిపోబడు భోజనసామగ్రి స్వల్పముగ నుండుటను జూచి ప్రశ్నింప ఫెర్గుసను యీదిగువరీతిని సమాధానము చెప్పెను.

"మేము నెలలతరబడి ప్రయాణము చేయుదు మని మీరు భావించవలదు. ఎక్కువకాలము తిరుగుచున్నచో మే మపాయములకు లోనగుట నిజము. తిరిగివచ్చుటకల్ల. సెనిగలు నదీతీరమునుండి జాంజిబారు ద్వీపమునకు 3,500 లేక 4,000 మైళ్లకన్న నెక్కువదూరము లేదు. గంటకు 25 మైళ్ల వేగముతో జనినయెడల యేడహోరాత్రులలో ఆఫ్రికాదేశమును దాటగలము."

"అట్లు జనినచో దేశమును చూచుటెట్లు?"

"నావిమానమునకు నేను సారథిని. నాయిష్టప్రకారము విమానము నూర్ధ్వముఖమునకుగాని భూమ్యుపరిభాగమునకుగాని త్రిప్పగలను. అవసరమగునపు డాపగలను." అని డాక్టరనెను.

"అచ్చట సుడిగాలి హెచ్చుగ నుండును గనుక విమానము గంటకు 240 మైళ్లకన్న నెక్కువవేగమున జనగలదు."

"సుడిగాలి వేగముతో నేగినయెడల ఆఫ్రికా దేశమును పన్నెండుగంటలలో దాటగలను. జాంజిబారును ప్రాతఃకాల

మున వీడి సాయంకాలమునకు సెయింటులూయీవద్ద నిదురింతును." అని డాక్టరనెను.

"విమానము నంత వేగముగ నడుపవగునా?"

"విమానమున కపాయమేమియు నుండదు. ఫ్రాన్సు దేశపు చక్రవర్తియగు నెపోలియను 1804 వ సం॥న పట్టాభిషిక్తుడై నపుడొక విమానము 'పేరిసు' అను అక్షరములు లిఖించబడి విడువబడెను. మరునటిదినము 5 గంటలకు దానిని రోమునగరమందలి ప్రజలు వీక్షించిరి. ఆవిమానము వాటికను, కోమ్పగ్నాను దాటునంతవరకు నిలబడి తుదకు బ్రాక్షియానా సరస్సునందు బడెను."

"విమాన మాగగలిగినను అందులోని ప్రయాణీకుల స్థితి యెట్లుండును?" అని కెనడీ ప్రశ్నించెను.

"వైమానికులా! విమానము తన్నావరించియున్న వాయుపీడనచే వాయువుతోగూడ జనుచుండును. అందుచే తొట్టిలోని దీపమైనను ఆరిపోదు. వైమానికులకు భయములేదు. రాత్రికాలమున విమానమును చెట్టునకు లంగరువేసి ప్రయాణము నాపుదును. మావెంట రెండు నెలలకు వలయు భోజన సామగ్రిని కొనిపోవుచున్నాము. మావేటకాడు భూమిపైకి దిగి మాంసాహారమును కొనరాగలడు." అని డాక్టరు ప్రత్యుత్తర మొసగెను.

"ఆహా! కెనడీ! నిన్ను చూడ నాకవమానముగ నున్నది." అని ఒక యువకు డనెను.

"నీకు సంతోషమేగాక కీర్తిగూడ చేకూరుగాక!"

"అయ్యా, మీరు చక్కగా ననుచున్నారుగాని నేను చనుటలేదు." అని కెనడీ నుడివెను.

"ఏమి! నీవు చనుటలేదా!" అని అందరును ప్రశ్నించిరి.

"లేదు" అని గంభీరముగ జవాబిచ్చెను.

ఫెర్గుసనుగారితోకూడ విమానయానము చేయవా?" అని ఆశ్చర్యముచే తిరిగి ప్రశ్నించిరి.

"నేను చనకుండుటయేకాక డాక్టరుగారి ప్రయాణము నాపుటకై వచ్చితిని."

అందరు డాక్టరువంక చూచిరి.

"అతడుచెప్పెడి మాటలను వినకుడు" అని డాక్టరు నుడివెను.

"దైవముతోడుగా నేను—" కెనడీ నుడువుచుండ డాక్టరడ్డువచ్చి,

"అట్టి ప్రమాణములను చేయకుము. విమాననిర్మాణమునకై నీభారమును జేర్చితిని. అందుచె నాప్రయాణము నాపుటను గురించి నుడువవద్దు" అని మందలించెను.

ఆనాటినుండి కెనడీ ప్రయాణమును గురించి ప్రసంగించుట మానెను.

---

# తొమ్మిదవ అధ్యాయము

రిజల్యూలు ధూమనౌక గుడ్ హెూపాగ్రము వైపునకు జనుచుండెను. శీతోష్ణస్థితియందు వ్యత్యాసము కలుగలేదు. నిస్తరంగము, ప్రశాంతము, నిద్రాముద్రితము నై సముద్రము జెలంగుచుండెను. లండను నగరమును విడచిన పిదప 37 దినములకు అనగా మార్చి ముప్పదియవ తేదీనాటికి టేబిలు పర్వతము దృష్టిపథంబునం బడెను. స్వల్పకాలములో రిజల్యూలు ధూమనౌక నౌకారక్షకస్థానమున లంగరువేసెను. ఆనాడు రాత్రిసి బొగ్గు నెక్కించుకొని మరునాడుదయముననే బయలుదేరి మొజాంబికు ఛానలునందు ప్రవేశించెను. జోవు నిష్కపట పరిహాసప్రియుడగుటచే నావయందుగల పనివాండ్రను స్నేహితులుగ జేసికొనెను. ఫెర్గసను ఉద్యోగులకును జోవు పనివాండ్రకును ఉపన్యసించుచుండిరి. విమానయానమును గురించి పనివాండ్రు జోవును మరల మరల చెప్పుమనుచుండిరి. వారిప్రయాణము కొనసాగినచో రెండవసారి పెక్కుమందిని కొనిపోవుదురని జోవు నుడివెను.

"మానవశక్తి కసాధ్యమగు కార్యములలో నిది ప్రథమకార్యముగ పరిగణింపబడుచున్నది. ఇది జయప్రదముగ కొనసాగినచో నసాధ్య మను పదమును నిఘంటువులోనుండి తొలగింపవలెను. మేము చేయు కార్యము నితరులు చేయబూనిన యెడల దానియందు గల యభిరుచి వారి నెప్పుడును

విడువదు. మేము యింకొకసారి నూర్ధ్వముఖముగా నెగిరి పోదుము" అని జోవు నుడువుచుండ నొక సభ్యుడు లేచి,

"బాగు! బాగు! అప్పుడు చంద్రమండలమున కేగ దరా?" అని ఆశ్చర్యము కనబరచెను.

"ఓహో! చంద్రమండలమా! ప్రతి మానవుడును యీకాలమున చంద్రమండలమున కేగువారే! అచ్చట నీరును భోజనసామాగ్రియును దొరకనందున విశేషముగ కొని పోవలయును" అని జోవనెను.

"సరివడు సారాయిదొరకిన చాలును." అని ఒక మద్యపానప్రియుడనెను.

"అటువంటి వస్తువులు దొరకవు. విహారార్థమై మిరు మిట్లుగొలువు నక్షత్రములమధ్య తిరుగుచుండుము. బయలు దేరిన తోడనే శనిగ్రహమును జూచి తరువాత మిగిలిన గ్రహములను జూచెదము" అని జోవనెను.

"ఏమి మీ సాహసము! మీ రంత యెత్తున కేగెదరా? మీ యజమానుడు దయ్యమువలె నున్నాడే!"

"దయ్యము కాదు మానవుడే."

"శనిగ్రహమును చూచిన పిదప?"

"బృహస్పతి మొదలగు గ్రహములను జూచెదము."

జోవు యీ విధముగ పనివాండ్రకుపన్యసించుచుండ

ఫెర్గునను తన వాగ్ధాటిచే నుద్యోగులను ప్రీతిమలుగ జేయుచుండెను. అతని ఉపన్యాస మిట్లు ముగిసెను.

"ఉదజనివిమానమును నడపుట కష్టము. వాయు తారతమ్యాగరిమ నీటి తారతమ్యాగరిమకన్న తక్కువ. పడవ నీటిలో కొంతవరకు మునుగును. విమానము గాలిలో పూర్తిగ మునిగి యున్నది. వాయువు విమానమున కన్ని వైపుల నావరించి యుండుటచే విమానమును వ్యతిరేకముగ కదలనీయదు." అని డాక్టరు నుడివెను.

"పై విషయమై వాయుశాస్త్రమునందు చెప్పియుండ లేదా?" అని యొక సభ్యు డడిగెను.

"లేదు. మనము చేయునది సరియగు వాయుప్రవాహములో విమానము నుంచుటయే. సరియగు వాయుప్రవాహ మెంత యెత్తున దొరకిన విమానము నంత యెత్తునకు గొని పోగలను." పర్వతముల నవలీలగ దాటగలను."

"పలుమారు విమానమును పైకి క్రిందకు నడుపుట కష్టము గదా!" అని పెనటి ప్రశ్నించెను.

"కష్టము లేదు."

"దూరప్రయాణమునకో?"

"ఎందువలన?"

"పైకేగుటకై స్థిరత్వభారమును త్యజింపవలయును. క్రిందకు దిగునపు డుదజనిని వ్యయపరుపవలెను. అందుచే ఉదజనిత్వరలో వ్యయమగును."

"మంచిప్రశ్నయే యది. విమానమును క్రిందకు పైకి త్రిప్పుటవలన నుదజని వ్యయమగుట నిజమే" అని డాక్టరనెను.

"ఉదజనిని వ్యయపరుపకుండ విమానమును నడుపగలరా?"

"ఇంతవరకెవరును నడుపజాలరైరి. ఇప్పుడాకష్టకార్యమును నెరవేర్చువారు గలరు."

"ఎవరు?"

"నేను."

"మీరా!"

"ఆఫ్రికాదేశమును దాటునపుడు ఉదజనిని గోల్పోయిన మాబ్రతుకేమగును? 24 గంటల కాలములో ఉదజని వ్యయమగునే!"

"ఈవిషయమై మీరు ఇంగ్లాండులో యిచ్చిన ఉపన్యాసమునందు చెప్పియుండలేదు."

"అవును. ఆవిషయమై నలుగురిలో చర్చించుటకు నా కిష్టములేక నుడవలేదు. అంతేగాక అది యంతముఖ్యాంశముగ నాకు గాన్పించలేదు. పరిశోధనముల నత్యంతసమర్థముగను, సంతుష్టికరముగను సల్పి కృతార్థుడనైతిని."

"మీరహస్యము చెప్పుమని యడుగవచ్చునా?"

"రహస్యమేమియులేదు." అని డాక్టరు దాని నీవిధముగ నుపన్యసించెను.

# పదియవ అధ్యాయము.

"విమానములోని ఉదజని వ్యయపడకుండ నెగిరి దిగు టకై పరిశోధనలు చేయబడెను. మానియర్ ఫ్రెంచిశాస్త్రజ్ఞుడొకడు వాయువును సంకోచింప జేసి ప్రయోగములను జేసి యుండెను. వాన్ హెర్కేను బెల్జియం దేశీయుడు రెక్కలచే తను తెడ్లచేతను ఉత్పతనశక్తిని సృష్టించి విమానమును నడిపె నుకాని కొన్ని కారణములచే నావిమానము శిధిలమైనది. నేను వేరొకమార్గమును కనుగొంటిని. స్థిరత్వభారసాయము మొక్క వగాను. విమానమునకు సాయమువచ్చె యెడల స్థిరత్వభారము నుపయోగింతును. ఉత్పతనశక్తి ఉదజనివ్యాకోచముచే కలుగు చున్నది. ఉదజనివ్యాకోచముకొరకు విమానపుతొట్టిలో నైదు పీపాల నుంచితిని. వాని యుపయోగమింతవర కెవరికిని తెలి యదు. అందలి మొదటి పీపాలో 25 గేలనుల నీరుగలదు. ఆనీటిలో గంధికి కామ్లజనిదమును గలిపి విద్యుచ్ఛక్తిని ప్రయో గించినయెడల నీరు విఘటనమై ఉదజని, ఆమ్లజని యను రెండు వాయువు లేర్పడును. ఆవాయువులలో నమ్లజని ధనధృవము వద్దను ఉదజని ఋణధృవమువద్దను వేరుచేయబడి వేరుగా రెండు పీపాలలో నింపబడును. అట్లు యేర్పడిన ఉదజని ఆమ్ల జనికన్న రెండురెట్లుండును. ఆరెండుపీపాలలోనుండి రెండు గొట్టములు వెల్వడి మూడవపీపాలో కలియుచున్నవి. మూడవ పీపా పరిమాణము 41 ఘన అడుగులు. ఉదజని అమ్లజనుల

మిశ్రిమద్రివ్యము మరప్రాయ్యిలోనుండుచున్నది. ఆమంట వేడి కమ్మరవాని కొలిమి వేడిని మించును. విమానమునకు పైభాగమునను క్రిందిభాగమునను రెండుగొట్టములు కలవు. ఆగొట్టములు తొట్టిలోనున్నయినుపపేటికలోనికి గొనిపోబడి అందులోనున్న సర్పాకారపుగొట్టమునకు రెండుకొనలను బిగించబడి యున్నవి. మరప్రొయ్యి వేడిమిచే సర్పాకారపుగొట్టములోని ఉదజని వెచ్చనై గొట్టములోనుండి విమానములోనికి జనుచుండ చల్లని ఉదజనిక్రింది గొట్టములోనుండి సర్పాకారపుగొట్టములోనికి ప్రవేశించును. అందుచే నాయినుపపెట్టెను ఉష్ణోత్పత్తి పేటిక యనిపిలువనగును. ఈవిధముగా మరప్రొయ్యి వేడిచేవిమానములోని ఉదజని వెచ్చనై యెక్కువగాలిని స్థానాంతర్గతము చేసి విమానమున కుత్పతన శక్తి నొసగుచున్నది. ఉదజనికి ఒక అంశము వేడినొసగినచో దానిఘన పరిమాణ భాగములో 1/461 వ వంతు వృద్ధి యగును. 18 అంశల ఫారన్‌హీట్ వరకు ఉష్ణీకరించినయెడల 18/461వ వంతు వృద్ధియగును. ఈప్రకారము విమానములోని ఉదజని1614 ఘన అడుగులవరకు వృద్ధియైనచో విమానమునకు 131 పౌనుల ఉత్పతన.శక్తి కలుగును. 131 పౌనుల స్థిరత్వభారమును పారవేయకుండ విమానమున కన్నిపౌనుల యుత్పతన శక్తి కలుగుచున్నది. ఉదజనిని 180 అంశలవరకు ఉష్ణీకరించినయెడల 180/461వ వంతు వృద్ధియై 16740 ఘన అడుగులగాలిని స్థానాంతర్గముచేసి విమానము

చకు 1371 పౌనుల ఉత్పతనశక్తిని కలుగజేయును. ఉదజనిని విమానములో అర్థభాగమే నింపుటవలన విమానపుభారముతో సరియగు గాలినే స్థానాంతర్గతముచేయుచుండుటచే విమాన మూర్ధ్వముఖముగా జనక గాలిలో నిలచియుండును. ఎగురుటకు విమానములోని ఉదజనిని మరపొయ్యివలన నుష్ణీకరింపవచ్చును. అందుచే ఉదజని వ్యాకోచమై యెక్కువగాలిం స్థానాంతర్గతము చేయుటవలన నుత్పతనశక్తి హెచ్చి విమాన మంబరవీథిని సంచరించును. దిగవలెనన్నచో నుదజని వేడిమిని తగ్గింతును. అందుచే ఉదజని సంకోచించి తక్కువ గాలిని స్థానాంతర్గతము చేయుటవలన ఉత్పతనశక్తి తగ్గి విమానము క్రిందకు దిగును. ఉదజని వేడిమిని తగ్గించుట కెక్కువకాలము పట్టును గనుక విమానము పైకెగురుటకన్న దిగుట కాలస్యమగును. వేగముగ దిగకుండుటయు వేగముగ నెగురుటయు మంచిది. త్వరితముగ దిగవలెనన్న విమానముపైనున్న వల్వమును తెరచినచో ఉదజని వెల్వడి విమానమును త్వరితముగ దింపును. ఉదజనిని వ్యయపరచకుండ ఉత్పతన శక్తిని సృష్టించుటకు ఉదజనిశీతోష్ణస్థితిని మార్చుటవలన గలుగు సంకోచ వ్యాకోచములే మూలాధారములు.

"ఇంకొకటి చెప్ప మరచితిని. ఆమ్లజని ఉదజనుల మిశ్రమపదార్థము మరపొయ్యికొనను మండునపుడు ఆవిరి యేర్పడుచున్నది. ఆయావిరి ఉష్ణోత్పత్తిపేటికలో క్రింది

భాగముననున్న గొట్టముద్వారా వెడలుచుండును. 25 గేలనుల నీటిని విఘటనచేసినచో 200 పౌనుల ఆమ్లజనియును, 25 పౌనుల ఉదజనియును దొరకును. అనగా 1,890 ఘనఅడుగుల ఆమ్లజనియును, 3,780 ఘనఅడుగుల ఉదజనియును యేర్పడును. రెంటి మొత్తము 5,670 ఘనఅడుగులు. మరపొయ్యియందు మిశ్రమద్రవ్యము ఘంటకు 27 ఘనఅడుగులు వ్యయమగును. కాని నేను ఘంటకు 9 అడుగుల మిశ్రమద్రవ్యమును మాత్రమే వ్యయపరచెదను. అట్లు చేయుటచే భూమికిసమీపముననే తిరుగుదును. 25 గేలనుల నీటిని 360 గంటలకాలముపయోగించెదను. అనగా 26 రోజులు ప్రయాణమున కుపకరించును. ఈవిధముగా నవసరమైనపుడు క్రిందకు దిగి నీటిని నింపుకొనుచు నెంతకాలమైన తిరుగగలను.

"నా రహస్య మిదియే. ఇందులో కష్టమేమియు లేదు. ప్రయాణము నిర్విఘ్నముగ కొనసాగును. ఉదజని వ్యాకోచ సంకోచములచే రెక్కలుగాని యంత్రసహాయముగాని లేకయే విమానము నడువగలదు."

ఈవిధముగ ఫెర్గుసను ఉపన్యాసమును ముగించెను. కరతాళధ్వనులు మిన్నుముట్టెను. ప్రయాణము నిర్విఘ్నముగ కొనసాగునని సభ్యులకందరకి తోచెను. వారి సందేహములు తీరెను.

"ఎట్లైనను నిది అపాయకరమగు ప్రయాణమే!" అని నావికుడనెను.

"అపాయకరమైనను అపాయములు రాకుండ ప్రయాణమొనరించుసాధనము లభించుటచే నాసంకల్పము జయప్రదముగ కొనసాగును" అని డాక్టరు నుడివెను.

---

# పదకొండవ అధ్యాయము

"చ. మదమున నంతబోవక విమానయుతంబుగ నభ్రవీధికిన్
గొదకొని యేపుమై నెగసి కొంకక శక్తి శిలామహీంద్రసా
ప్రదరములోలిమై నెగసి బంధురభూమిపరాగశర్కరల్
వదలక చల్లుచున్ మలయవాయువుచేదిశలావరించుచున్.

—భాగవతము.

వాయుచలన మనుకూలమై యుండెను. రిజల్యూటు స్టీమరు రయమున గమ్యస్థానమును సమీపించుచుండెను. మొజాంబికు సముద్రములోని ప్రయాణము శాంతముగ జరిగెను. అనుకూలమారుతప్రేరితమైన నౌకాయాత్ర దలంపగా భావివిమానవిహారము శుభసూచకమై చెలువారుచుండెను. రిజల్యూటు ధూమనౌక జాంజిబారు పట్టణమును జేరి ఏప్రిల్ 15 వ తేది మధ్యాహ్నము పదకొండుఘంటలకు నౌకాశ్రయ

మున లంగరు వేయబడెను. జాంజిబారుద్వీపము మెస్కెటు రాజగు ఇమాము పరిపాలనలో నుండెను. ఆంగ్లేయరాజున కా తడు మిత్రుడు. జాంజిబారుద్వీపము ఆఫ్రికా దేశపుతీరమునకు ముప్పదిమైళ్ళలో గలదు. చిగురు, దంతములు, బానిసల వ్యాపారము నచట విశేషముగ జరుగుచుండును. ఆఖండమందున్న అడవిజాతివారు సదా సంగ్రామములలో మునిగియుండుటచే నట్టి యుద్ధములలో పట్టుబడిన ఖైదీలను కొనివచ్చి జాంజిబారులోనున్న వర్తకులకు విక్రయించుచుందురు. ఫ్రాంసుదొరతనమువారిచే పంపబడిన లెజీను అను నాడు యీవ్యాపారమును కండ్లారజూచెను.

రిజల్యూటు స్టీమరు నౌకాశ్రయమున నిలచినతోడనే యచ్చటి ఆంగ్లేయరాయబారి నౌక నధిరోహించి డాక్టరు ఫెర్గుసనుయొక్క కట్టములను నెరవేర్ప సిద్ధుడయ్యెను. ఫెర్గుసను విమానయానమును గురించి పత్రికలలో ఆంగ్లేయరాయబారి చదివియుండినను అంతవరకును నమ్మియుండలేదు.

"ఇంతవరకును నీవిమానయానము జరుగు ననినమ్మలేదు. ఇప్పుడు నాయపనమ్మకము పోయినది" అని రాయబారి ఫెర్గుసనుతో ముచ్చటించెను.

కెనడీ జోవులను ఫెర్గుసనుగారితోకూడ రాయబారి స్వగృహమున కాహ్వానించెను. స్పెకీవద్దనుంచివచ్చిన యుత్త

రము లన్నిటిని డాక్టరునకు రాయబారి చూపించెను. స్పైకీయును అతని యనుచరులును ఉగోగాదేశమును చేరువరకు క్షుద్బాధచేతను శీతోష్ణస్థితి భేదములచేతను మిగుల బాధపడిరట.

"ఆ బాధలనుండి తప్పించుకొను విధము మనకు తెలియును" అని డాక్టరనెను.

ముగ్గురు వైమానికుల సామగ్రిని రాయబారిగృహమందుంచిరి. విమానమును దాని పరికరములను దింపుటకు కోటకు సమీపమున గాలి తగులని స్థానము నేర్పరచిరి. ఆకోట బురుజులపై సైనికులు సదా కావలికాయుచుండిరి. విమానమును దింపినచో మూఢులైన పురజనులు దానిని పాడుచేయుదు రని ఫెర్గుసను భయపడెను. మూర్ఖులాచరించు దుండగములకు మేర లేదు గదా! క్రైస్తవుడొకడు గాలిలో నెగురు నన్న వార్తను వినినతోడనే పట్టణవాసులెల్ల భయపడిరి. నీగ్రోలు తమ మత విరుద్ధకార్యముల నంగీకరించరు. వారిదేవతలగు సూర్యచంద్రాదులకు హానికలుగు నని భయము. రాయబారి యీ సంగతి ముందుగా నెరిగినవాడై ఫెర్గుసను పెనటులతో నాలోచించెను.

"పురజనుల బెదరింపులకు భయపడగూడదు" అని పెనటు నుడివెను.

"నీగోళ్ళలను మనము ధరించగలము. అందులకై ఇమానునేస మనకు సాయముచేయును. విమానమునకు సూది బెజ్జమంత రంధ్రమైనను పడకూడదు గనుక ముందుగనే జాగరూకులమై యుండుట మంచిది" అని ఫెర్గుసను చెప్పెను.

అందుపైన రాయబారి యోచించి,

"దూరమందు కనబడుచున్న యీ ద్వీపములను చూచితిరా! విమానమును దానిలో నొక ద్వీపమందు దింపవచ్చును. దానిచుట్టును నావికులను కాపుంచుదుము. అప్పు డపాయముండదు" అని సలహా నొసగెను.

"మంచిది. అచ్చట విమానమును నిరపాయముగ బాగుచేయవచ్చును" అని డాక్టరనెను.

తదుపరి రిజల్యూటు స్టీమరు కాంబను ద్వీపముయొద్దకు కొనిపోబడి లంగరు వేయబడెను. ఏప్రిల్ 16 వ తేదీ యుదయమున ఆ ద్వీపమందలి యొక యడవిప్రదేశమున చెట్లను నరికించి నావికులు విమానము నచ్చోటికి కొనిపోయి దింపిరి. ఎనుబది యడుగుల పొడవుగల రెండు స్తంభములను పాతి వాటి చివర గిలకలను గట్టి విమానమును పైకి లేవనెత్తిరి. లేవనెత్తునపుడు పెద్దవిమానములో చిన్నవిమాన మమర్పబడెను. విమానములను ఉదజనితో పూరించుటకుగాను గొట్టములమర్పబడెను. ఉదజనిని తయారుచేయుటకు వలయు సామ

గ్రిని సిద్ధపరచుటతో 17 వ తేదీ గడచెను. మరునాడు డాక్టరు నాజ్ఞప్రకారము పనివాండ్రు ముప్పది బానలనిండ నీరమును గంధకికామ్లమును యినుమును నింపి ఉదజనిని పృథక్కరణ మొనర్చిరి. ఇట్లు జనించిన ఉదజని మధ్యబానలోనికి పోయి అచ్చటినుండి విమానములోనికి జనుచుండెను. 1,866 గాలనుల గంధకికామ్లమును, 16,050 పౌనుల యినుమును, 966 గాలనుల నీరును వ్యయపడెను. ఈపని ప్రారంభ యగుటకు 8 గంటలకాలము పట్టెను. 19 వ తేదీకి విమానము వలచే కప్పబడి గాలిలో నాట్యమాడుచుండెను. విమానమును నిలబెట్టుటకు యిసుకసంచులను వలకు కట్టిరి.

వ్యాకోచ సంకోచములకై మర పొగ్గియ్యగొట్టములతో గూడ నమర్చబడి యుండెను. లంగరులు, పగ్గములు, పనిముట్లు, పరుపులు, గుడారము, తినుబండారములు, ఆయుధసామాగ్రి తొట్టిలో నాటి వాటిస్థానమున నుంచబడెను.

జాంజిబారునుండి మంచినీటిని గొనిపోయి విమానములో నుంచిరి. 200 పౌనుల స్థిరత్వభారముగల సంచులు తొట్టి క్రిందుగుభాగమున నుంచిరి. ఈపని యంతయు సాయంకాల మెనుగంటలకు ముగిసెను.

రిజల్యూటు స్టీమరులోని రక్షకనావలలో నావికులు కూర్చొని ఆద్వీపమును కావలిగాయుచుండిరి. నీగ్రోలు కోపముతో కేకలువేయుచు డప్పులను వాయించుచు నానావిధ

ముల సంరంభము లొనరించుచుండిరి. వారిలో మంత్రివేత్తలు పురజనుల వీరావేశమునకు దోడగుచుండిరి. కొంద రాకాంబను ద్వీపమునుజేర సముద్రము నీదుచుండిరికాని రక్షకనావికులచే వారింపబడుచుండిరి. రాళ్ళవర్షమునకై నీగ్రోలు మేఘములను ప్రార్థించిరి. పచ్చియాకులను తెచ్చి ఉడికించిరి. గొర్రెలను బలియిచ్చిరి. అట్లు వా రెంత శ్రమపడినను ఆకాశము నిర్మలముగ నుండెను. అందుచే విసిగి వేసారి తుదకు ట్వోగాయను నారకేళమద్యమును తృప్తిగనోలి కోయపాటలతో కాలము గడపిరి.

సాయంకాల మారుగంటలకు విమానారోహకులకు విందొసగబడెను. కెనడీమాటల నెవ్వరును వినరయిరి. అది విచారకరమగు విందు. ఎడబాయు సమయము వచ్చుటచే వార లాలోచనానిమగ్నులయి యుండిరి. వైమానికుల భవితవ్య మెటులుండునో చెప్పగలవా రెవ్వరు? తిరిగి యెన్నటికయిన నట్టి విం దారగింతురా? వారి విమానమునకపాయము వాటిల్లినచో అడవిజాతివారి మధ్యనో ఎడారులలో నో వారి గతి ఏమగును? ఇటువంటి తలంపులతో నవికుల మనములు నిండియుండెను. ఎట్టి కష్టములలోనయిన చలింపని ఫెర్గుసను ధైర్య మీతరుణమున కొంచెము చలించెను. ఫెరుసను, కెనడీ, జోవు లారాత్రి నావయందే శయనించిరి. ప్రాతఃకాలమున ఆరుగంటలకు లేచి కాంబన ద్వీపములోనికి జనిరి. విమానము

తూర్పుగాలి వీచుటచే మెల్లన నాట్యమాడుచుండెను. విమానము నిరువదిమంది నావికులు లాగిపట్టుకొనిరి. నౌకాధిపతియును సేవకులును వైమానికులకు వీడుకోలొసంగిరి.

ఆసమయమున కెనడీ ఫెర్గుసనును సమీపించి వాని చేతిని పట్టుకొని,

"ఈప్రయాణమును నీవు నిశ్చయముగ చేయదలచితివా?" అని ప్రశ్నించెను.

"అవును."

"నీ విమానయానము నాపుటకయి నా యాపచ్ఛక్తి నుపయోగించితినా, లేదా?"

"ఉపయోగించితివి."

"సరే! ఇప్పుడు నాప్రాణము కుదుటబడినది. నీతో నేనుకూడ మనస్ఫూర్తిగ వచ్చెదను."

"ఈసంగతి నా కిదివరకే తెలియును." అని డాక్టర నెను.

కెనడీ శరీరము పులకరించెను. తనయాప్తుల నెల్లవీడి వెచ్చటికో పోవుసమయము తారసిల్లెను. నౌకాధిపతికిని వైమానికులకును కరస్పర్శనములు జరిగెను. తొమ్మిది గంటలకు ముప్వురు వైమానికులును విమానము నధిరోహించిరి. డాక్టరు మరపొయ్యిని వెలిగించెను. అందుచే ఉదజని వెచ్చనై

భూమిపై సౌమ్యస్థితియం దుండిన విమాన మూర్ధ్వముఖముగా లేచెను. సరంగులు త్రాళ్ళను వదలిరి. విమానము ఇరువది అడుగులు పైకేగెను.

“స్నేహితులారా! మన మీ విమానమునకు సార్థకనామ ముంచవలయును. దీనిని ‘విజయలక్ష్మి’యని పిలిచెదము” అని డాక్టరు తన సహచరుల మధ్య నిలబడి టోపీని పైకెత్తి ఉచ్చైస్స్వరముతో ననెను.

క్రిందనున్న వారంద రొక్కసారి కరతాళధ్వనులను జేసి జయభేరీలను మోగించిరి. విమానము వేగముగ పైకెగిరెను. గౌరవార్థమై రిజల్యూటునావనుండి నాలుగుసార్లు ఫిరంగి కాల్చబడెను

# పండ్రెండవ అధ్యాయము.

“మ. అమరోద్యాన వనప్రదేశములు నవ్యారామభూముల్ దళ
త్కుముదాంభోజవిభాసి మానససరఃకూలంబులుఞ్ మంజుకుం
జములుం జైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునం జూచె నయ్యా
మునిఁ గర్దమయోగి గామగవిమానారూఢుడై యచ్చెరన్.”

—భాగవతము.

నిర్మల నీలాంబరమున మందమందగమనమున మలయ మారుతకుమారుడు చేదోడు వాదోడుగా విహారకేళీలాలసయై విజయలక్ష్మి 1500 అడుగుల యెత్తున కేగెను. భారమాపకమందలి పాదరసము రెండంగుళములు దిగెను. ఆయున్నత స్థలమున వీచుచుండిన వాయువు వాయవ్యదిశగా విమానమును గొనిపోవుచుండెను. వైమానికులు భూమిపై దృష్టిసారించునపుడు వారి దృక్పథంబునం బడిన స్వాభావిక సౌందర్యమును వర్ణింప నెవరితరము? ఇట్టి సౌందర్యమును ఆంధ్రరాష్ట్రమందలి కొన్ని ప్రదేశములయందు కనుబరచిన విహంగవిమాన (Aeroplane) ప్రదర్శనములందు పాల్గొనుటకై విమానవిహారముల కేగిన ఆంధ్రులు స్వయముగ వీక్షించియే యుండిరి.

జాంజిబారు ద్వీపమంతయును నేలపై బరచిన నల్లని పటమువలెనె వారి కనుదోయికి విందొనరించెను. పైరులు పలు రంగులు నేలపై పూసినటులను అరణ్యములు దట్టముగ పెరిగిన పొదలవలెను కానవచ్చె. ఆద్వీపమునగల జనులు చీమల వలె గాన్పించు చుండిరి. ఫిరంగులశబ్దముమాత్రము మెల్ల మెల్లగ చెవులబడెను.

"ఆహా! ప్రకృతి రామణీయక మెంతని వినుతింతును?" అని జోవు నిశ్శబ్దమును విడగొట్టెను.

కెనడీ డాక్టరు లిద్దరును పలుకలేదు. డాక్టరు ఫెర్గుసను భారమాపకమును జూచిపారియుచుండెను. కెనడీ దిగువను

జూచుచుండుటచే నతని కండ్లు మిరుమిట్లు గొలుపుచుండెను. సూర్యరశ్మిచే ఉదజని వ్యాకోచింపడి విమానోత్పతనశక్తిని వృద్ధిజేయుచుండెను.

జయలక్ష్మి 2,500 అడుగులయెత్తువర కేగెను. రిజల్యూట్ స్టీమరు చిన్నదోనెవలె కాన్పించుచుండెను. ఆఫ్రికనుతీరము సముద్రతరంగో దేకముువలె నుండెను.

" మీరు మాటలాడరేమి?" అని జోవు ప్రశ్నించెను.

" దేశమును వీక్షించుటచే మాటలాడలేదు." అని డాక్టరనెను.

" మీరు మౌనమును వహింప నేనుకూడ మౌనమును వహింపవలెనా? "

" జోవు, నీయిష్టప్రకారము సాగుచుండుము" అని డాక్టరనెను. జోవు గట్టిగా నవ్వెను.

సముద్రమును దాటువరకును ఉన్నతమునయుండుటయే మంచిది. తీరము బాగుగ కనబడుచుండెను. భారమాపకమును ఉష్ణమాపకమును డాక్టరు తనకు సమీపమున నుంచెను. రెండవ భారమాపకమును రాత్రియందు జూచుటకుగాను తొట్టికి వెలుపలభాగమున నుంచెను. రెండుగంటలలో ఘంటకు 8 మైళ్ల వేగమున విజయలక్ష్మి ఆఫ్రికా సముద్రతీరమును సమీ

పంచెను. భూమిని సమీపించ మరపొయ్యి తగ్గించబడెను. విమానము భూమికి 300 అడుగుల దూరమువరకు జనెను. మిస్రిమా దేశము మన వైమానికులకు నేత్రగోచరమయ్యెను. అచ్చట మామిడితోపులు విస్తరించి యుండెను గాలి మెల్లగ వీచుచున్నందున లావుగాను నల్లగాను నున్న మామిడి మాస్రినుల వేస్రిళ్ళు కానబడుచుండెను. సముద్రము పాటునం దుటచే నచట దట్టముగ బెరిగిన తియ్యమామిడి గున్నల నల్లని వేళ్లు నిగనిగలాడుచు సాగను మిగులుచుండెను. విమానమున కివ్వాను సముద్రము దవ్వాదవ్వుల గన్పట్టుచుండెను. నైరుతి మూలను 'స్నురు' పర్వతశిఖరము కానబడెను. మన విజయలక్ష్మి ఒక గ్రామమును సమీపించెను. పటములో చూడ నది 'కెరూలో' గ్రామము. ఆగ్రామమందలి జనులు గుంపులు గుంపులుగా శేరి కేకలు వేయుచుండిరి. కొందరు అమ్ములను విజయలక్ష్మిపైకి వదలిరి. కాని విమానము వారియమ్ములబారిని దాటియుండెను. బట్టను స్పీకీగార్లు జనిన దారి వెంబడిని విమానము దక్షిణముగ వీచు గాలిచే కొనిపోబడుచుండెను.

కెనడీ జోవువలెనే స్వేచ్ఛగ మాటలాడనారంభించెను.

"గుర్రపుబండ్లు మన విమానముముందు పనికిరావు" కెనడీ యనెను.

"ఇందులో ప్రయాణము చేయువారలకు ధూమనౌకలలో బోవుటకు రోతబుట్టును." అని జో వనెను.

"ధూమశకటముకన్న నాకు దీనియందు ప్రయాణమే సుఖతరము. రైలుబండిలో కూర్చున్నచో దేశము బాగుగ కాన్పించదు."

"మనము ప్రాతఃకాలపు ఫలహారము చేయుదమా?" అని జోవడిగెను.

"చేయుదము."

"బిస్కట్లును పదిలపరచిన మాంసమును భుజించుదము." అని జోవనెను.

"మరప్రొయ్యిని వెలిగించి ఉదజనికవాయుము రాకుండ నీటిని కాచవచ్చును" అని డాక్టరనెను.

"ఉదజనిని జాగరూకతతో చూడవలెను. అది తుపాకి మందువంటిది" అని కెనడీ భయమును సూచించెను.

"అంత భయముండదు. ఉదజనికి నిప్పుతగిలినను కొంచెము కొంచెము మండునుగాని తుపాకిమందువలె మండదు. విమానము క్రమేణ భూమిపైకి దిగును. విమానపువస్త్రము దట్టముగ నున్నందున నట్టిభయము లేదు" అని ఫెర్గుసను నుడివెను.

"అటులయినచో మనము నిర్భయముగ భుజింపవగును. ఫలాహారము సిద్ధముగనున్నది. భోజనముచేయుచుండ కాఫీని తయారుచేయుదును" అని జోవనెను.

"జోన్సు కాఫీని తయారుచేయుటయందు దనమానపరిజ్ఞ
గలవాడు. అందుగో వేయు వసువులను రహస్యముగ మిళితము
చేయును. ఆపదార్థము లేవియో నాకుగూడ తెలియనీయడు"
అని డాక్టరు జోన్సును పొగడెను.

"అయ్యా! మనము గాలిలో నుండుటచే రహస్యము
వెల్లడిగాదు. మోషా, బోర్న్యోను, రయోన్యూనెసు పదార్థ
ములను సమభాగములుగ గలిపి కాఫీని తయారుచేయు
చుంటిని" అని జోవు తనరహస్యమును వెల్లడిజేసెను.

కొన్ని నిముసములలో ముగ్వురు సహచరులును మూడు
గిన్నెలకాఫీని గ్రోలిరి. అంతటితో వారి ప్రాతఃకాలభోజనము
ముగిసెను. తిరిగి వారు నిర్ణీతస్థానముల కేగిరి.

విమానము చనుచున్న దేశము నిగుల సారవంతమైనది.
రమణారీబాలలు వృక్షముల మధ్యనుండి దాగుడుమూత లాడు
చుండెను. పొగాకు మొదలగు నానావిధములైన పైరులును
కాన్పించుచుండెను. మొక్కజొన్న, ఓట్లు పొట్టలువిచ్చి యీను
టకు సిద్ధముగ నుండెను. వంపొలములు అప్పుడేపండి దూరము
నుండి చూచువారలకు పసుపువన్నెల జిన్నెల గురియుచుం
డెను. ఎత్తయిన మంచెలపై గట్టబడిన పెద్దబోనుల బోలు
దొడ్లలో నుంచబడి, వన్యమృగముల బారికి దూరముగ నుండు
టచే హాయిగా మేతమేయుచున్న గొర్రెలను మేకలను జూచుచు

వైమానికులు బోవుచుండిరి. మధ్యాహ్నమునకు విమానము "ఉజాగ్రిమో" దేశముపైన జనుచుండెను.

కొంతదూరమువరకును కొబ్బరితోపులును బొప్పాయి చెట్లును దట్టముగ పెరుగుటచే భూమి కాన్పించలేదు. అవి దాటినపిదప కుందేళ్ళు, నక్కలు, దుప్పులు, కెనడీకి తుపాకి బారియందు కనబడినను వానికొరకు తన మందును ఖర్చు పెట్టలేదు. విమానము గంటకు పండ్రెండుమైళ్ళ వేగమున పరు గిడుచు ధృవరేఖయందలి 38 వ కళలోని 20 వ వికళయం దున్న టోండాగ్రామమును దాటెను. "ఆగ్రామముననే బర్టనుస్పెకీగార్లు జ్వరముతో బాధపడిరి. అక్కడితో వారి ప్రయాణము ముగిసెను" అని డాక్టరనెను.

చలిజ్వర బాధ యీప్రదేశమున హెచ్చు. భూమిపై నుండి వెలువడు దుర్గంధము సోకని యున్నత ప్రదేశమున డాక్టరు తన విమానము నుంచెను. మధ్యమధ్య అరబ్బీ బాట సారులు తమ ఒంటెల సమూహముతో చల్లబడు వరకును సేద దీర్చుకొనుటకై టోండా గ్రామమున విడియుటను జూ చిరి. అడవిమృగముల నుండియును దొంగల బాధనుండియును కాపాడబడుటకై గ్రామముల చుట్టును గోడలును, ముండ్లకం చెలును గలవు. కెనడీకి అరబ్బీలను పరిశీలింపవలెనని యున్న ను డాక్టరందుల కియ్యకొనలేదు.

"అరబ్బీలయొద్ద తుపాకు లుండును గనుక మనము వారిని సమీపించరాదు" అని డాక్టరనెను.

"ఒక బెజ్జము పడినంత మాత్రమున విమానము పడిపోవునా?" అని జోవు ప్రశ్నించెను.

"వెంటనే పడదు. ఉదజని క్రమేణ వెలువడుచుండ విమానము క్రిందకు దిగుచుండును."

"అట్లయినచో మనము దూరముగ నుండుటయే మంచిది. వారు మనలనుగూర్చి యేమి యోచించుచుందురో? బహుశః మనల నారాధించుచుందురు."

"దూరమున నుండియే పూజింపబడుట మంచిది" అని డాక్టరనెను.

దేశపుతీరు మారుచుండెను. కర్షకులు తరచుగ కాన్పించుటలేదు, భూమిమీద తరుగుల్మాదులు గాని పైరులుగాని కాన్పించుటలేదు. రాళ్ళమయమగు దేశము కానబడుటచే పర్వతములు సమీపించుట నిజము.

"పర్వతమొండు కానబడుచున్నది" అని కెనడీ కేకవైచెను.

"వానినే 'ఉరిజారా' 'దుతుమి' పర్వతశిఖరములందురు. వానిని దాటినపిదప విశ్రమించుదము. మరప్రొయ్యిని వెలిగించి ఉదజనిని ఉష్ణీకరించి విమానమును 500, 600 అడుగుల యెత్తున నుంచవలెను" అని డాక్టరనెను.

"మీయాలోచనమంచిది. ఎగరడము దిగడము పరుగెత్తడము పంపుతిప్పగనే సునాయాసముగ జరుగుచున్నవి."

కొంతదూర మూర్ధ్వముఖముగ నేగినపిదప,

"ఇచ్చట చక్కగానున్నను క్రిందనున్న ఎర్రనియిసుక పై బడిన సూర్యకిరణముల పరావర్తముచే వేడిమి సహింప శక్యము గాకున్నది" అని కెనడీ నుడివెను.

"ఆకనబడు చెట్లెంత సొగసుగ నున్నవి! అటువంటి వృక్షములు పదిరెండు చేరినచో నొక మహారణ్యమగును" అని జోవు పలికెను.

"వాటినే బేయాబాబు చెట్లనెదరు. ఇదిగో! ఇచ్చట యీమ్రాను సుమారు నూరడుగుల కైవారము గలిగి యున్నది. ఈచెట్టు మొదటనే ఫ్రెంచివాడు మెయిజను 1845వ సం॥లో మృతినొందెను. మనమిప్పుడు డిజిలామొరో గ్రామము పైనున్నాము. ఆగ్రామమునకు మెయిజను ఒంటరిగ జనుటచే నాదేశపురాజుచే పట్టుకొనబడి ఆ బేయాబాబుమ్రానుకు కట్టబడి నీగ్రోలయుద్ధపు కీర్తనలమధ్య, రాజాజ్ఞానుసారముగ నా ఫ్రెంచివాని యవయవము లొకటి వెనుక నొకటిగా ఖండింప బడెను. పాప మాయువకుడు 26 యేండ్లవయస్సున చంపబడెను" అని డాక్టరనెను.

"ఫ్రెంచి దేశపు పరిపాలకు లాచిత్రవధ విని చేతగాని వారివలె నూరకొనిరా" అని కెనడీ ప్రశ్నించెను.

"ఫ్రెంచి దేశపురాజు జాంజిబారు రాజునకు వ్రాసెను. జాంజిబారురాజు తనకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించినను యూహాంతకుడు దొరకలేదు."

"మనము పైకేగుట మంచిది. వారి బారినుండి వెంటనే తప్పించుకొనవలెను" అని జోవు భయమును కనబరచెను.

"మనము పైకేగవలయును. దుతుమిశిఖరము గోచరమగుచున్నది. నాగణితము సరియైనచో మనము దానిని యీ సాయంకాలము 7 గంటలకు దాటగలము" అని డాక్టరనెను.

"రాత్రికూడ ప్రయాణము చేయుదమా?" అని కెనడీ ప్రశ్నించెను.

"వలదు. తప్పనిసరియైనచో చేయుదము. రాత్రికాలము దేశమును చూడజాలము."

"రాబోవు దేశము పరిశోధకులకు నూతనమైనను సాగుచేయబడు దేశమని తలచెదను" అని జోవనెను.

"జోవు, తొందరపడకుము. త్వరలో చూతువుగాని."

సాయంకాల మారున్నర గంటలకు విజయలక్ష్మి దుతుమిశిఖరమును సమీపించెను. డాక్టరు ఉదజని వేడిమిని 18 అంశలవరకును వృద్ధిజేసెను. అందుచే విమానము 8,000 అడుగులు పైకేగెను. అట్లెగురుటనుజూడ విమానపు మంత్రికారుడగు డాక్టరుగారి కరకౌశలమున నాడింపబడుచున్న కీలుబొమ్మవోలె శాన్పించెను. కెనడీ దాటుటకుగాను లోయలను

నిరూపించుచుండెను. 8 గంటలకు విజయలక్ష్మి దుతుమిశిఖరమును దాటి భూమిని సమీపించెను. లంగరులు విడువబడెను. ఒక లంగరు నోపాలుచెట్టులో పట్టుబడెను. జోవు వెంటనే త్రాటివెంబడి దిగి లంగరును పదిలముగ గట్టి త్రాటినిచ్చిన మీదుగా తొట్టిలోని కేగెను. సాయంకాలభోజనము నందరును కడుపార నారగించిరి. వారున్న ప్రదేశము చంద్రుని ఉనికిని బట్టి కనుగొనబడెను.

పటములనుచూడ విమానము అక్షాంశరేఖలోని 2 వ కళలో ననగా 20 మైళ్లు పడమర వైపుగా జనుచుండెను. ఆ రాత్రి ముగ్గురు నొకరి తరువాత నొకరు మేల్కొని విమానమును కావలిగాయుచుండిరి. ఫెర్గుసను 9 గంటల నుండియును కెనడీ 12 గంటల నుండియును జోవు 3 గంటల నుండియును మేల్కొనిరి.

---

# పదమూడవ అధ్యాయము.

రాత్రి నిరపాయముగ గడచెను. కెనడీ లేచినప్పు డాతని శరీరము జ్వరపీడితమైనటుల నుండెను. శీతోష్ణస్థితియును మారెను. ఆకాశము నీలమేఘావృతమై వర్షసూచనలు కనబడుచుండెను. ఆ జంగోమరో దేశమున జాన్యేవరి నెలలో పదునైదు దినములు మాత్రము వర్షములేకయుండి మిగిలిన సంవ

త్సరము పొడవునను వర్షములు కురియుచుండును. బర్టను నుడివినటుల వారచ్చోట గంధకపువాయువు నాఘ్రాణించిరి.

" బర్టను నుడివినది నిజమే. ఒక్కొక్క పొదచాటున నొక్కొక్క శవ మున్నటుల వాసన కొట్టుచున్నది" అని డాక్టర నెను.

" ఇది చాల భయంకరప్రదేశము. నాకు మంచిఅనుభవమైనది" అని కెనడీ పలికెను.

" అందు సందియము లేదు. ఆఫ్రికాఖండమందలి పాడుదేశమందున్నాము. దీనిని త్వరలో దాటవలెను."

మరునా డుదయమున జోవు లంగరుల నూడదీసి యిచ్చెనమీదుగా తొట్టిలోని కేగెను. డాక్టరు ఉదజనిని ఉష్ణీకరించుటచే విజయలక్ష్మి వినువీధి కెగసి బలమగు వాయువుచే గొనిపోబడుచుండెను. అచ్చటచ్చట కనబడు చుట్టుగుడిసెలే మానవవాసగృహములు. విమానము కొంతద వ్వేగుటచే దేశపుతీరు మారెను. కెనడీకి జ్వరబాధ హెచ్చెను.

" జ్వరముచే బాధపడుటకు సమయ మిదికాదు" అని నుడువుచు కెనడీ కంబళిని ముసుగుపెట్టుకొని పండుకొనెను.

" కొంచె మోపికపట్టుము. నీజ్వరము త్వరలో నయమగును."

" ఈజ్వరము పోవుటకు మందేమైన నిమ్ము. కండ్లుమూసికొని మింగెదను."

"లోపలికి తీసికొను మందుకన్న వ్యయప్రయాసలు లేని ప్రకృతి సిద్ధమైన మందు నిచ్చెదను. అది యీప్రదేశమును దాటుటయే."

పదినిమిషములలో వా రారోగభూయిష్ట వాతావరణ మును దాటిరి.

"త్వరలో పరిశుభ్రమగు గాలియును సూర్యరశ్మియును గల ప్రదేశమునకు జనుచున్నాము" అని డాక్టరనెను.

ఈమార్పుతో కెనడీకి జ్వరబాధ తగ్గెను. అందుచే విమానమును కెనడీ స్తుతించెను. విమానము క్రిందనున్న మేఘములు వింతగా కానబడెను. ఆనీలమేఘములు ఒండొంటి రాచుకొని మెరపుతీగెలను బుట్టించుటయేకాక సూర్యకిరణము లను ప్రతిబింబించుచుండెను. విజయలక్ష్మి 4,000 అడుగుల యెత్తున కేగెను. ఉష్ణమాపకయంత్రములోని పాదరసము దిగుచుండు టచే శీతము హెచ్చుచుండె నని తెలియజేయుచుండెను. మేఘావృతముచే భూమి కాన్పించుటలేదు. పడమరదిక్కున యేబదిమైళ్ళదూరమున రుబేహాబా శిఖరము పసిండిచాయల మిసమిసలు కన్నుల మిరుమిట్లు గొలుపుచుండెను. ఆశిఖరము ఉగోగాదేశపు సరిహద్దున 36 వ కళలోని 20 వ వికళయం దున్నటుల కనబడెను. వాయువు గంటకు 20 మైళ్ళ వేగమున వీచుచుండెను మూడుగంటల కాలములో కెనడీకి జ్వరము తగ్గి యాకలిహెచ్చెను.

"వాతావరణపు మార్పు నాశరీరమునకు క్రయినా తన్న నెక్కువ యారోగ్యము నొసగెను." అని కెనడీ పలికెను.

"నేను మునగితనమున నాజీవితము నిచ్చట గడపెదను" అని జో వచెను.

ఆ సమయము పది గంటలకు నిర్మలాకాశ, మేర్పడ విమానము మేఘోపరి భాగమునుండి క్రిందకు దిగెను. భూమికి 600 అడుగుల యెత్తున వాయువు నైరుతిమూలగా వీవ జొచ్చెను. జుంగోమొరాదేశము దాటెను. అచ్చటి కొబ్బరితోపులు చూచుట కింపై జెలంగుచుండెను. అచ్చటచ్చటనున్న పర్వత శిఖరములను దాటుటకై విమానము వినువీధికి గొనిపోబడుచుండెను.

"ఇంకను మనము దుర్గంధప్రదేశమును దాటలేదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"దాటితిమి" అని డాక్టరు హెచ్చరించెను.

"ఈ పర్వతప్రదేశముల నుయ్యేలలూగుచు జనుట నాకు సంతసముగ నున్నది" అని జోప్రు పలికెను.

పర్వతశిఖరములు విమానమునకు తగులకుండ ఫెర్గసను విమానమును నడుపుచుండెను.

"భూమికి సమీపమున కేగినచో జ్వరబాధచేగాక నరబాధచేగూడ పీడింపబడి యింతదూరము రాజాలకుందుము.

భూమార్గమున మనము వచ్చియుండినయెడల బరువును మోయు జంతువులు నశించుటయేగాక అలసటచేతను,కూ్రరుల బాధవలనను నిరుత్సాహులము, కొన్ని వేళల నిర్జీవులము నయి యుందుము. మనకు దారిజూపునారే మనలను బాధించి యుందురు. పగటిపూట ఎండవేడిమికిని, రాత్రిపూట చలి బాధకును తాళజాలము. కొన్ని కీటకముల కాటులు విష ప్రాయములయి శరీరసౌష్టవమును నష్టపరచి క్రమక్రమముగా నసువుల బాపును. ఇంతియుగాక వన్యమృగముల బాధలు వర్ణనాతీతములు" అని డాక్టరు నుడివెను.

"అన్నిబాధలను నేను పడజాలను" అని జో వనెను.

"ఇందులో నెంతమాత్రము మతిశయోక్తి లేదు. ఈప్రదేశ ములలో ప్రయాణముజేసినవారిచరిత్రలు వినినచో కన్నీరు మున్నీరయి పారును. "

పదునొకండు గంటలకు 'ఇమోంజీ' సరస్సును దాటిరి. పర్వతములపై చెదరియున్న తెగలవారు విజయలక్ష్మిని తమ బాణములచే నొప్పింపజూచిరి. కాని వారి కది సాధ్యపడలేదు. విమానము రుబేహోదేశపు సరిహద్దులలోని కేగెను. వైమా నికులచట ప్రకృతిసౌందర్య సర్వస్వమును కొల్లగొనుచుండిరి. అచ్చటి పర్వతము లన్నియును మూడుకనుములుగ విభజింపబడి యాకనుమలమధ్య గొప్పబయళ్ళుండెను. ఈ కనుమలయందు జనించు నదులన్నియును జాంజిబారు వైపునకు ప్రవహించు

చుండును. కనుమలకు పశ్చిమదేశము పీఠభూమి. కనుమల మధ్యగల లోయలన్నియు సారవంతములైన సీమలు. అందుచే నచ్చట పైరుపంటలు కోరినతీరున పండుచుండును. తుమ్మలు చింతలు తాళ్ళ మధ్యగుండ ప్రవహించు సెలయేళ్ళు కింగానీ సరస్సున పడుచుండెను.

"జాగ్రత్తగా నుండుడు! మనము రుబేహోను సమీపించుచున్నాము" అని డాక్టరు హెచ్చరించెను.

రుబేహో యన గాలిప్రవాహములు. ఆప్రవాహము లలో బడకుండ నుండుటకై విమానమును 5,000 అడుగుల యెత్తునకు గొనిపోవలెను.

"మనము పలుమా రింత యెత్తున కేగవలయునా?"

"అక్కర లేదు. ఆఫ్రికా దేశపు పర్వతములు ఆసియా ఐరోపా ఖండములందు గల పర్వతములకన్న యెత్తుతక్కువ."

అచిరకాలమున ఉదజని వెచ్చనై విమాన మూర్ధ్వ ముఖముగ నేగెను. ఉదజనిచే విమానము మూడుభాగములు మాత్రమే నింపబడుటచే ఉదజని వ్యాకోచమువలన విమానపు పట్టువస్త్రము చెడదు. భారమాపకమందలి పాదరసము ఎనిమిదంగుళములు తగ్గినందున విమానము 6,000 అడుగుల యెత్తున కేగినటుల కనబడెను.

',మన మింత యెత్తున నెంతకాలము ప్రయాణము చేయ గలము?"

"భూమిని నావరించియున్న వాతావరణము 6,000 నిలువుల వరకు గలదు. పెద్దవిమాన మున్నచో నింతకన్న నెక్కువ ఉన్నతమున కేగవచ్చును. కొన్ని సంవత్సరముల క్రితము శారలు, బిక్షో యనువారలు చాల పైకేగిరిగాని వారి విమానము చినిగిపోయెను."

"వారు క్రిందపడి చనిపోయిరా?"

"వారు ప్రకృతిశాస్త్రవేత్తలగుటచే ప్రాణాపాయము లేకుండ దిగిరి."

"సరేగాని నేనుమాత్ర మంతయెత్తున కేగను. క్రిందకు దిగను. ఉన్నదానితో సంతుష్టినందెదను." అని జో వచెను.

6,000 వేల యడుగుల ఉన్నతమున వాయుతారతమ్య గరిమ తగ్గుటచే నేత్రములయొక్కయు కర్ణములయొక్కయు పటుత్వము తగ్గెను. వస్తువులు చలించుచున్నటుల కాన్పించెను. మనుజులును జంతువులును నదులును తటాకములును సరిగ కాన్పించుటలేదు. ఫెర్గుసను విమానమును రుబేహూ యనుపేరనే పిలువబడు పర్వతములను దాటించుచుండెను. సూర్యకిరణములు తత్పర్వత హిమశిఖరముల పైబడి ప్రతిబింబించుచుండెను. విమాన మాపర్వతములను దాటి అడవులతో నిండిన సుక్షేత్రమగు దేశమును సమీపించెను. విమానము చిన్నయెడారిని దాటి కొన్ని మైదానములను దాటిన పిదప నొకమహారణ్యమును సమీపించుటచే ఫెర్గుసను భూమిని

సమీపించి లంగరులను విసరెను. లంగరులు రావివృక్ష శాఖలలో పట్టుబడుటచే జోవు త్రాటివెంబడి దిగి లంగరును చెట్టునకు దిట్టపరచెను. చలనవిహీనమైయున్న గాలియందు నిలబడి యుండుటకు వలయు వేడిమిని ఉదజని కలిగియుండెను.

"డిక్కు! నీవును, జోవును చెరియొక తుపాకిని గైకొని భోజనమునకై కొంతమాంసమును కొనిరండు" అని ఫెర్గసను ఆజ్ఞాపించెను.

కెనడీ నిచ్చెనమీదుగాను జోవు చెట్టుకొమ్మలమీదుగాను భూమికి దిగినవెంటనే ఫెర్గసను మరపొంయ్యినాడు.

"అయ్యా! మమ్ములను వీడి పారిపోకుడు" అని జోవు క్రిందకు దిగి కేకవైచెను.

"భయపడకు. నిన్ను వదలి పారిపోను. నేను యీ స్థానమున కూర్చొని అపాయము రానున్నచో తుపాకిని పేల్చెదను. తక్షణమే మీరు రావలెను" అని డాక్టరనెను.

---

# పదునాల్గవ అధ్యాయము

కెనడీ జోవులు దిగిన ప్రదేశము రేగడినేల యగుటచే ఎండవేడిమికి ఆ భూమి బీటలు వారియుండెను. అచ్చట అడవిబంటెలును, మానవులయొక్కయు జంతువులయొక్కయు

అస్థిపంజరములును గలవు. కెనడీ జోవులు జంతువులను వెదకుచు నొక యడవియందు ప్రవేశించిరి. జోవు వేటకాడు కాకపోయినను తుపాకితో బాగుగా గురిజూచి కాల్పగలడు.

"నడచుట దేహమున కారోగ్యకరమైనను యీ భూమి నడచుటకు వీలుగాలేదు" అని జోవనెను.

కెనడీ జోవును మాట్లాడవద్దని సైగజేసెను. పసిగట్టుటకు కుక్కలు లేకపోయినను జలపతనమున కొన్ని జింకలు నీరు త్రాగుచుండుటను పొడగట్టెను. వెంటనే కెనడీ పొదచాటున నుండి గురిచూచి కాల్చెను. లిప్తకాలములో జింకలన్నియు నదృశ్యములయ్యెను. గురిచూడబడిన జింకమాత్రము దెబ్బతిని పడియుండెను.

"దెబ్బ యెంతసూటిగా తగిలినది! ఇది జింకలలో క్రొత్త రకము. దీని చర్మమును తీసి బాగుచేయుమనా!" అని కెనడీ తలంచెను.

"డాక్టరా భారమును కొనిపోవుట కొడంబడదు. మనము దానిలోని కొన్ని మాంసఖండములను మాత్రమే కొనిపోవుదము. నీవాజ్ఞ నొసగినచో లండను నగరమందారి తేరిన కసాయివారికన్న మిన్నగా నామృగమును ఖండ ఖండములుగ భేదించి నీమెప్పు గాంచగలను" అని జోవనెను.

"మాంసఖండములను విడదీయలేనివాడు వేటకాడెట్లగును? అయినను ఆపనిని నీకు విడచెదను."

"మంచిది. రాళ్ళతో పొయ్యిని తయారు చేయుము. ఎండుపుల్లల నేరి తెచ్చెదను."

"ఇదిగో తయారగుచున్నది."

కొన్ని నిమిషములలో పొయ్యి తయారై నిప్పు నాలుకలు జాచుచు కనకన మండజొచ్చెను. జోవు కొన్ని మాంసశకలములను కాల్చి వేర్పుచుండెను.

"ఫెర్గుసనున కిది మిక్కిలిప్రీతి" అని జో వనెను.

"నేను యేమి యూహించుచుంటినో నీవు తెలియునా?" అని కెనడీ ప్రశ్నించెను.

"ఈ మాంసఖండము లెప్పుడు నోటబడునో యని."

"కాదు. మనవిమానము కనబడనిచో మనగతి యేమగు నని"

"ఫెర్గుసను మనలను వీడిపోవు ననుకొంటివా?"

"అట్లు చేయడుగాని లంగరూడినచో నేమి చేయగలడు?"

"లంగరూడదు. ఊడినను డాక్టరు విమానము నిచ్చటికి తేగలడు."

"జోవు! తలయు తోకయులేని ప్రగల్భము లాడకుము."

"మన మెంతటి కష్టములకైనను సిద్ధముగ నుండవలెను."

వారిట్లు మాట్లాడుచుండ తుపాకి మ్రోత వినవచ్చె.

"అపాయము వాటిల్ల నున్నది" అని జోవు తొందర పడెను.

వేటకాండ్రిద్దరును పచనమైన మాంసఖండములకై కొని తామువచ్చినదారి వెంబడిని పరుగిడిరి. అడవి దట్టముగ నుండుటచే విమానము కాన్పించుటలేదు. రెండవసారి తుపాకి మోత వినవచ్చె. వారిద్దరును పిక్కబలమును చూపించి పరుగిడుచుండిరి. అరణ్యమును దాటగనే విమానము కనబడెను.

"అపాయ మేమి?" అని కెనడీ జోవు నడిగెను.

"అయ్యో! యిం కేమున్నది!"

"నీ కేమి కనబడెను?"

"నీగ్రోలు విమానమును ముట్టడించిరి! కనబడుట లేదా!"

విమానము కెనడీ జోవులకు రెండు మైళ్ళ దూరమం దుండెను. నల్లని శరీరముగల ముప్పది ప్రాణులు లంగరు వేయబడిన వృక్షముపై కెగియుండుటచే వేటకాం డ్రిద్దరును పరుగిడుచుండిరి. మూడవసారి తుపాకి దెబ్బకు లంగురు నూడదీయ యత్నించుచుండిన ప్రాణికి తగిలి చనిపోయి చెట్టుకొమ్మల లో వ్రేలాడుచుండెను.

"ఆమృగము యేలాగున వ్రేలాడుచున్నది! తోకతో పట్టుకొని వ్రేలాడుచున్నదే! ఇది వనచర నివానము. వాన

రములు మిక్కుటముగ నున్నవి" అని జోవు సంతోషమును వెలిబుచ్చెను.

"వారు నరులుకారు, వానరులా?" అని కెనడీ యనెను.

ఆనరిమృగములు చూచుటకు భయంకరముగ నుండెను. తుపాకి దెబ్బతో కొన్ని చనిపోయి మిగిలినవి పారిపోయెను. కెనడీ వెంటనే నిచ్చెనమీదుగా విమానములోని కేగెను. జోవు చెట్టెక్కి లంగరు నూడదీసి విమానములోని కేగెను. వెంటనే విజయలక్ష్మి తూర్పుదిశగా జనుచుండెను.

"ఎంతటి అపాయము దాటినది" అని జోవనెను.

"ఈదేశీయులచే ముట్టడింపబడితి మనుకొంటిని."

"వానరము లగుటచే మన మదృష్టవంతులము."

"లంగరు పట్టూడకుండుటయే మేలైనది" అని ఫెర్గ సను పలికెను.

"జోవు! నీవు నుడివిన సంగతి నిజమైనను మాంసశకలములు మరుపును కలుగజేసినవి."

"అవును. ఈమాంసము మిగుల రుచిగానుండును."

"మీరు కొంచెము జవిగొనుడు. ఇదిగో, యిచ్చట నున్నది" అని వేటకాడనెను.

"నేను నాజీవితమంతయు నీమాంసాహారముతో గడవ గలను. కొంచెము సారాయిగూడ నున్నచో చాల మేలుగ నుండునుగదా!" అని జోవు నోటినిండ కూరుకొని నములు చుండెను.

పిదప జోవు కాఫీని తయారు చేసెను.

'ఇంతవరకు మన మదృష్టవంతులమే'' అని జోవు పలికెను.

''అవును'' అని కెనడీ నుడివెను.

''కెనడీ, నీవు మా వెంట వచ్చినందుకు విచారించుచుంటివా?''

''నన్నెవరయిన నావు వారున్నచో వారివని కనుగొనియుందును '' అని యావేటకాడు గాటమైన నమ్మకమున్నవాటముగ మాటలాడెను.

సాయంకాలము నాలుగు గంటలయినది. మారుతము జయలక్ష్మినివెంట నిడుకొని మింట వడివడి గొంపోవుచుండెను. అది పీఠభూమియగుటచే విమానము 1,500 అడుగుల యెత్తున నున్నటుల భారమాపకము తెలిపెను. ఏడుగంటలకు విమానము కెనేమి నదిపై నెగురుచుండెను. ఆప్రదేశమంతయు నరణ్య సంకీర్ణమగుటచే నాదేశీయులు నదీతీరముననే తమ గృహముల గట్టుకొనిరి. ఉగోగాదేశవు నవా బచ్చటనే తనసౌధమును నిర్మించుకొనెను. ఆదేశీయులు నాగరకత లేనివారగుటచే బానిసవర్తకము ప్రబలియుండెను. పగలంతయు పనిపాటలచే నలసిసొలసిన వాయుకుమారుడు రేయి కదలక మెదలక నిదురజెందెను. వాయుప్రవాహమునకై ఫెర్గుసను యత్నించి విఫలమనోరథుడయి రాత్రికాల మచ్చటనే గడపదలచి విమానమును వేయియడుగుల ఉన్నతమున నుంచెను. విజయలక్ష్మి

విహారమును గట్టిపెట్టి విశ్రాంతిని గొనుచుండ తారకాగణ దీపికావళి గగనాంతర సౌధసీమను మినుకుమినుకుమని వెలుగు చుండెను. డాక్టరు మేలుకొనియుండ కెనడీ జోపులు విదురించిరి రెండుఝాములకు కెనడీ మేల్కొనియుండ డాక్టరు నిదు రించెను.

" ఆపదవచ్చినచో లేపుము. భారమానకమును చూచుచుండుము. అదియే మన చుక్కాని " అని డాక్టరు కెనడీతో నుడివి పండుకొనెను.

ఆరాత్రి చలి మిక్కుటముగ నుండెను. రాత్రికిని పగటికిని ఉష్ణతారతమ్యము 28 అంశలు. చీకటులు నలు దిశల గ్రమ్మినతోడనే అడవిమృగములు తమతమ నివాసము లనుండి వెలువడి నలుదెసల నాహారమును వెదకుచు బయలు దేరెను. సింహగర్జనములను విని లేళ్ళు మొదలగు జంతువులు నూర్పిన్పడి తమ స్థానములనుండి వెలువడి ప్రాణభీతిచే నలు దెసల పరుగిడుచుండెను. కప్పల బెకబెకలును నక్కల కూత లును సింహగర్జనములతో మేళవించి చెవులకు ములుకులై విననయ్యెను డాక్టరు మేల్కాంచిచూడ విజయలక్ష్మి వాయు వ్యమూలనున్న శిలామయమగు బంగురుదేశముపై జనుచుం డెను. ప్రాతఃకాలమునకు పాషాణమొందు వైమానికుల దృష్టి పథంబునం బడెను.

"మనము దారి తప్పలేదు. ఆ 'జిహాలాంకో' వద్ద నాగి కొంచెము నీటిని నింపుకొందము. లంగరును విడువవలెను" అని డాక్టరనెను.

"పచ్చని చెట్టయినను కాన్పించుటలేదు" అని కెనడీ పలికెను.

"మనము విమానము నాపుట ముఖ్యము. జోవు, లంగరును విడువుము."

విమానోత్పతనశక్తిని తగ్గించుటచే విమానము క్రమేణ క్రిందికి దిగెను. లంగరులు కాతికలుగులలో తగులుటచే విమానము నిలబడెను. భారమాపకమును జూడ విమానము సముద్రమట్టమునకు 600 అడుగుల యెత్తున నుండెను.

జోవు పదిగేలనుల నీటిపీపాను గైకొని జిహాలాంకోకు పశ్చిమమున నున్న కొలనియొద్ద కేగి నీరమును నింపి ముప్పాపు గంట కాలములో తిరిగి వచ్చెను. వాని కచ్చోట వింతలు గాన్పించకున్నను ఏనుగుల పట్టుటకై త్రవ్వబడిన గోతులనుపన్నిన వాగురలను జూచెను. ఒక వాగురునందు వన్యమృగములచే తినబడిన కళేబరము గలదు. విమానపు తొట్టి నేల నంటుటచే నీటి పీపాను సులభముగ తొట్టిలో నుంచిరి. జోవు లంగరుల నూడదీసి తొట్టిలోని కేగ ఫెర్గుసను మరపొయ్యిసాయముచే విమానము నూర్ధ్వముఖముగ గొనిపోయి విమానయానమును యథాప్రకారము సాగించెను.

అచ్చటికి నూరుమైళ్ళ దూరమందున్న కెజానుకు సాయంకాల మునకైన జేరగలమని వైమానికులు తలచిరి. వారివిమానము గంటకు 16 మైళ్ళచొప్పున నడుచుండెను. దేశము మిట్టభూమియై కొన్నిచోట్ల 3,000 అడుగుల యెత్తునున్న పర్వతములను దాటుటకై ఉదజని అప్పుడప్పుడు ఉష్ణీకరింపబడుచుండెను. తెంబోటు, రానెల్సు గ్రామములను దాటెను. మధ్యాహ్నము రెండుగంటలకు విమానము కెజాపట్టణముపై నెగురుచుండెను. కెజానగరము సముద్రమునకు 360 మైళ్ళ దూరమందున్నది.

"ఉదయమున 9 గంటలకు జాంజిబారునుండి బయలు దేరి రెండురోజులలో 500 భూగోళపు మైళ్ళదూరము వచ్చితిమి. బర్టనుస్పెకీగార్లిచటి కేగుటకు నాలుగునెలల పదిహేను రోజులు పట్టెను" అని డాక్టరనెను.

---

# పదునైదవ అధ్యాయము

కెజానగరము పెద్దది కాకపోయినను ఆఫ్రికాఖండమందలి మధ్యదేశమునకు ముఖ్యస్థానము. అచ్చట గొప్ప మేడలు లేకున్నను వందలకొలది చిన్న గుడిసెలు గలవు. పూదోటలు విస్తారముగ నుండెను. ఉల్లి బంగాళాదుంపలు గుమ్మడికాయలు ముల్లంగి మొదలగు కూరగాయలు పండుచుండెను.

యూనియాంవెజీ దేశము ఆఫ్రికాఖండములో సారవంతమగు దేశము. ఆదేశమునకు మధ్యనున్న యూనియానెంబో యను స్థానము మనోహరమైనది అచ్చటనున్న అరబ్బులు ఆఫ్రికా అరేబియా దేశములలో తుమ్మజిగురు దంతములు దూది వస్త్రములు బానిసల అమ్మకము మొదలగు వ్యాపారములు చేయుచుండిరి. తీరమునన్న పట్టణములనుండి సువాసనద్రవ్యములను నూతనవస్తువులను కొనిపోయి విక్రయించుచుండిరి. ఈ వర్తకులకు కెజా విశ్రమస్థానము.

కెజానగరపు బజారులలో రంగులుగల వస్త్రముల, పలు తెరంగుల ముత్యములు, ఖడ్గమృగముల కొమ్ములు, తేనె, పొగాకు, దూది మొదలగు సరకులు విక్రయింపబడుచుండెను. ఆబజారునందు గలకోలాహలము లిప్తకాలములో సన్నగించెను. పురుషులు, స్త్రీలు, పిల్లలు, బానిసలు, వర్తకులు, అరబ్బులు, నీగ్రోలు తమతమ కుటీరములలోనికి పరుగిడిరి.

“మనము వారి నిటుల బెదరించినచో వారితో వ్యాపారమెటుల సాగును?” అని కెనడీ పలికెను.

“వీరితో మనము వర్తకము చేయు టెట్లు? మనము నెమ్మదిగ దిగి వారి విలువగల సరకులను తీసికొని డబ్బు యియ్యకుండ పారిపోవుటయే! వారు మనవిమానముదరి జేరరుగదా!” అని జోవు పరిహాసించెను.

"వారు మనలను జూచినవెంటనే భయపడి పారిపోయి నను క్రొత్తవారలను కనుగొనవలయునను కోరికతోను మనల గాంచి పూజింపవలెనను మూఢవిశ్వాసమువలనను త్వరలో బయటకు వత్తురు" అని డాక్టరనెను.

"వారు తిరిగి గృహములనుండి వెలువడుదురా?"

"మనము దాని విప్పుడే చూచెదము. చొరవజేసి వారిని సమీపించుట హానికరము. ఒక అమ్ముగాని గుండుదెబ్బగాని తగిలినచో మన విమానపుబుట్టకు రంధ్రముపడుట నిశ్చయము."

"మనకీ యరబ్బులతో నేమిపనిగలదు?"

"ఈ దేశస్థులలో మిగుల నాగరకతగలజాతి యీపట్టణమున గలదు. బర్టను స్పైకీగార్లు ఆజాతివారిచే నాదరింపబడిరి. మనల నేవిధముగ నారాధించెదరో చూచెదముగాక!"

విజయలక్ష్మి భూమిని సమీపించినతోడనే లంగరు బజారువద్దనున్న చెట్టుకొమ్మకు దగిలి విమానము నిలబడెను. గుడిసెలలోనుండి పురజనులందరును క్రమక్రమముగా బయటికి వచ్చిరి. వారిలో భూతవైద్యులు సాహసించి విమానముదరి కేగిరి. వారి మొలచుట్టును భూతవైద్యపు పరికరములు వ్రేలాడుచుండెను. ఈభూతవైద్యులు ముందంజవేయుచుండ పురజనులు వారివెనుక నడచుచు విమానమున్న చెట్టును సమీపించిరి. డప్పులను మ్రోగించుచుండిరి. కొమ్ములనూదుచుండిరి.

ఆపురజనులందరు శిరముల నూర్ధ్వముఖమున నిగిడ్చి వైమానికులను ప్రార్థించుచుండిరి.

"వారి ప్రార్థనలను చూడ మనవలన వారి కేదియో మహోపకారము కావలసియున్నది" అని డాక్టరనెను.

"ఆకార్య మెట్టిదియో చూచెదముగాక" అని కెనడీ పలికెను.

"జోవు! నీవుకూడ నొక దేవునివలె పూజింపబడుదువు" అని డాక్టరు హెచ్చరించెను.

"సంతోషమే!" అని జో వనెను.

మంత్రివేత్తలలో నొకడు జనుల ప్రార్థనలను సమాప్తి జేసి తనభాషలో వైమానికులతో భాషింప ఫెర్గుసనున కాభాష తెలియనందున అరబ్బీభాషలో నతడు తిరిగి ప్రశ్నించెను. మంత్రివేత్త అరబ్బీభాషలో చిన్న ఉపన్యాసమొసగెను. చంద్రుడు మనుష్యాకృతిని దాల్చి తనకొడుకులతో కైజాపట్టణమును జూచుట కేతెంచె ననియును, అందుచే పురజనులందరును మిగుల కృతజ్ఞులుగ నుందురనియు నాతని యుపన్యాస సారాంశము. దానికి ప్రత్యుత్తరముగ డాక్టరు గంభీరోపన్యాసము నొసగెను. అందుల సారాంశము చంద్రుడు తన దేశమును చూచుటకై పది శతాబ్దముల కొకసారి యేతెంచుననియును ప్రజల మంచిచెడ్డల సమాలోకించు ననియును వారికి మిగుల నిష్టమగు వరముల నొసగు ననియును గలదు.

వారి సుల్తాను కొన్ని సంవత్సరములనుండి జబ్బుగా నుండెననియును, సార్వభౌముని శరీరారోగ్యమునకు దేవతాసహాయము కావలెననియును, శశికుమారులు వచ్చి సుల్తానును జూడవలెననియును మాంత్రికుడు కోరెను. డాక్టరా సంగతి తన సహచరులకు నుడివెను.

"ఈ నీగ్రోసుల్తానును నిజముగా చూడవలె నని యున్నదా?" అని వేటకాడు ప్రశ్నించెను.

"అవశ్యకర్తవ్యము. వారు మనయందు సదభిప్రాయమును గనబరచినపుడు భయములేదు. వాతావరణము విశ్రాంతి నొందుచున్నది. విమానమునకై భయములేదు."

"సరేగాని నీవేమి చేయుదువు?"

"నావద్దనున్న మందుతో వానిరోగమును కుదిర్చెదను" అనిపలికి ఫెర్గుసను నీగ్రోలతో,

"చంద్రుడు యూనయాంవెజి దేశస్థులపై కరుణబూని వారికి సార్వభౌముడైన సుల్తానుగారి రోగమును కుదుర్చుటకు సమ్మతించె నని మీచక్రవర్తితో మనవిజేసి మమ్ముల నాహ్వానించుటకు సిద్ధముగ నుండుమని చెప్పుడు" అని సెలవొసగెను

ఈవార్త వినబడినవెంటనే జనుల కోలాహలము హెచ్చెను. కండచీమల బారువలె నొకరివెనుక నింకొకరుగా జనులందరును కదలుచుండిరి.

"మము దిగవలయును. ఏ అపాయము వచ్చినను జంకకూడదు. క్షణకాలములో నెగిరిపోవుటకు సంసిద్ధులమై యుండవలెను. కెనడీ! విమానములో నుండి మరపొ్రియ్యని జూచుచు ఉదజనిని సరియగు వేడిమియం దుంచవలెను. నే నొంటరిగ సుల్తానువద్ద కేగెదను. జోవు నిచ్చెనకడ నుండవలెను." అని డాక్టరు యేర్పరచెను.

"మీరొంటరిగ సుల్తానువద్ద కేగెదరా?" అని కెనడీ ప్రశ్నించెను.

"నన్నుకూడ మీ వెంటరానీయరా?" అని జో వడిగెను.

"మీరు రాగూడదు. నే నొంటిగా నేగెదను. ఈప్రజలకు చంద్రుడే నిజముగ వచ్చెనను నమ్మకము గలదు. నేను మూఢవిశ్వాసముచే రక్షింపబడుదును. మీకు భయమువలదు, నేను నిర్ణయించినటుల జేయుము."

"మీ యిష్టానుసారమే నడచెదము" అని కెనడీ పలికెను.

"ఉదజనివ్యాకోచమును కనిపెట్టుచుండుము."

"సరే."

క్రిందనున్న జనుల కోలాహలమునకును వాద్యములకును మేర లేదు. వారు మన వైమానికులను దేవతలుగ గొని యాడుచుండిరి.

"వీరు చంద్రునియందును చంద్రుని మువ్వురు కుమారుల యందును భక్తిశ్రద్ధలు గలిగియున్నారు" అని జోవనెను.

డాక్టరు మందుల సంచిని చేగొని విమానమునుండి దిగెను. జోవుకూడ దిగి డాక్టరు జనినపిదప నిచ్చెనవద్దనే మరము వైచుకొని కూర్చొనెను. జనులతని చుట్టును మూగి శ్రద్ధాభక్తులతో చేతులు జోడించుకొని నిలబడియుండిరి. ఫెర్గుసను పురోహితులును వైద్యశిరోమణులును వెంటగొలువ రాజభవనమునకు జనుచుండెను. ఆరాజభవనము పెద్ద చుట్టుగుడిసె. చుట్టునున్న గుడిసెలకన్న పెద్దదిగను కొంచెము శుభ్రముగను నుండెను. ఈరాయులభవనము ఊరు వెలుపల నుండెను.

సాయంకాలము మూడుగంట లగుటచేతను, పొద్దు గ్రుంకినగాని చంద్రోదయము కాకుండుటవలనను విమానదేవతలకు హానికరమగు సమయ మదికాదు.

సముచిత పరివారపరివృతుండై యువరాజు చనుదెంచి ఫెర్గుసను నెదుర్కొని సాష్టాంగదండ ప్రణామం బాచరించెను. అంతట ఫెర్గుసను వానిని దీవించి లేవనెత్తెను.

వారందరును మువ్వాపుగంటకాలము చెట్లనీడచే నావరింపబడి రెండువైపులను పచ్చని పైరులచే నయనానందకరముగ నున్న దారివెంబడి జని కొండవద్దనున్న రాజభవనమును జేరిరి. ఆమందిరమునకు నలువైపుల నెత్తైన అరుగులు గలవు. గోడలు మానవవిగ్రహములతోను, సరీసృపము

యాకారములతోను నిండియుండెను. ఆగృహమున కొకటే ద్వారము. సుల్తానుగారి యుద్యోగీయులును పరివారమును ఫెర్గుసనుగారి కాతిథ్య మొసగిరి. మెలికలు చుట్టుకొనియున్న వారి కేశములు భుజములపై వ్రేలాడుచుండెను. వారి చెక్కిళ్లు రంగులతో నలంకరింపబడెను. సిపాయిలు విషపుటమ్ములను బాణములకు సంధించి కత్తులను గండ్రగొడ్డళ్లను మూపులపై నిడుకొని సుల్తానుగారిని కాపాడుచుండిరి.

ఫెర్గుసను రాజమందిరములోని కేగెను. సుల్తాను మిగుల బాధపడుచున్నను ఆహ్వానచిహ్నమగు కరతాళధ్వనులు మిన్నుముట్టెను. మందిరద్వారమునకు పైన కుందేళ్లతోకలును అడవిమృగముల చర్మములును రత్నరేకులుగ నుంచబడెను. రాణులందరును డాక్టరున కాతిథ్య మొసగిరి. చక్కగ నలంకరించుకొని నారచీరెలను ధరించి వారలందరును ధూమపాన మొనరించుచుండిరి. వారిలో పట్టపుదేవేరులారుగురును విచారమును దూర మొనరించి దరహాసితాననలై సుల్తానును పరివేష్టించి యుండిరి. సుల్తానుచనిపోయినచో పట్టపుదేవులు సహగమనము చేయవలెను.

డాక్టరు వెంటనే సుల్తాను శయ్యవద్దకు జని రోగిని పరీక్షించెను. సుల్తానునకు నలుబది యేండ్ల వయస్సు గలదు. నిద్రాపానాది వ్యసనలోలుడై కాలమంతయు గడపుటచే ధాతువులన్నియు నశించి కదలమెదల శక్తిసామర్థ్యములు

లేక సుల్తాను జీవచ్ఛవము వోలె పడియుండెను. అశ్వనీదేవత లమరలోకమునుండి సుధారసమును దెచ్చి యిచ్చినచో నతడొకవేళ జీవింపవచ్చును. అంతియేగాని మనుజలోకమున గల మందులవలన నొంతయు లాభములేదని సంపూర్ణముగ ఫెర్గుసను గ్రహించెను. డాక్టరు సుల్తానుభవనమున ప్రవేశించినది మొదలు పరిజనమును రాజులును తుదిదనుక సాష్టాంగ నమస్కారముల నొనరించుచునే యుండిరి. డాక్టరు తనవెంట గొనితెచ్చిన ద్రావకము నిచ్చినందున సుల్తానునకు గొంచెము స్పృహగలిగి కొన్నినిమిషములవరకును తెలివిగ నుండెను. కొన్నిగంటలనుండి తెలివిలేనివానికి తెలివివచ్చుటచే పరిజనము సంతోషమును వెలిబుచ్చుచు కేకలువేయ దొడగిరి.

సీగ్రోలా సంతసమున నోలలాడుచుండ ఫెర్గుసను తన విమానము వైపునకు రయమున జనుచుండెను. సాయంకాల మూడుగంటలైనది. జోవు నిచ్చెనవద్ద కూర్చొని యుండ సీగ్రోలు వానిచుట్టును జేరి పూజించుచుండిరి. జోవు వారిచే పూజింపబడుటయేగాక భక్తిశ్రద్ధలతో వారొసగు నైవేద్యముల నారగించుట కించుకేనియు సంశయించుటలేదు. పిల్లలు వాని చుట్టును జేరి వలయాకారముగ నాడుచు పాడదొడగిరి. జోవు చూచుచు మానమూనలేక తన చేతులతోడను కాళ్ళతోడను నాట్యముజేసి చంద్రమండలములోని నాట్యమును సీగ్రోలకు కనబరచెను. పిల్లలందరీ దేవనాట్యమును నేర్పు

కొనిరి. ఈనాట్యసభ వృద్ధి యగుచుండ డాక్టరు పరిత్యక్తు మాయెను. ఆతనివెంట నెందరో కేకలువేయుచు వచ్చుచుండిరి. మంత్రవేత్తలును పరివారమును డాక్టరు వచ్చిన వన్నెగడను తెలిసికొని కోపోద్రిక్తులైరి. భక్తిరస పూరితమైన దృశ్యము క్షణమాత్రమున రౌద్రరసావేశవివశమై పరిణమించెను. ఇంక నొక్కనిముసమునకు భీభత్సరూపము జెంది ఫలించునేమో యని చూపరులకు భయము గలిగింప జొచ్చెను.

ఇంతలో నిట్లు మారుటకు కారణ మేమి? ఈ దేవతా వైద్యునిమహిమచే సుల్తాను సురలోకసుఖముల జవిచూడ నేగెనా?

కెనడీ పైనుండి యీ యపాయమును జూచెనుగాని దానికి కారణ మారయ లేకుండెను. తత్క్షణమే యెగురుటకు గాను ఉదజనిని వ్యాకోచింపజేసెను. డాక్టరు కాలయాపన జేయక తొట్టిలోని కేగెను. జోవు వానివెంట జనెను. మూఢ భయముచే జనులు నిచ్చెన నింకను సమీపించరైరి.

"మనము ఆలసింపరాదు."

"లంగరును కోసివేయుదునా?"

"ఏమి ఆపద?" అని జో వడిగెను.

"ఏమి అపాయము?" అని కెనడీ తుపాకిని గైకొనెను.

"చూడుడు!" అని డాక్టరు ప్రాగ్దిశాముఖమును విలోకించెను.

"అచ్చ టేమిగలదు?" అని వేటకా డడిగెను.

"చంద్రబింబము కాన్పించుటలేదా" అని డాక్టరు పలికెను.

ఇందీవదన సిందూరతిలకముంబోలు చంద్రబింబంబు డంబును బ్రోచీదిగంగానాధర తాంబూలరాగరక్తమం బోలు సంజకెంజాయ లోచనగోచరం బాయెను. నీగ్రోలు మోన మును గ్రహించిరి. ఆకసమున రెండు చంద్రబింబంబుల నెప్పు డైన కాంచిరా! జోవున కంతరంగంబు నందలి సంతోషసాగ రము వెల్లివిరిసెను. కెజానగరవాసులు శత్రువులు పారి పోవుచున్నారని రౌద్రమూర్తులై బాణములను విడచి తుపా కులను పేల్చిరిగాని అందుచే వ్యర్థమనోరథులైరి. ఒకమంత్ర వేత్త లంగరు బంధింపబడిన వృక్షము నధిరోహించెను. లంగరు త్రాటిని పట్టుకొని లాగయత్నింప జోవు గండ్రగొడ్డలిని చేకొనెను.

"త్రాటిని నరుకుదునా? అని జో వడిగెను.

"వలదు కొంచె మాగుము."

"ఆనీగ్రో—"

"మనము లంగరును వదలగూడదు."

మంత్రవేత్త శ్రమపడి లంగరు నూడదీసెను. లంగ రూడినవెంటనే విమాన మూర్ధ్వముఖముగ నేగెను. మంత్ర వేత్త లంగరును పట్టుకొని వ్రేలాడుచుండెను. మంత్రవేత్తలతో

నొకడటులకొనిపోబడుట జూడ పురజనుల మనము లెట్లుండునో చదువరులే యూహించెదరుగాక.

"ఆహా! ఎంత వింతగ నున్నది" అని జో వనెను.

"ఆసీగ్రోను క్రిందపడ వేయుదమా!" అని జోవడిగెను.

"వలదు. వానిని నెమ్మదిగ క్రిందకు విడువవచ్చును. తిరిగి తనజాతివారిని కలిసికొనినచో వాని మంత్రిబలమును కీర్తియును వృద్ధియగును."

"వానిని దేవతగా దలంతురు."

విమానము వేయియడుగుల యెత్తున కేగినను సీగ్రో త్రాటిని విడువలేదు. పశ్చిమముగ వీచు వాయుతరంగము విమానమును అరగంటకాలము వెంటగొనిపోయిన పిదప ఉదజనిని సంకోచింపజేసి విమానమును ఫెర్గుసను భూమికిసమీపమునకు గొనిపోవ మంత్రివేత్త లంగరును విడచి భూమిపై పడి లేచి కెజాపట్టణాభిముఖుడై పరుగిడెను. వానిభారము తగ్గుటచే విమానోత్పతన శక్తి హెచ్చెను. పరుల బెదరింపబోవ తానే బెదరెనను సామెత ప్రకృతిశాస్త్రజ్ఞున కిత్తరి చిత్తమునకు వచ్చియుండును. శశికొమరులు నరులనుజూడవత్తురను మూఢవిశ్వాసముగలవారినైన చిరకాలము నమ్మించలేరుగదా!

"చంద్రుని మహిమ మీమందువలన గనపడలేదా?" అని జోవు ప్రశ్నించెను.

"వాడొక ముసలితాగుబోతు. పరలోక ప్రయాణమునకు సిద్ధుడైయున్నాడు. వాడు చనిపోయిన నష్టము లేదు. ప్రాపంచిక ప్రాభవము లన్నియు స్వప్నప్రాయములు, సాగర తరంగ సదృశము లని వాని జీవితము మన కెరింగించును."

"నేను వారిచే పూజాపురస్కారములను పూర్తిగ బొందలేకపోతి నను విచారము నన్ను విడువలేదు. మనము చంద్రవేష ధారులమై సంచరించితి మని చంద్రుడు కోపముచే నెర్రబాఱియున్నాడు" అని జోవు పలికెను.

ఆకాశము నీలమేఘములచే నావృత మగుచుండెను. నైరుతిమూలనుండి గాలి వీచుచుండెను. సాయంకాలము 8 గంటలకు ధ్రువరేఖయందలి 30 వ కళలోని 40 వ వికళను అక్షాంశరేఖయందలి 4వ కళలో 17వ వికళను విమానము దాటినటుల డాక్టరు లెక్కించి చూచెను. గాలి గంటకు ముప్పది యైదుమైళ్ళ వేగమున వీచుచుండెను. నదులును పర్వతములును పల్లెలును లిప్తకాలమున దాటిపోవుచుండ ఆప్రకృతి వైచిత్ర్యరామణీయకము లపూర్వానంద సంధాయకంబులై వారి నత్యంతాశ్చర్యవారాశి వీచికా భుజాంతరసీమ నోలలాడించెను.

"మన మున్న దేశమును చంద్రలోక మని వ్యవహరింతురు. ఇచ్చటి జనులు సుధాంశుని కులదేవతగ గొలుచుటచే

నీ ప్వేరీ దేశమునకు గలిగెను. ఇంతటి ఫలవంతమగు దేశ మీ ప్రాంతములో గనబడదు" అని డాక్టరువలికెను.

"ఇంత ప్రకృతిసౌందర్యమిట్టి మహాధాతుర్కల క్షేల విధాత ప్రసాదించెనో గదా!" అని జో వనెను.

"ఎంతమాట. కొంతకాలమున కీదేశము నాగరకత కాలవాల మేల గారాదు? మున్ముందు ఐరోపాఖండము సార హీనము జనపూరితమునై చెలంగునపు డచటిమానవులు క్రమ క్రమముగా నిచ్చోటి కరిగి విరివి సిరుల గొల్లలాడి, సుఖజీవన మొనరించు నపు డీ నిర్జనప్రదేశమే జనసంకీర్ణమై సకల సంప దల కాలవాలమై నాగరకశిరోమణుల కెల్ల నెల్లయై విలసిల్ల నోవును" అని ఫెర్గుసను నుడివెను.

"అట్లు జరుగు నన్న నమ్మకము మీకుగలదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"ముమ్మాటికిని గలదు. ప్రస్తుతపరిస్థితులను పరిశీ లింపుము. జనసంఖ్య మేరమీరినకొలందియు గానవగు విదేశ గమన వాంఛాపరత్వమును బరికించినచో నాతలంపే ముమ్మా టికిని నిజమని నీకుగూడతోచును. నవద్వీయాద్వీపముల నానా విధశ్రీవధూటీ నిధానమని మున్ను భరతఖండము విపుల విఖ్యాతి నార్జించి వెలుగొందలేదా? అచట ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానము, వేదాంతశాస్త్రవిజ్ఞానము, వైదికవిద్యావివేకము, కావ్యాత్మ తత్వవిచారము మొదలైన సమస్తశాస్త్రసమగ్ర

సాహిత్యము నేడు మందునకైన గానవచ్చునా! ఆ నవనవ సాగరకతా ప్రసూన పరిమళములు అభరతఖండ నందనోద్యాన వీథికావిసరములు నేడేలగానరావు? అసతీతిలకమువకుంగల సౌందర్యసౌభాగ్యసర్వస్వములు విధివిధానమున విఫలమగుట గాంచి దక్షిణనాయకుండైన నాగరకతా మాధవుండామెను విడనాడి వివేకవిజ్ఞానముల నామెకన్న చిన్నదైనను వన్నెచిన్నెల మిన్నయైన తళుకు లోలికి కనువిందువుగా జూపట్టు పాశ్చాత్యావర వర్ణినీ పర్వత స్తనద్వంద్వ త్రివళీసోపానప్రదేశసీమల నెక్కుచు డిగ్గుచు లావణ్యరసధునీతరంగభంగముల జలకేళీవిహారముల మునుగుచు తేలుచు స్వతుతుక ప్రూర్తిగా వసంతోత్సవములాడ బోయెను. అనంతర మాపాశ్చాత్యరమణీశిరోమణి ప్రజా ప్రభావ ప్రగల్భతలు కాలక్రమమున పైపై వన్నెలవలె బచరించుటవలన నామెతోడి కూటమి పలుగురాలభాగ్యము, నీటిగడ్డసౌఖ్యమే కాని ఫలప్రాయము మకరందమయముగాదని గణుతించి నాగరకతానాయకు డభినవవికాస విలాసవిశేషముల వెదజల్లు అమెరికా దేశ సీమంతినీ కేశపాశమును కరకమలముల చే నొడిసిపట్టెను. ఈమెకళాకౌశల విలాసవికాసముల కొంత కాలము వివశుడై క్షణమాత్రము నిద్రాముద్రితుండైన నాయకాగ్రణి వెనువెంటనే మేల్కాంచి తా ననుభవించిన స్వప్నగత సౌఖ్యముల రోసి నలుదెసల తేరిపారజూచెను. అంత నపూర్వలావణ్యతారుణ్యముల ముద్దుమురిపెముల నెరయ మెరయు-

ఆఫ్రికావనీ లలనాజనలలామ మాతనికట్టెదుర గానవచ్చును. ఆపెశ్రాంజిగి బిగువు సొగసు వగలును శరీరరామణీయక కామనీయకము లాతని మానసము నానందసాగరనిమగ్నము గావించును. ఆఫ్రికావనీవధువునకును నవనాగరకతావరున కును స్వయంవరమహోత్సవము హృదయనయనానంద కరముగా జరుగును. ఆనూతన వధూవరు లితరదేశీయులకు బువ్వముబంతి సాగింతురు. తరువాత వ్యవసాయమునకు మహా రణ్యములన్నియు నిర్మూలముచేయబడుచుండుటచే నాదేశపు శీతోష్ణస్థితులుగూడ మారుచుండును. ఆఫ్రికాదేశమందలి నదీనదములు పైరుపంటలకును వాణిజ్యమునకును విద్యుచ్ఛక్తిని జనింపజేయుటకును మూలాధారములైయుండ యీదేశము నవనిధానములను తన గర్భాంతరాళమునుండి వెలువరించి పరిశ్రమలను పెంపొందింపజేయును. కాన నీదేశము గొప్ప రాజ్యమై యిచటి జనులు సర్వకళలయందును చతురులై ఆవిరి, విద్యుచ్ఛక్తులను మించిన శక్తులను కనిపెట్టుదురు" అని ఫెర్గుసను నుడివెను.

"ఆహా! అట్టి సుదినమును నేను చూడగలనా?" అని జో వచెను.

"ఏమి నీతొందర!"

"పరిశ్రమలకై ముడిపదార్థములు వ్యయపడుచుండ నుదరపోషణార్థమై మానవయత్నమెల్ల వినియోగపడుచుండు

టచే మనుజుల మనములకు విశ్రాంతి కలుగజాలదు. యంత్రశాస్త్రజ్ఞులు శరీరకష్టమును తొలగించుటకు ప్రయత్నించుచుందురు. ఇటుల విశ్వామిత్రసృష్టి జేయుచు తమ వినాశమునకు తామే కర్తలగుదురు. ప్రతిదేశమందును జరుగు యంత్ర నిర్మాణమును జూడ కలియుగాంతమునకు ముప్పదికోట్ల వాయుపీడన గల (30,00,00,000 x 14· 7 పౌనులు) బాష్పము (Steam) ను తయారుజేయు బాష్పజము (Boiler) సృష్టింపబడి బాష్పజములోని పీడన మపారమైనందున బాష్పజము ప్రకటలై ప్రపంచమునకు ప్రళయకాలము చేకూరును" అని కెనడీ నుడివెను.

"అటువంటి బాష్పజమును తయారుచేయగల వారు అమెరికాదేశీయులని నానమ్మకము" అని జోవు పలికెను.

"నీవు నుడివినది వాస్తవమే. అమెరికాదేశీయులు బాష్పజములను చేయుటలో నగ్రగణ్యులు. ఇంక నీ యుపస్తుతవు ప్రశంసను గట్టిపెట్టి చంద్రలోకమునందలి ప్రశాంత ప్రకాశమును కన్నులార గని మోదముబెందుదము. మన భాగ్యవశమున మనకీ విమానవిహారము దొరకెను. కాన మనమెంతయు ధన్యులము" అని ఫెర్గుసను వారి ప్రస్తావనను ముగించెను.

మూసలోనుండు తప్తలోహమువలె మేఘములచాటున దాగియుండిన ప్రభాకరుడు వైమానికుల దృష్టిపథంబునంబడు శిలలనన్నిటిని బంగారవుముద్దలుగ మార్చెను. భూమి రాళ్ళ

గుట్టలతోడను మెట్టపల్లములతోడను నిండియుండెనేకాని పర్వతములు గోచరించుటలేదు. జౌగన్యక నదియొక్క ఉపనదియగు మలగజరి పచ్చనిచేలమధ్యనుండియును గ్రామముల నావరించిన మహాటవులమధ్యనుండియును ప్రవహించుచుండెను. విమానచారులకు సెలయేళ్ళు జలపతనములవలె కాన్పించుచుండెను. గొప్ప మూపురములుగల పశువులు పచ్చిక బయళ్ళయందలి పచ్చికలో జొరబడుటచే నవి కనబడుటలేదు. పరిమళము నొసగు వనములు కానవయ్యె. సింహములు పెద్దపులులు చిరుతలు సివంగులు మొదలగు అడవిమృగములు తమ తమ నెలవులనుండి కదలుటలేదు. మదపుటేనుగులచే విరవబడు కొమ్మల చప్పుడు వినబడుచుండెను.

"ఆహా! వేటకు మంచిదేశము. గురిచూడ నక్కరలేకయే కాల్చినను గుండ్లు నిష్ప్రయోజనములగుట కల్ల. ప్రయత్నించి చూతమా?" అని కెనడీ ప్రశ్నించెను.

"కూడదు. చీకటులు క్రమ్ముచున్నవి. తుపానువచ్చుచున్నట్లున్నది. ఈ దేశములో తుపానులు మహాప్రళయముగ వచ్చును. ఈభూమి విద్యుద్ఘటమాలవలె నున్నది."

"మీరు చెప్పినది నిజము. భూమి వేడిమిని వెడల గ్రక్కుచున్నది. చెట్లఆకులలో నొక్కటైన కదలుట లేదు. ఈ నిశ్చలస్థితికి కారణమున్నది" అని జో వనెను.

"వాతావరణమందు స్థాసిక విద్యుచ్ఛక్తిని నిండియున్నది. పంచభూతములకును మహా సంగ్రామము సంభవించు

నటుల సూచించు వాతావరణస్థితి ప్రతిప్రాణికిని భయాస్పదము. ఇట్టి వాతావరణ స్థితినియిదివర కెన్నడును చూడలేదు." అని డాక్టరనెను.

"మన విమానమును భూమిపైకి దింపుదమా?" అని కెనడీ ప్రశ్నించెను.

"క్రిందకు దిగుటకన్న పైకేగుట మేలు. గాలివానచే దారి తప్పుదుమేమోయని భయమగుచున్నది."

"అట్లయినచో మనదారిని మార్చుదమా?"

"ఉత్తరదిశగా యేడెనిమిది కళలవరకు జనుటకు ప్రయత్నించెదను. నైలునదీ జన్మస్థానమును చూడ నాశగలదు. ఆయుత్పత్తిస్థానము దొరకినచో స్పెకీమార్గములోని కేగవచ్చును. మన విమానమిప్పుడు ధృవరేఖలో 32 వ కళలోని 40 వ వికళయందున్నటుల తోచుచున్నది. మనము ధృవరేఖపై కేగవలయును."

"ఈవైపున చూడుము. నీటియేనుగు లేవిధముగ నీదులాడుచున్నవో! మొసళ్లు భయంకరధ్వానము లొనరించుచున్నవి." అని కెనడీ వలికెను.

"ఆహా! మన ప్రయాణము వింతగనున్నది. దవ్వునగనబడు వన్యమృగముల సమూహామును జూచితివా? సుమారు రెండువందల మృగములుండును. అవి తోడేళ్లవలె నున్నవి" అని జో ఆశ్చర్యపడెను.

"తోడేళ్లుగావు. రేచులవలెనున్నవి. వానికి సాహసము మెండు. సింహములనైన నెదరించుటకు వెనుదీయవు. బాటసారులకు కనబడుచుండు జంతువులలో నివి మిగుల నపాయకరములైనవి. ఇవి బాటసారులమీదికిని అడవిజంతువులమీదికిని దుమికి రక్తమును పీల్చివేయును" అని కెనడీ వర్ణించెను.

తుపానుచిహ్నము లమితమగుచుండెను. శబ్దగ్రహణశక్తిని కోల్పోయినటుల రోదోంతరాళము గానవచ్చెను. గమనసంచారములను గట్టిపెట్టి సదాగతి యోగసమాధిలో మునిగినట్లుండెను. కొంగలు, కాకులు మొదలగుపక్షులు పెద్దపులుగులు తమతమగూండ్లకు జేరుకొనుచుండెను. భారమాపకములోనిపాదరసముతగ్గెను. తండోపతండములుగవర్షించుచిహ్నములుకానవచ్చె. సాయంకాలము నాలుగుగంటలకు విజయులక్షిక్కెన్యెనిగ్రామముపై నిలబడెను. ఆగ్రామమునకు నలువైపుల నూ తాటితోపులు తుమ్మ మద్ది టేకు చెట్లును గలవు.

" నాకుకలుగు భయ మందుచేతనే. తుపానును దాటవలెనన్నచో మేఘములపై కేగవలయును. మేఘముల పైనున్న యెడల భూమి కాన్పించదు. ఈరాత్రి మన విమాన మేవైపునకు జనునో తెలియదు."

"నీవు త్వరలో నిశ్చయపరచుకొనుము. కాలము మీరుచున్నది."

"గాలివీచుటలేదు. గాలివీచినచో నీతుపానును సులభముగ దాటగలము."

"అవును. మేఘములు మనకు విరోధులు. వాయువునకు వ్యతిరేకపు చలనమును గలిగించి మనల నెచటికైనగొనిపోవును. అంతియేగాక మేఘుడు తనలోనున్న విద్యుచ్ఛక్తిచే మనవిమానమును అగ్నిహోత్రునకు నుపాహారముగా నర్పింపగలడు. గాలి రేగినచో విమానమును లంగరువేయుట కూడ కష్టము, అపాయకరము."

"అట్లైనచో మనము చేయున దేమి?"

"మనవిమానమును త్రిశంకుస్వర్గ సామీప్యమునకు గొంపోవలయును. మనకు కావలసిన నీరముగలదు. రెండువందల పౌనుల స్థిరత్వభారము తరగలేదు. అవసరమైనచో స్థిరత్వభాగము నుపయోగించెదముగాక!"

"నీతో మేముకూడ మేలుకొని యుందుము."

"వలదు. మీరు భద్రముగ నిద్రజెందుడు. అవసరమైనయెడల మిమ్ములను లేపెదను. ఆహారపదార్థములను భద్రపరచి నిదురింపుడు."

"నీవుకూడ నిదురింపవా? ఇంతవరకపాయములేదే!"

"నేను నిదురింపగూడదు. వాయు వింకను చలించుట లేదు. ఈస్థితి మారనిచో ప్రాతఃకాలమువరకు మన మిచ్చటనే యుందుము."

"కెనడీ జోపులు నిదురించిరి. ఫెర్గసను నిదురింపలేదు. నీలమేఘములు భూమిని సమీపించుటచే కటికచీకటులుక్రము

చుండెను. అట్టి గాఢాంధకార బంధురప్రదేశమున గొప్ప మెరపు మెరసి చిమ్మచీకటులను పటాపంచలొనరించెను. దాని వెనువెంటనే మహాప్రళయమువలె ఘనాగర్జనములు శ్రవణకుహారముల జొరబడెను. "భద్రముగ నుండుడు!" అని ఫెర్గుసను కేక వైచెను. ఉరుములధ్వనితో లేచిన నిద్రితు లిద్దరును డాక్టరు రాజ్ఞను శిరసా వహించిరి.

"మనము క్రిందకు దిగుదమా?" అని కెనడీ ప్రశ్నించెను.

"వలదు. విమానము గాలిలో నిలువలేదు. వాతావరణస్థితి మారుటకుముందే పైకేగవలయును" అని ఫెర్గుసను మరల ప్రొయ్యిని వెలిగించెను.

నిరక్షర రేఖవద్ద వానలు మెండు. రెండవసారి మెరసెను. దానివెంట నిరువది మెరపులు మెరసెను.

అంత నీలనీరద కృష్ణునితో విద్యుదంగనా గోపికా బృందము శ్యామల వ్యోమ కాళిందీతట పరిసరముల రాసక్రీడావిహారముల రమింపజొచ్చెను. అత్తరి రతిరభస ఛ్ఛిన్నహారమౌక్తికములో లేక విచిత్ర కేళీవిగళిత స్వేదాంబుకణికలో యన కారకవర్ష మత్యుత్కటమయ్యెను.

"మన మింతకుమునుపే పైకిజనిన బాగుగ నుండెడిది. ఇప్పు డగ్నికుండమును దాటి విమానము వినుప్పథి కేగవలయును. ఉదజని విద్యుచ్ఛక్తి కింధనమువంటిది."

"అట్లైన క్రిందకు జనగూడదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"మెరపులచే కలుగు ప్రమాదము మేఘములక్రింద నెచ్చటైన నొక్కటియే. క్రిందకు జనిన చీకటిలో చెట్లకొమ్మలకు తగిలి విమానపుగుడ్డ చిరుగును" అని ఫెర్గసను ప్రత్యుత్తర మొసగెను.

తుపానుసమయమున నిరక్షరరేఖవద్ద నిమిషమునకు 30, 35 మెరపులు మెరయును. ఉరుములధ్వని భూనభోంతరాళములు నిండును. గాలివేగము హెచ్చుగ నుండును. మెరపు తీగనుకూడ నాతుపానువాయువేగము కదల్పగలదు. ఉదజని ఉష్ణీకరింపబడుటచే విమాన మూర్ధ్వముఖమున కేగెను. కెనడీ గుడారపుఅంచులను లాగి పట్టుకొనెను. విమానపుగుడ్డ ముడతలు పడుచుండెను. వడగండ్లదెబ్బ తగిలెను. మెరపులు విమానమును సమీపించెను.

"మనవిధి యెట్లుండునో తెలియదు. ఎట్టి అపాయమునకైన సిద్ధముగ నుండవలెను" అని డాక్టరు హెచ్చరించెను.

పావుగంటలో విమానము తుపానునుదాటి మేఘములపైకేగెను. మెరపులు విమానమునకు దిగువ నొకవలపరచినటుల కాన్పించెను. ప్రయాణికులు తమ జీవితములో చూడని వింతను చూడగలిగిరి.

సౌదామినీ కామినీమణుల లాస్యాభినయ నర్తనా నైపుణ్యము లొకవంకను తారకావధూ లలామలప్రేమ

పూరిత కటాక్షాంచల ప్రసారములు వేరొకదెసను విమానవిహారుల కనుల గలంచి మనముల గరంచివైచెను. ఈ విచిత్ర దృశ్యమున కొక వింత సొబగు నింపుచు సకల కళా విశారదుండైన సుధాకర కుమారుడు స్వాంతనాలాపములాడి తారకాకువలయాక్షుల మనోధనముల గొల్లలాడుచు వైద్యుతాగ్నిచ్ఛటా ప్రణయకోపానల జ్వాలానంత ప్రచితలైన కాదంబినీ తరుణీ వేణీబంధంబున నిజకర ప్రసార మల్లికాప్రసూన మాలికా మండనం బొనరించి వారి, ప్రసన్నాంబుజముఖుల గావించుచు దాను ముసిముసి నగవు సొగసులు గులుకుచుండెను. ఈ ప్రకృతివైచిత్ర్యము సహృదయైకసంవేద్యమే గాని వర్ణనాసాధ్యముగాదు. భారమాపకమును పరీక్షించి విమానము 12,000 అడుగుల యెత్తున నున్నటుల ఫెర్గుసను నిశ్చయించెను. అప్పటికి రాత్రి పదకొండు గంటలైనది.

"మన మదృష్టవంతులము. గొప్పగండమును దాటితిమి. ఈ మహోన్నతపదవిని మన మొకింత తడ వనుభవింపవలయును" అని డాక్టరనెను.

"అత్యున్నత పదాధిరోహణ మనేకాపదల కాస్పదము గదా!" అని కెనడీ పలికెను.

"ఇది మంచి వింత. తుపాను నింత యెత్తుననుండి చూచుట నా యదృష్టమే. కన్నుల పండువుగ నున్నది" అని జో వనెను.

# పదునారవ అధ్యాయము

"సీ. ఒకమాటు నభమున బ్రకటంబుగా దోచు
నొకమాటు ధరణిపై నొయ్యనిలుచు
నొకమాటు శైల మస్తకమున వర్తించు
నొకపరి చరియించు నుదధినడుమ
నొక్కతోయంబున నొక్కటియైయుండు
నొక్కెడకనుగొన బెక్కులగును
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు
నొకతోయ మన్నియు నుడిగితోచు
నొక్కతేప కొలఁది యుడుగక త్రిప్పిన
గతి మహాహాగ్రివృత్తి గానవచ్చు
మఱియు బెక్కగతుల నరివరుల్ కలగంగ
దిరిగె సాధకంబు ధీవరేణ్య."

—భాగవతము.

సోమవారమునాటి ప్రాతఃకాలమునకు తూర్పుకొండ వెల్లు ప్రభాకరు డుదయించుచుండెను. మంద మందపవనములు మెల్ల మెల్ల వీవదొడగెను. ప్రతికూల మారుత ప్రవాహాతరంగములచే విమాన మచ్చటనే వలయాకారముగ తిరుగుచుండెను. ఉదజనిని సంకోచింప విమానము భూమిని సమీపించెను.

పశ్చిమదిశగా వీచువాయువుచే విమానము కొనిపోబడుచుండెను. టాంగనైకా సరస్సునకు చివరనుండు పర్వతసమూ

హములు మానవులకు దుర్గమములు. అందలి దరీదర శిఖరములు సర్వదా హిమమయములు.

"ఇప్పుడు మనము జనుచున్న దేశము విదేశీయులచే చూడబడలేదు. బర్టనుకూడ యింతదూరము రాజాలక పోయెను. ఈ పర్వతములు సృష్టియందు లేవని స్పెకీ వాదించెను. మన శాసందేహము తీరెను."

"మన మీ భూధరములను దాటవలెనా?" అని కెనడీ ప్రశ్నించెను.

"వలదు, మనలను నిరక్షరరేఖ వద్దకు కొనిపోవు వాయువుకొరకు యత్నించవలయును. ఈ వ్యతిరేకపు వాయువులచే మన విమానము లంగరువేయబడిన వడవ పగిది నిలబడియున్నది."

కట్టకడపట విసుగుజెందియున్న ఫెర్గుసను మనమును శాంతిపరుప పవనుడు ఈశాన్యమూలగా వీచు వాయుతరంగమును బనుప విమాన మాదిశగా జనుచుండెను.

"మనము సరియగు దారిలో జనుచుంటిమి. భూమి మనకు రెండువందల యడుగులలో నున్నది. ఈనూతన దేశమును చక్కగ పరిశీలింపనగును. స్పెకీ ఉకురూ సరస్సునకు బోవ కెజానగరమునకు పశ్చిమదిశగా జనెను."

"మన మీదారినే చనవలెనా?" అని కెనడీ యడిగెను.

"అవును. నైలునదీ యుత్పత్తి స్థానమందలి యొకప్రి

దేశమును జూడవలయును. ఉత్తరదిశగా నేతెంచిన పరిశోధకులు చూచిన దేశమును చేరుటకు 600 మైళ్ళదూర మేగవలయును."

"మన మెచ్చటనైన దిగి కొంతదూరము నడచుట మంచిది'' అని కెనడీ పలికెను.

''దిగవలయును. మనము కొనివచ్చిన యాహారము తగ్గినది. తరిగినది నింపుకొనవలెను. కెనడీ మంచిమాంసమును కొనిరాగలడు'' అని డాక్టరనెను.

"జలముకూడ కావలయును. ముందెట్టి మరుమార్గము అను నిర్జల ప్రదేశములను దాటవలయునో మన మెరుగము కాన మనము జాగరూకులమై జరించుటవలన నేమియు భంగము వాటిల్లజాలదు.''

పగలు రెండుగంటలకు విమానము ధృవరేఖలోని 29 వ కళలోని 15 వ వికళను అక్షాంశరేఖయందలి 3 వ కళలోని 15 వ వికళను దాటినది. నిరక్షర రేఖవద్ద నున్న జనులు నవనాగరకులైనను క్రూరపురాజుల పాలనలో నుండిరి. వారి నిరంకుశాధిపత్యమున ప్రజ లనుభవించు కష్టములకు మేర లేదు.

వైమానికులు భూమిపైకి దిగుటకు నిశ్చయించి మర ప్రాయ్యూనార్ప విమానము క్రిందకు దిగెను. లంగరులను వద

లిరి. లంగరు గడ్డిలో నీడ్వబడుచుండె నేగాని ఒక్క చెట్టయినను గాన్పించుటలేదు.

"ఎంతదూర మేగిన నొక్కరాయియైన గాన్పించుటలేదు. దీనినిజూడ పచ్చికమహాసముద్రమువలె నున్నది. మన వేట ప్రయత్నము వృథాయగునట్లు తోచుచున్నది." అని కెనడీ నుడివెను.

"తొందరపడవలదు. మనిషిపొడవును మించిన గడ్డిలో వేటాడుట యెట్లు? మంచిప్రదేశము రానిమ్ము." అని డాక్టరనెను.

వారిప్రయాణ మీ సమయమున నత్యంతాహ్లాదకరముగను అమితోత్సాహప్రదముగను నుండెను. నీలనిర్మల గగన పారావారమున దేలి నడయాడు నౌకవోలె వారి విమానము వెలుంగుచుండెను. అప్పుడప్పుడు బాలమలయానిల కరాఘాతముల కందుకము కైవడి విజయలక్ష్మివిమానము క్రిందకిని మీదికిని గంతులిడుచుండెను. మరియు పలురంగులుగల విహంగములు కుహూకుహూ రావములతో గడ్డిలోనుండి లేచి యెగిరిపోవు చుండెను. మానవశరీరమందలి యాహారనాళము లోనికి కబళముజనున ట్లీపచ్చికసముద్రములోనికి విడువబడిన లంగరు విడచినస్థావము మూయబడుచుండ ముందున కీడ్వబడుచుండెను. తటాలున విమానములోని మనుజులు ముందున కొరిగిరి. లంగరు పట్టుబడెను.

రైలుబండ్లలో ప్రయాణము చేయుచుండ రైలుబండి ఆగినపుడును బయలుదేరు నపుడును ముందునకును వెనుకకును పడుట యెల్లరును స్వానుభవమును పొందినవారే. దానినే పదార్థవిజ్ఞానశాస్త్రమున జడత్వమందురు. అట్టి జడత్వముచే వైమానికులు ముందున కొరిగిరి.

"మన విమానము నిలబడినది" అని జో వనెను.

"సరే నిచ్చెనను విడువుము" అని కెనడీ చెప్పుచుండ ఘీంకారము వినవచ్చెను.

"ఏమది?"

"ఎంత వింతగనున్న దీ శబ్దము."

"ఓహో! మనము కదలుచున్నామే!" అని కెనడీ యనెను.

"లేదు. లంగరు లాగబడియేయున్నది" అని జోవు త్రాటిని లాగిచూచెను.

"అట్లైనచో నీపాషాణము చలించుచున్నది" ముప్వురును క్రిందకు చూచిరి.

"అది కొండచిలువవలె నున్నది" అని జోవనెను.

"కొండచిలువా!" అని కెనడీ తుపాకిని గైకొనెను.

"కాదు. అది యేనుగతొండము." అని డాక్టరనెను.

"ఏనుగా అది" అని కెనడీ తుపాకితో గురిచూచెను.

"కొంచెము తాళుము."

"ఈమృగము మనవిమానమును లాగుచున్నది."

శరవేగమున నాకుంజరము గడ్డినుండి వెలువడెను. దాని మహోన్నతాకారము కానవచ్చె. అది కదలుచున్న నడగొండవలె గన్పట్టు మదమాతంగము. దాని దంతములు తెల్లగను 8 అడుగుల పొడవుగను నుండెను. లంగరాదంతములలో తగులుటచే మత్తేభ మాలంగరును విడిపించుకొనుటకై పలువిధముల ప్రయత్నించినను నిష్ప్రయోజన మగుచుండెను.

"ఆహా! మనయదృష్టము నే మని కొనియాడుదును. తురంగమునకు మారుగ మనరథమును భద్రకరియే గొంపోవుచున్నదే! ఎవరికైన నింతటి భాగ్యము లభించునా!"

"మనల నెచ్చటికి గొంపోవుచున్నది?" అని కెనడీ ప్రశ్నించెను.

"మనదారి వెంబడినే?"

తొండము నటునిటు త్రిప్పుచు మదకరి స్వారిచేయుటను మానలేదు. ఫెర్గుసను లంగరుత్రాటిని కోయుటకై కత్తి చేతబూని సిద్ధముగ నుండెను.

"ప్రాణాపాయము వచ్చినగాని లంగరుత్రాటిని పోగొట్టగూడదు" అని డాక్టరనెను.

గంటన్నర కాలము స్వారి చేసినను ద్విరదము శ్రమ జెందలేదు. ఆమదగజము రెండు రోజులైనను విడువక పరుగిడ గలదు.

"పట్టుకొనుటకు కోలలను విడిచినపుడు తిమింగిలము జేయునంతటి యల్లరిని జేయుచున్నదే!" అని జో వనెను.

పచ్చికపర్రిదేశము దాటబడెను. మూడుమైళ్ళ దూరమున వనమొండు కానవచ్చె. అందుచే వాహకుని విమానము నుండి విడదీయుభారము కెనడీపై బడెను. కెనడి విడిచిన మొదటి గుండు కుంభస్థలమున తాకుటచే నేనుగు దానిని లక్ష్యపెట్టలేదు. తుపాకి ధ్వనిచే ద్విరదము వర్ధమానవేగమున జనుచుండెను.

"దాని తల యెంత గట్టిది!" అని జో వనెను.

"కొన్నిగుండ్లను తొడలో నాటవలెను" అని కెనడీ గురిచూచి కాల్చెను.

మృగము రోదనముచేసి వేగమును వృద్ధిచేసెను.

"నాసహాయ మవసరము" అని జోవుకూడ గురిచూచి కాల్చెను.

ఆరెండు గుండ్లును తొడలో నాటుకొనుటచే రక్తము కాలువలై పారుచుండెను. మత్తేభము తొండమును నూర్ధ్వ ముఖమున చలింపజేయుచు పరుగిడుచుండెను.

"కాల్పడమును మానవలదు. వనము యిరువది గొలుసుల దూరమందున్నది" అని డాక్టరు హెచ్చరించెను.

పదిగుండ్లు విడువబడెను. మదగజము ముందున కొరిగినందున విమాన మదరుటచే ఫెర్గుసనుచేతిలోని కత్తి జారి

క్రిందబడెను. వారి వద్దనున్న చాకులతో నాత్రాటిని కోయుట కష్టతరము. త్రాటిముడినైన విప్పుటకు వీలులేదు. ఒక గుండు కంటికితగులుటచే నామదకరి స్వారిని మాని నిలబడెను. దానికాళ్ళు వణకుచుండెను.

"దానిగుండె కొకగుండు వేయుడు" అని ఒక గుండు విడువబడెను.

బాధకోర్వజాలక మదగజము ఘీంకార మొనర్చెను. కొంతకాల మవ్విధమున నిలబడిన పిదప దంతావళము ముందునకు పడుటచే నొకదంతము విరిగెను. ఏనుగు ప్రాణముల వీడెను. విమానమున కపాయము దాటెను.

"దాని దంతము విరిగినదే! ఇంగ్లాండు దేశమున కాదంతమును గొనిపోయినచో 100 పౌనులకు మించిన విలువ చేకూరును" అని కెనడీ నుడువుచుండ జోవు త్రాటివెంబడి దిగెను.

"దంతమునకై విచారింపనేల? మనము దంతపు వర్తకులము గాము. ధనమున కాసించుట మనకర్తవ్యము కాదు" అని డాక్టరనెను.

జోవు లంగరును పరీక్షింప నది దంతముల మధ్యగట్టిగా పట్టుబడెను. కెనడీఫెర్గుసనులు గూడ భూమిపైకి దిగిరి. ఉత్పతన శక్తిని వీడి విమానము నిలబడియుండెను.

"ఇంతపెద్ద యేనుగును హిందూదేశమందుగూడ జూచియుండలేదు" అని కెనడీ పలికెను.

"ఇదియొక వింతకాదు. ఆఫ్రికామధ్యదేశమందు నానావిధ గజయూథముల కన్నుల కరవుదీర గాంచగలము."

"మధ్యఆఫ్రికా దేశమునకు జనుటకుముందు దీనిమాంసమును రుచిచూడవలెను. నేను చక్కగా పచనముచేయుదును. కెనడీ ఒకటి రెండు గంటలకాలము వేటకేగవలయును ఫెర్గుసను విమానమును పరీక్షించుచుండును. నేను వంట చేయుదును" అని జోవు పలికెను.

కెనడీ తుపాకిని గైకొని యరణ్యమున కేగెను. జోవు దంతావళమునకు సమీపమున రెండడుగుల గోతి నొకదానిని త్రవ్వి దానినిండ నెండు చితుకుల నుంచి నిప్పును రగుల్కొనజేసెను. ఏనుగుతొండములోనుండియును, పాదముల నుండియును మెత్తని మాంసఖండములను విడదీసి మంచి యాకులలో జుట్టి కరగిన లోహమును బోసిన పాత్రమువలె కణకణలాడునిప్పులలో జొనిపెను. భోగయోగ్యమగు పరువంపుబాలియము వోలెను, ఆంధ్రకవితాపితామహుని అపూర్వ కవితా పరిపాకము కరణిని, శర్కరాసమన్వితమైన గోక్షీరపానము ప్రకారముగను దీనిమాంస మత్యంతమధురమై దిన దిన జవులూరుచుండును. బాగుగా పచనమైన పిదప నా మాంసఖండములను దీసి ఆపచ్ఛికబయలువందు పరిశుభ్రమగుచోట నిడి జోవు బిస్కట్టులు, బ్రాంది, కాఫీ, చల్లనిపానీయమును గొని వచ్చి తన సహచరులకొరకు నిరీక్షించుచుండెను.

ఫెర్గుసను విమానమును పరీక్షించెను. పట్టుగుడ్డపై గట్టాపెర్చాపూత రవంతయు చెడలేదు. విమానము భూమి కెంత దూరమందున్నదియును చూచి విమానోత్పతనశక్తిని చూచి ఉదజని వ్యయమువడలేదని కనుగొనెను. జాంజిబారును విడచి ఐదురోజులైనది. వారివెంట గొనిపోయిన పెమ్మికను నింతవరకు ఖర్చుపడలేదు. నీటిని నింపుకొనవలెను. మరపొగ్రియ్య మంచి స్థితిలో నుండెను. దానిరబ్బరు సంధులు సుంతయు సడలలేదు. ఆ పని ముగియగనే ఫెర్గుసను దేశపటమును వ్రాసెను. ఆపటములో దృష్టిమేరవరకును వ్యాపించిన పచ్చిక బయళ్ళును, ఏనుగుపై నున్న విమానమును, ఒకవైపున అడవియు కనబడుచుండెను.

రెండుగంటలలో కెనడీ కొన్ని పక్షులను, ఒక జాతి జింకను గొనివచ్చెను. జోవు వాటి మాంసమును వదిలవరచెను.

ముువ్వురును పచ్చికపై సుఖాసీనులైరి. మదగజ మాంసము మిగుల రుచిగ నుండెను. మాతృదేశ నామస్మరణ మొనరించుచు నాహారమును సంతృప్తిగ భుజించిరి. మంచి పొగాకు చుట్టల మహిమను గొనియాడుచు భోజనవ్యాపారమును ముగించిరి. కెనడీ నలుగురిభోజనము నారగించి, పదుగురి వాగ్ధోరణిని చూపించెను. కెనడీ అంతటితో తృప్తిపొందక, రాబిన్సనుక్రూసో వలె నా దేశమునందే స్థిరముగ నుండుటకును పచ్చని చెట్లకొమ్మలతో పటకుటీరమును నిర్మించుటకును తీర్మానము నుపపాదించెను. జోవు 'ఫ్రైడే' వలె నుండుట కంగీకరించెను

గాని తీర్మానము తుదకు వీగిపోయెను. నిర్జనప్రదేశ మగుటచే నారాత్రి భూమిపై పరుండుటకు నిశ్చయించిరి. జోవు వారు నిద్రించు స్థలమునకు నలువైపులను వలయాకారముగ నగ్నిని ప్రజ్వరిల్లజేసెను. ఏనుగుమాంసమును చవిగొన నేతెంచిన నక్కలు, సివంగులు, పులులు మొదలగు వన్యమృగములనుండి కాపాడుకొనుట కదియే మంచిమార్గము. అప్పుడప్పుడు మృగముల రావములచే నిద్రాభంగము కలుగుచుండుటవలన కొన్నిటిని కెనడీ తన తుపాకికి విందుజేయుచుండెను.

---

# పదునేడవ అధ్యాయము

తెల్లవారుఝామున అయిదు గంటలకు తెరువరులు మేల్కాంచిరి. వన్యమృగములు తమతమ నివాసములకు జనుచుండెను. విహంగములు తమగూండ్లనుండి వెలువడి చెట్లకొమ్మలలో కలకలము జేయుచుండెను. చకోరములు దట్టముగ నున్న వృక్షములలో విశ్రమింప జనుచుండెను. సన్నని రంధ్రములుగల చిమ్మనగ్రోవినుండి వెలువడు తుంపరు లెంత సంతసము నొసంగునో అట్లే సూర్యబింబమునుండి వెలువడు కిరణములు భూమిపై ప్రసరించి ప్రాణుల మనములనురంజింప జేయుచుండెను.

ఫెర్గుసను కెనడీలు విమానము నారోహించిరి. జోవు జారిపడినకత్తిని కొనివచ్చి, ఏనుగు దంతముల నూడదీయుట చే దంతములలో చిక్కుకొనినలంగరూడి విమానముపై కెగయు, జోవు నిచ్చెనమీదుగా తొట్టిలోని కేగెను. మారుతము విమానమును గంటకు 18 మైళ్ళ వేగముతో గొనిపోవుచుండెను. నక్షత్రగణితమును బట్టి రాత్రి తా మున్నచోటు అక్షాంశరేఖయందలి 2 వ కళలోని 40 వ వికళయందును, నిరక్షరరేఖకు దిగువను 160 మైళ్ళ దూరమందునను నెలకొనియుండెను. 'రుబెంహి' పర్వతములు దాటబడెను. కరగ్వా పర్వత శిఖరములు దాటబడుచుండెను. పూర్వగాథల ననుసరించి నైలునదీ జన్మస్థాన మన బరగు 'ఉకెరూ' సరస్సు కరగ్వా పర్వతకనుమలమధ్య గలదు. వర్తకుల కాటపట్టగు కపురు దేశమును విమానము దాటుచుండ స్పెకీపరిశోధకుడు 1858 ఆగస్టు 3 వ తేదీని దర్శించిన యాఉకెరూ సరస్సు మనపథికుల దృష్టిపథంబునం బడెను.

ఆఫ్రికా దేశమందు చూడవలెనని తలంచిన ప్రదేశములలో నిది యొకటగుటచే ఫెర్గుసనునకు సంతసముదయించెను. దూరదర్శినిని చేకొని చుట్టుప్రదేశమును చూచుటవలన కనుమలకు దిగువనున్న భూమి నిస్సారముగ నున్నటుల కనబడెను. పోనుపోను వరిపైరుకు బదులు మొట్టసస్యములు గానవచ్చె. 'కరగ్వా, యనుపట్టణము కానవచ్చె. పూవుదీ

వెలచే నల్లిబిల్లిగ నల్లుకొనబడిన పైకప్పు గలిగిన పొదరిండ్లసొంపులు నింపు మనికిపట్టు లచట రమారమి ముప్పది నలువది గలవు. అట పసిండిచాయలమిసిమి నిరసించు మేని విలాసముగల విలాసవతు లెందరో పూవుదోటల పని మాని విమానము దెస వింతచూపుల దొంతరల వెదజల్ల జొచ్చిరి. ఆ మదగజరాజగామినుల శరీరసౌష్టవాభ్యుదయము లపూర్వశోభాదాయకములై విమానచారుల వీక్షణముల నరిగట్టెను. ఘనగిరి ధరణీభరములు జంగమాకృతి నిచ్ఛగించి యచట నారీమణుల కచ కుచ కటి తట భారముల రూపుదాల్చి వనవిహార మొనరింప జనుదెంచెనో యన చూపరుల దలంపజేయుచుండెను. అచట లభించు నొక విధమైన యాహారపానములవలన వీరి కీవింతవికాసము మేలిమిసొబగు జనించె నని ప్రకృతిశాస్త్రపారీణుడు సమన్వయ మొనరించి సహచరులకు బోధించెను. పిదప మధ్యాహ్నము రెండు ఝాములకు విజయలక్ష్మి దక్షిణాక్షాంశరేఖయందలి 1వ కళలోని 45 వికళయందుండెను. ఒంటిగంటకు విమానము నొక సరస్సుమీదుగా వాయువు కొనిపోవుచుండెను. స్పెకీయాసరస్సునకు విక్టోరియా నయాంజా” యని నామకరణ మొనరించెను. ఆసరస్సు రమారమి తొంబదిమైళ్ళ వెడల్పుగలది. సరస్సునకు దక్షిణభాగమున లంకలసమూహమొందు గలదు. దానికి స్పెకీ 'బెంగాలు ఆర్చిపెలగో' యని నామకరణ మొనరించెను. ముస్ల్యాము సుల్తానుల పరిపాలనలో

నున్న ఉకురూద్వీపమునుజూడ స్పైకీ యత్నించినను వానికి పడవ దొరకలేదు. విమానము ఉత్తరదిశగా జనుచుండెను. సరస్సు తీరమునగల దేశమును చూచుటకై ఫెర్గుసను యత్నించి నను వాయు సంచలనము వ్యతిరిక్తమగుటచే విమానము తీర మును సమీపింపజాలకుండెను. కొల్లేటి దోమలను మించు దోమలచే ముండ్లపొదలు కాన్పించుటలేదు. నీటిగుర్రములు, నీటియేనుగులు మందలుమందలుగ రెల్లుగడ్డిలో తిరుగుచుం డెను. పశ్చిమదిశగా సరస్సు మహాసముద్రమువలె కాన్పించెను. ఆప్రదేశమున తుపానులతీవ్రత హెచ్చు. శ్రమపడి ఉత్తరదిక్కు గా జను వాయుతరంగములోనికి ఫెర్గుసను విమానమును జేర్చెను. సాయంకాలం మూడుగంటలకు విమానము తీరమునకు 20 మైళ్ళ దూరమందున్న ద్వీపములోని వృక్షమునకు లంగరు వేయబడెను. ఆద్వీపము ధృవరేఖలోని 32వ కళయందలి 52వ వికళయందును అక్షాంశ రేఖలోని 30 వ వికళలోను నెలకొని యుండెను. సాయంకాలమగుమంద మారుతము తన సంచార మును చాలించుటచే విమానము కదలక నిలబడెను. లంగరును బంధింపనేగిన జోవు శరీరమునిండ దోమకాటు లగుటచే వై మానికులు భూమిపైకి దిగకుండుటయేకాక దోమలబాధనుండి తప్పించుకొనుటకై లంగరు త్రాటినంతయు వదలిరి. స్పైకీ నుడివి నటుల నాసరస్సు సముద్రపుమట్టమునకు 3,750 అడుగుల యెతున నుండెను.

"మన మొక ద్వీపమందున్నాము" అని జోవు ఒడలం తియు తన రెండు హస్తములతో తాడనము చేయుచునుడివెను.

"మనము క్రిందకు దిగిన రెండు లాభములు గలవు. ద్వీపమునుచూచుట, ఆకలిగొనియున్న దోమల కాహారమిడుట వలన గలుగు పుణ్యము-" అని కెనడీ పరిహాసించెను.

"ఈ లంకలు నీటమునిగియున్న పర్వతములశిఖరములు. మన పుణ్యముచే మన కొకటి లభించినది. తీరమున అడవిజాతి ఆఫ్రికను లున్నను మీరు హాయిగ నిదురింపవచ్చును" అని డాక్టరనెను.

"మీరుకూడ నిదురింపకూడదా?"

"కూడదు. నానయనములు మూతబడవు. ఆలోచనా నిమగ్నమైయున్న నామెదడు నిద్రను రానీయదు. రేపు ఉదయముననే బయలుదేరి నైలునదీజన్మస్థానమును చూడవలెను. దగ్గరకు వచ్చినపిదప గమ్యస్థానమును చూడనిదే నిదుర రాదు" అని డాక్టరు మేలుకొనియుండ కెనడీ జోవులు నిదురించిరి.

ఏప్రిల్ 23 వ తేదీ బుధవారము ప్రాతఃకాలమున నాలుగుగంటలకు విమానము బయలుదేరి యటు నిటు తిరిగి తిరిగి తుదకు మంచిగాలి దొరకుటచే ఉత్తరదిశగా జనుచుండెను. సరస్సుపై దిట్టముగ కప్పబడిన మంచు తెల్లవారుఝామున వీచిన గాలిచె కొనిపోబడెను.

"మనము సరియగుదారిని జనుచున్నాము. నైలునదిని నేడే చూడగలము. మనము నిరక్షరరేఖను దాటుచున్నాము" అని ఫెర్గుసను నుడివెను.

"మనము దాటునది నిరక్షరరేఖయా?"

"అవును."

"అట్లయినచో మనము దాహమును తీర్చుకొందము."

"నీరము కలసిన సారాయితోనా?"

నిరక్షరరేఖను దాటుచున్నారను సంతసముచే నీరమును గలిపిన సారాయిని గ్రోలిరి. విమానము వేగముగ జనుచుండెను. పశ్చిమతీరము సమభూమిగ నుండెను. ఆతీరమును దాటినపిదప ఉగండా, ఉశోగా పీటభూములు కానవచ్చె. వాయువు గంటకు ముప్పదిమైళ్ళవేగమున వీచుచుండెను. నయాంజాసరస్సున తరంగములు వృద్ధి నొందుచుండెను. సరస్సు మిగుల లోతుగలది. అచ్చటచ్చట నొకటి రెండు తెప్పలు గలవు.

"ఈ సరస్సు పెక్కునదులకు జన్మస్థానము. నదులచే కొని పోబడు నీరు తిరిగి వానగా నీసరస్సున బడును. నైలు నదికి నిదియే జన్మస్థానముగ నుండవచ్చును" అని డాక్టరు పలికెను.

"సముఖమునకు జనుచుండ రాయబార మేల" అని కెనడీ యనెను.

తొమ్మిది గంటలకు పశ్చిమతీరమును జేరిరి. తీరము తరుగుల్మాదులతో నిండియుండెను. ఆవరస్సునకు తూర్పువైపున కొన్ని పర్వతములు గలవు. డాక్టరు విమానమును నిష్టానుసారము నడిపించుచు దేశమునంతను పరిశోధించు చుండెను.

“ అదిగో! ఆవైపుననుండి ఉత్తరదిశగా నొకనది పారుచుండునని చెప్పుదురు. మనము ఆనదివెంబడినే చనుచున్నాము గనుక వారు చెప్పునది నిజము. దాని జలవేగము మన విమానవేగముతో సమముగ నున్నది. దానిలోని ప్రతి నీటిబిందువును మధ్యధరాసముద్రములో పడుచుండును. ఇదియే నైలునది.”

“ నైలునది యిదియే? ” అని కెనడీ సంతసమును చూపించెను.

ఈ జలపాతమును గొప్ప శిల లడ్డుచుండుటచే నీరు నురుగుగట్టుచుండెను. నది పొడవునను జలపతనములు గలవు. చుట్టు ప్రదేశములనుండి వెడలు సెలయేళ్ళన్నియును జేరి చిన్న ప్రవాహముగ నేర్పడినవి.

“ నైలునదియని నిర్ధారణచేయుట కెంతమాత్రమును సందియములేదు ” అని డాక్టరు నుడివెను.

“ ఉత్తరదిశనుండి వచ్చిన పరిశోధకులు చూచిన నైలునది యిదియే యని యెట్లు చెప్పగలము?”

"ఇంకొక గంటకాలము గాలి యీవిధముగ వీచినచో నైలునది యిదియేయని నిర్ధారణ చేయగలము."

పర్వతములు గడచినవి. అచ్చటచ్చట గ్రామములును సాగుచేయబడు చుండిన భూములలోని వరి చెరకు మొదలగుసస్యములునుకానబడెను. ఆ దేశీయులు విమానమును నాశ్చర్యముతో దిలకించుచు పిక్కబలమును జూపసాగిరి. వైమానికులు దేవతలవలె పూజింపబడక విదేశపు దొంగలుగ భావింపబడి తుపాకులతో నాహ్వానింపబడిరి.

"ఇచ్చట మనము దిగజాలము" అని కెనడీ నుడివెను.

"అట్లయినచో వారు దురదృష్టవంతులు. మనతో మాట్లాడునంతటి భాగ్యము వారి కెట్లు లభించును?" అని జోవు పలికెను.

"మనము దిగుటముఖ్యము. పావుగంట కాలము పని గలదు. ఈ దేశ మేదియో తెలిసికొనవలెను" అని డాక్టరనెను.

"దిగుట ముఖ్యమా?"

"తుపాకులతో కాపాడుకొనుచు నైన దిగవలెను."

"తుపాకుల నుపయోగింప మీరనుజ్ఞ నొసగుట నాకు సంతోషమే!" అని కెనడీ పలికెను.

"నేనకూడ దిగుటకు సిద్ధముగ నున్నాను" అని జోవనెను.

"ప్రకృతిశాస్త్ర పరిశోధకులకు తుపాకులరక్షణయుండుటిది మొదటిసారికాదు."

"ఆయుధపాణు లిరువురు కావుండ నాకు భయమేమి?"

"దిగుటకు సిద్ధముగ నున్నారా?"

"కొంచెమాగుము. ఎచ్చట దిగవలెనో చూచుటకు గాను ముందు పై కేగవలయును."

ఉదజని ఉష్ణీకరింపబడ పదినిమిషములలో విమానము 2 500 అడుగుల ఉన్నతమున కేగెను.

'గొండొకోరో' నుండి మనము 90 మైళ్ళకు తక్కువలో నున్నాము. ఉత్తరదిక్కునుండి వచ్చిన యాత్రికులు చేరగలిగిన దేశము అయిదుమైళ్ళ దూరములో నున్నది. మనము జాగరూకులమై భూమిని సమీపించవలెను." అని డాక్టరు నుడివెను.

విమానము 500 అడుగులు క్రిందకు దిగెను.

"ఇప్పుడు మీరు జాగరూకులై యుండుడు."

"సరే."

విమానము నైలునదీ ప్రవాహమునకు నూరడుగుల యెత్తున జనుచుండెను. ప్రవాహ మచ్చోట నేబది గొలుసుల కన్న నెక్కువ వెడల్పుగలేదు. నైలునదీ ప్రవాహమున నున్న గ్రామాదులలోని జనులు విమానమును జూచి భయవిహ్వలులైరి. రెండవ శిఖయందు గల నైలునదీపతనము నాలుగడుగుల యెత్తుగల దగుటచే నచ్చట నదిని దాటుట కష్టము.

"తెలోనోచే కనుగొనబడిన పతనమిదియే" అని డాక్టరనెను.

అచ్చోటు దాసిన పిదప నైలునది విశాలముగ నుండి దానిమధ్య కొన్ని లంకలను కలిగియుండెను. వానిని ఫెర్గుసను పరిశీలించెను. కొందరు నీగ్రోలు తెప్పలలో విమానమును వెంబడించుచు కెనడీతుపాకి దెబ్బలను తప్పించుకొనుచుండిరి.

"ఈ ప్రయాణము మనోహరముగ నున్నది. నాకు యీదేశమును వీడి రావలెనని లేదు. తుపానలు రాకున్నచో చాలును." అని జో వనెను.

ఫెర్గుసను దూరదర్శనిచే నదీగర్భమున నున్న ద్వీపములలో నొక ద్వీపమును జూచెను.

"ఆనాలుగు వృక్షములను చూడుడు. అది బెంబా ద్వీపమగుటకు సందియములేదు." అని డాక్టరు వృక్షములను నిరూపించెను.

"అందులోని విశేషములేమి?" అని కెనడీ యడిగెను.

"మనము దిగవలసిన ద్వీపమే యిది."

"ఆద్వీపమున జనులున్నటుల పొడగట్టుచున్నది."

"జో వు చెప్పినది నిజము. అందులో 20 మంది నీగ్రోలు గలరు."

"వారిని బెదరించి తరుమవలెను," అని ఫెర్గుసను నుడివెను.

మధ్యాహ్నము రెండుఝామము లగుటచే సూర్యుడు ఉచ్ఛస్థితియందు ప్రకాశించు చుండెను. విమాన మాద్వీపమును సమీపింప మెకడోయను తెగకు జెందిన యానీగ్రోలు కేకలు వైచిరి. అందులో నొకని చేతియందుగల టోపీని గురి చూచి కాల్చుటచే నీగ్రోలందరును నీటిలో దుమికి తీరమును జేరుకొనిరి. తీరమందున్న నీగ్రోలు విమానమును శరపరంపరలచే నొప్పింప యత్నించినను నొప్పింపజాలకుండిరి. లంగరొకశిలలో పట్టుబడెను. జోవు త్రాటివెంబడి దిగి త్రాటిని బంధించెను.

"నిచ్చెనను విడువుము. కెనడీ! నీవు నావెంబడిరావలెను" అనిడాక్టరనెను.

"ఎందుకు?"

"నాకు ఒకడు సాక్షిగా నుండవలెను."

"సరే."

"జోవు! జాగరూకుడవై యుండుము."

"చిత్తము."

"కెనడీ! దిగుము."

వారు ద్వీపమునకు చివరభాగమున నున్న రాళ్ళగుట్టపైకి కేగిరి.

"ఇచ్చట చూడుము." అని డాక్టరనెను.

"అక్షరము లున్నవే!"

దిగువ వ్రాసిన రెండక్షరములును ఆశిలపై కొన బడెను. "A. D."

"ఏ. డి. అనగా ఏండియా డిబోనో. నైలునది జన్మస్థానమును చూడనేగినవారిలో కృతార్థుడైన వానిపేరు. ఈస్థానమును దాటి పైకేగినవారు లేరు." అని డాక్టరనెను.

"అందుకు, సందేహమా!"

"నీవు చూచితివిగదా?"

"ఆ ఇది నైలునదియే ఈవిషయమై నాడెందమున నెట్టి సందియమును లేదు."

అపూర్వరత్నముల బోలు నాయక్షరద్వితయము నొకింతతడవా పరిశోధకుడానందబాష్పపూరిత విలోకనముల వీక్షించెను. అనంతర మావర్ణముల యథాస్థిత స్వరూప ప్రతిబింబమును సంగ్రహించి ప్రకృతిశాస్త్రజ్ఞుడు ప్రేమజలులకు చూపుల వీడుకో లొసంగెను.

"ఇప్పుడు విమాన మెక్కుదము."

"త్వరపడుడు. కొందరు నీగ్రోలు నదినిదాట ప్రయత్నించుచున్నారు."

"ఇక నేమిభయము కొన్నిగంటలీమారుతము మనల నుత్తరదిశగా గొనిపోయిన యెడల గొండొకోరోను జేరగలము."

పదినిమిషములలో విమానము బయలుదేరెను. తాము బూనిన కార్యములలో నొకటి కొనసాగిన దని తెలుపు చిహ్నముగ ఇంగ్లాండు బావుటాను వైమానికు లెత్తిరి.

# పదునెనిమిదవ అధ్యాయము

"మ॥ ఘనశైలంబులు బొమ్మరాళ్ళపగిదిం గన్పట్టె, జూపట్టె గొ
ప్పనదుల్ వ్రేకవుత్రాచుబాములక్రియన్, భాసిల్లె నానామహా
వనముల్ త్ర్యానతి మేసదోచిన గరుత్పాటుల్వలెన్, మింటను బ
త్తనముల్ చక్కనిబొమ్మరిండ్లగతి నేత్రద్వంద్వ సంతుష్టిగన్."

—గయోపాఖ్యానము.

"మనము ఏదిశగా జనుచున్నాము?" అని కెనడీ కంపా
సును చూచుచు ఫెర్గుసనును బ్రశ్నించెను.

"ఉత్తర వాయువ్యమూలగా."

"ఉత్తరముగ జనవలయును గాదా!"

"అవును. కొంచెము శ్రమపడినగాని విమాన ముత్తర
దిశగా జనుటలేదు. ఇంతవరకు తూర్పుపరిశోధకులు చూచిన
దేశమునకును ఉత్తరపరిశోధకులు చూచిన దేశమునకును
మధ్య నున్నదేశమును జూచితిమి."

ప్రయాణీకుల దృష్టినుండి నైలునది దాటుచుండెను.

"ఇంతవరకే పరిశోధకుడును చూడని దేశమును జూచి
తిమి. ఫెడరిక్, డిఆర్నార్డు మాయాని మొదలగు వేత్తలు నుడి
విన అడవిజాతివారిని జూచితిమి."

"మనపరిశోధనలు శాస్త్రసమ్మతమైనవి" అని
కెనడీ పలికెను.

"నైలు జన్మస్థానము మహాసముద్రముంబోలు విక్టోరి
యా నయాంజా సరస్సున గలదు. నదీవతంస మనబరగు నైలు

నదిజన్మస్థానము దేవలోకమున చంద్రగిరి పరిసరముల నున్న దనియు, నది నిజముగ ప్రభాకరు పాదపద్మముల నుదయించె ననియు కవులు నుడివెదరు. కాని మనము ప్రకృతిశాస్త్రజ్ఞులు వచించు పలుకులే ప్రమాణముగ నొదల దాల్పవలయు. ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానులు పరిమితముగానున్నను ప్రకృతివైచిత్ర్యవర్ణనానిపుణులైన మహాకవులు మాత్రము నపారముగ విలసిల్లిరి."

"ఇచ్చట జలపాతములు విశేషముగ గలవు" అని జో వనెను.

"వానిని మెకన్నో జలపాతము లందురు. మనల నింకొకగంటకాలము వాయువు నైలునది వెంబడిని కొనిపోయిన మంచిది."

"పర్వతశిఖర మొండు కానవచ్చె" అని కెనడీ నుడివెను.

"దానినే లాగ్వెఉ శిఖరమందురు. ఈ దేశమంతయును డెబోనోచే చూడబడెను. నైలునదీ తీరమందు నివసించువారు సదా పోరాటములతో నుండుటచే నచ్చట డెబోనో పడిన కష్టముల వర్ణింప నెవరితరము!" అని డాక్టరనెను.

విమానము వాయువ్యమూలగా జనుచుండుటచే లాగ్వెఉ శిఖరమును తప్పించుటకై వేరొండు వాయుతరంగము కొరకు వైమానికులు యత్నించిరి.

" ఇంతవరకే పరిశోధకుడును జౌరజాలని ప్రదేశమున ప్రవేశించుచున్నాము. "

లోయలు, మహారణ్యములు, గ్రామాదులు గడచు చుండెను. లాగ్వాకు శిఖరమునకు కొంచె మెత్తుగా విమానము జనుచుండెను. ఆరోజున ఏప్రిల్ 23 న తేదీని విమానము 15 గంటల కాలములో 315 మైళ్ళదూర మేగెను. వాయువు తీవ్రముగ వీచుచుండ తొట్టిలోని ప్రయాణీకులు మౌనముద్ర ధారులై యుండిరి. ఫెర్గుసను పరిశోధనలలో మునిగియుండెనా; లేక క్రొత్తదేశమున నేమి సంభవించునో యని యోచించు చుండెనా; లేక తమ బంధువులు మిత్రులు జ్ఞప్తికి వచ్చిరా? జోవు మౌనమును వహించినను ముఖవర్చస్సు మాటలాడ కుతూహలమును వెల్లడించుచుండెను. లంగరులు విడువబడ నవి లాగ్వాకు చంచల ధరణీధర వృక్షశాఖలలో పట్టువడెను. మహమ్మదీయు లెవ్వరైన ఆపర్వతముపై కాలిడినచో పర్వతము చలించునను పురాణగాధ యొండు కలదట. వైమానికులు కడు పార భుజించి వంతులవ్రకారము మేల్కొనిరి. ఆరాత్రి నిశ్శబ్దముగ గడచెను.

తూర్పుదిశ తెలతెలవారుచుండ ముప్పురు వైమానికు లును ముఖప్రక్షాళనాది కాలకృత్యంబుల దీర్చుకొని ఫలాహార ముల నారగించిరి.

" మనము ఉగోగా దేశమును దాటుచున్నాము. భూగోళశాస్త్రజ్ఞులు ఆఫ్రికాఖండము మధ్య నొక గొప్ప

సరస్సుగలదని నుడువుచున్నారు. దీనిని నిర్ధారణజేయువలెను.''

"ఉన్నదని యెవరు చెప్పుచున్నారు?" అని కెనడీ ప్రశ్నించెను.

"అరబ్బీ పండితులు, మధ్యఆఫ్రికా దేశమునుండి వచ్చిన బానిసలుకూడ నట్లే చెప్పుచున్నారు."

"ఈ ప్రదేశము మానవవాసస్థానమా?" అని జో వడిగెను.

"అవును. న్యాంన్యాం యను జాతివారు నివసించుచున్నారు."

"ఆలాగునా? న్యాం న్యాం!" అని జోవు పరిహసించెను.

"ఈ జాతి నరమాంసభక్షకజాతి. వారికి జంతువులకువలె తోక లుండు నని చెప్పుదురు కాని యాతోకలు వారు ధరించు జంతువుల చర్మములవై యుండవచ్చును."

"ఇచ్చటి దోమలను తోలుకొనుటకు తోకలుండుటయే మంచిది."

"అట్లయినచో బ్రిసురోలెట్టను వాడు కొందరికి కుక్కతల యున్నదని కల్పితకథ చెప్పినట్లుండును."

"కుక్కతలయైనచో బాగుగా మొరగవచ్చును. అది నరమాంస భక్షకులకు నుపకారియైన జంతువు."

"వారు నరమాంసముకొరకు వెదకుచుందురు."

"నా మాంసమును రుచిచూడరుగదా! నా యజమానున కుపకరించినచో నొసగెదను గాని తదితరులకు దొరకనీయను" అని జో వచెను.

"అంతటిపని కలిగినపుడుగదా!" అని కెనడీ పలికెను.

"జోవు యెందుకల్లు వాగుచుండునో తెలియునా? వానికి చక్కగా నాహార మొసగుదు మని" అని డాక్టరు పరిహాసించెను.

"మీరు నుడివినది సత్యమే! ఆహార విహారముల మానవు లాత్మలాభపరాయణులై తరచుగా ద్విపాదజంతువులవలె సంచరింతురు" అని జోవు మారుపలికెను.

రెండు ఝాములకు భూమినుండి వెచ్చనిగాడ్పు జనింప భూమిపైనుండు జంతువులేమియును గాన్పించుటలేదు. ప్రయాణమును మాని విమానము సాయంకాల మైదుగంటలకు లంగరు వేయబడి ఆరాత్రి యచ్చటనే యుండెను. మరునా డుదయమున వెచ్చనివాయువు మెల్లగ వీచుచుండుటచే విమానము నాట్యమాడుచుండెను.

"వాయువల్లయము బంధింపబడియుండుటచే ఉదజని వ్యయపడలేదు."

"ఉదజనికి నిప్పు తగిలినను మనము వెంటనే పడము. ఫ్రెంచిదేశపు విమానశాస్త్ర విదుషి యగు మేడం బ్లాంచర్డు అను నామె కట్టివప్రమాదము వాటిల్లినది. ఆమె విడుచుచుండిన

బాణసంచావలననే యామెవిమానము తగులబడుచుండ నామె నెమ్మదిగ క్రిందకు దిగుచు బియ్యపుమరపొగగొట్టము తగిలి క్రిందపడి చనిపోయెను."

"మన కట్టి యిక్కట్టు చేకూరదుగద? ఇంతవరకు నిరపాయముగ నుంటిమి. అట్టి అపాయములపాలు గాకూడ దని మనము దేవుని ప్రార్థింతెము."

"మన కేమాత్రమును భయములేదు. అటువంటి అపాయములు విమానశాస్త్రజ్ఞుల యజాగ్రతవలనను పనిముట్లు బాగుగనుండకపోవుటచేతను సమకూరును. వేలకొలది జరిగిన విమానయానములలో నిరువదిమాత్రమే చెడినవి. విమానములోగల అపాయము దిగునపుడును పైకేగునపుడును కలుగును. కావున నా సందర్భముల మన మత్యంతజాగరూకులమై చరింపవలయును."

---

# పందొమ్మిదవ అధ్యాయము

పవనుడు కోపోద్రేకమున విమానమును రయమున గొనిపోవుచు పడమార్గమున బెట్టుచుండెను.

"విమానవేగము హెచ్చుగ నున్నది" అని కెనడీ పలికెను.

"విమానము గంటకు తొంబదిమైళ్ళవేగమున జనుచుండెను. దేశ మెంత త్వరితముగ నదృశ్య మగుచున్నది.

వైపునకు చూడుము. ఆ మహారణ్యమెంత వేగమున మన వైపునకు పరుగిడి వచ్చుచున్నదో! " అని ఫెర్గుసను అరణ్యము నొండు చూపించెను.

" ఆ యడవిమధ్య నొకబయలు కలదు " అని కెనడీ నుడివెను.

" ఆబయలునందున్న గ్రామము దాటి పోవుచున్నది. ఆ నీగ్రోలెంతవింతగ వీక్షించుచున్నారు! '' అని జో వచెను.

" అది స్వాభావికమే. ఫ్రెంచి దేశపు సేద్యగాండ్రు మొదట విమానమును పెనుభూత మని తలంచిరి. తుపాకుల తో గాల్చిరి. అట్టుండ నీ సూడానులోని నీగ్రోలకు వింతగ దోచు టాశ్చర్యము గాదు " అని డాక్టరనెను.

విమాన మాగ్రామము మీదుగా జనుచుండ జోవు ఖాళీసీసాను నీగ్రోలపై జారవిడుచుటకు డాక్టరనుజ్ఞను బడసెను.

" ఆసీసా భూమిపై బ్రద్దలుకాకుండ జేరినచో నది దేవునివలె పూజింపబడును. వ్రక్కలైనచో వ్రతిముక్కయు నొకరక్షరే కగును."

అని పలుకుచు జోవు సీసాను జారవిడచెను. అది భూమి పైబడి వ్రక్కలయ్యెను. నీగ్రోలందరును తమతమ గుడిసెల లోనికి పరుగిడిరి.

" ఆతరువునుచూడుడు. పై నొక చెట్టుగాను క్రిందభాగ

మొకవిధమగు చెట్టుగాను కాన్పించుచున్నది ” అని కెనడీ కేక వైచెను.

“ వింతయగు దేశమిది. చెట్లు ఒకదానిపై నొకటి మొలచును.”

“ అందులో వింతలేదు. ఆ తిమ్మాన్ను పై కొంచెము ఆకుమెరువు పడెను. వాయువుచే వేరొక విత్తనము కొనిరాబడి అచ్చట పడినందున వర్షజలముచే తడిసి మొలకెత్తెను. ఆమొలక కొంతకాలమునకు పెద్దదైనది ” అని డాక్టరు జవాబు చెప్పెను.

“ ఇది చాలవింతగా నున్నది. దీని నింగ్లాండునకు గొనిపోయి లండనుపార్కులోనుంచిన మంచిది ” అని జో వనెను.

ఆసమయమున 300 అడుగుల యెత్తునకు పెరిగిన వటవృక్షసమీపాయమును విమానము దాటెను.

“ ఈవృక్షములుచూచుట కెంత వింతగ నున్నవి ! ” అని కెనడీ పలికెను.

“ ఈవృక్షములయౌన్నత్యము విశేషతరము గాదు. ఈ నూతన ప్రదేశమందలి అడవులు యింతకన్న యెత్తుగలవి.”

“ ఇంతకన్న పెద్దఅడవులు గలవా? ”

“ కలవు. మామతు వృక్షములు యింతకన్న పెద్దవి. కేలిఫోర్నియాలోని సీడరువృక్షము 450 అడుగుల పొడవుననుండెను. దానియౌన్నత్యము పార్లమెంటు గోపురమును

యీజిప్టులోని పిరమిడు యెత్తును మించినది. దానిమొదలు 20 అడుగులు చుట్టుకొలత గలిగి 4,000 యేండ్ల వయస్సును గలదిగ కాన్పించును."

వా రట్లు మాట్లాడుచుండ వారి కొక కుగ్రామము కానబడెను. ఆపల్లెమధ్య నొక చెట్టు గలదు.

"అటువంటి చెట్టు ఆపుష్పములతో నాలుగువేలేండ్లు వర్ధిల్లినను మంచిది" అని జోవు పల్లెమధ్యనున్న చెట్టును నిరూపించి పలికెను.

అది గొప్ప తుమ్మచెట్టు. దాని మొదట మానవఅస్థికలు పేర్చబడియుండెను. నూతనముగ ఛేదింపబడిన మానవశిరములు కత్తులకు గుచ్చబడి మార్గములో నాటబడెను. ఆశిరములను దూరమునుండిచూచి జోవు పుష్పములుగ భావించెను. ఆగ్రామము దాటబడెను. సగము తినబడిన మొండెములును, మట్టిలో నైక్యమగుచున్న ఆస్థిపంజరములును, మానవ అవయవములును అచ్చటచ్చట వెదజల్లబడినటుల కాన్పించెను. గుంటనక్కలు మొదలగు వన్యమృగములు వానిని భక్షించుచుండెను.

"అవి యపరాధుల మొండెములు. ఖైదీలను గొనిపోయి వన్యమృగముల కిచుట చే నవి వానిని తత్క్షణమే యమలోకమున కనిపి సావకాశముగ మొండెముల నారగించుచున్నవి" అని డాక్టరు నుడివెను.

" ఇది ఉరిస్థంభముల కన్న వసహ్యాకరము గాదు. "

" దక్షిణాఫ్రికాలో ఎవని గుడిసెలలో వానినుంచి నిప్పంటించి కుటుంబములనుగూడ నాశము చేయుదురు. కాని ఉరిస్థంభము కూడ నిట్టిదియే " అని డాక్టరనెను.

జోవు దిఙ్మండలము మీదుగా నేతెంచు విహంగ సమూహము నొకదానిని పొడగాంచి,

" అవి రాంబందులు. మన విమానముతో సరిగా వచ్చుచున్నవి " అని కెనడీ దూరదర్శనితో చూచి పలికెను.

"వానిని దగ్గరకు రానీయగూడదు. అడవిమృగముల కన్నను, అడవిజంతువులకన్నను విమానమునకు శత్రువులు" అని డాక్టరనెను.

" తుపాకులతో వేటాడుదము " అని కెనడీ ధైర్యము నొసగెను.

" నీ నేర్పరితనము మీ విహంగములముందు పనికిరాదు. ఒకపక్షి తన ముక్కుతో విమానమును పొడిచినయెడల మన కపాయము వాటిల్లును. కాని మనవిమానమును జూచి పక్షులే భయపడి పెడదారిని జనుచున్నవి. "

" కొన్నిపక్షులను మనవిమానమునకు గట్టినచో హిందువుల దేవుడగు విష్ణువనియే పూజింపబడుదుము" అని జోవు పలికెను.

" పక్షులచే విమానమును లాగింప యత్నించితిని గాని వాని స్వభావమును నమ్మజాలము. "

" వానిని మచ్చికజేసి విమానమును లాగుట నేర్ప వలెను. గుర్రములకు కండ్లకు గంతలు కట్టినటుల, పక్షులకు గంతలు కట్టి విమానములాగుట నేర్పవచ్చును " అని జోవు పలికెను.

" జోవు! నీ వాహకుల క్షేమిగాని నాకు మంచి వాయు తరంగ మొండు కావలెను. ఈవాయువాహకము నీళ్ళను మేతను, కోరకయే మనలను చాలదూరము చాల వేగముగ గొనిపోగలదు. "

మధ్యాహ్నమైనది. విమానము నెమ్మదిగ జనుచుం డెను. ఆకస్మికముగ భూమిపై కేకలు విననయ్యె. తెరువరులు క్రిందికి చూడ రెండుతెగలవారు యుద్ధమొనర్చుచుండిరి. అంబరవీధిని బాణము లెగురుచుండెను. యుద్ధోద్రేకముచే దొలుత విమానమును వారిదృష్టి యాకర్షింపలేదు. వారి దేహ ములు రక్తసిక్తములై యుండెను. విమానమును జూడగనే యుద్ధ మునాపిరి. కేకలు వేయుచు విమానముపైకి శరములను వదలిరి. అందులో నొకటి తొట్టిని సమీపించుటచే జోవు దానిని పట్టు కొనెను.

" వారి అమ్ములబారినుండి తప్పించుకొనుటయే మం చిది. అజాగ్రత్త కూడదు " అని డాక్టరనెను.

యుద్ధము తిరిగి ప్రారంభమయ్యెను. దెబ్బతినినవాని శిరము వెంటనే ఛేదింపబడుచుండెను. వారిస్త్రీలు యుద్ధభూమి

యందు జొరబడి ఛేదింపబడిన శిరముల నన్నిటిని యుద్ధభూమికి సమీపమున ప్రోగుచేయుచుండిరి.

“ఎంత అవమానముగ నున్నది! వారికి యుద్ధవు దుస్తులున్నచో వారినిమించిన యుద్ధవీరు లుండు టరుదు” అని కెనడీ పలికెను.

“నా వేటకౌశలమును జూపించెదను” అని కెనడీ తుపాకిని గైకొనెను.

“వలదు. ఏ తెగ న్యాయమార్గమున నున్నదియును మనకు తెలియనప్పుడు మనము తొందర పడగూడదు. ఈ యుద్ధభూమినుండి మనముదాటుటయే మంచిది. యుద్ధములజేసి దేశముల జయింపదలంచువారలు భీభత్సరసమును వెలిగ్రక్కు నీ భయంకర రణరంగసీమ తాండవ మొనరించు వీరపురుష విహార మొకపరి వీక్షించినచో సంగ్రామాభిలాషను తమంత దామే త్యజింతురు” అని డాక్టరనెను.

ఆజానుబాహువులుగలిగి మిగుల బలశాలిగ కాన్పించు చున్న యొక తెగనాయకు డొకచేత బల్లెమును గైకొని రెండవచేతితో గండ్రగొడ్డలిని దాల్చి శత్రువుల నురుమాడు చుండెను. కొంతకాల మట్లు పోరాడి బల్లెమును పారవైచి గాయములచే బాధపడు సైనికులపై కూర్చొని శత్రువీరునిహస్త మొకదానిని ఖండించి యా నరమాంసమును గసిదీర మెసవ జొచ్చెను.

"ఛీ! రాక్షసి! నేను చూడజాలను" అని కెనడీ తన తుపాకితో వానిని యమపురి కనిపెను.

వెంటనే యుద్ధ మాగెను. యుద్ధవీరు లందరును భయభ్రాంతులై సంగరభూమినుండి పలాయితులైరి. క్షణకాలములో యుద్ధభూమి నిర్మానుష్య మయ్యెను.

"ఈ భూమిని వీక్షింప నాశరీరము పులకరించుచున్నది. విమానమును గొనిపోవుటకు వాయుతరంగ మొందు దొరకిన మంచిది" అని డాక్టరనెను.

నరమాంస భక్షకు లగుటచే వారిలో విజయులు గాయములు తగిలి పడిన శత్రువులను భక్షించుటను వైమానికులు జూడకుండ యుద్ధభూమినుండి దాటజాలరైరి. వ్యాకోచముచే విమానము పైకేగుటచే దక్షిణదిశగా వీచు వాయుతరంగ మొందు విమానమును యుద్ధభూమినుండి కొనిపోయెను. విమానము జనుచుండు దేశము పర్వతమయమగుటచే సెలయేళ్ళు అసంఖ్యాకములై తూర్పు దిక్కుగా ప్రవహించుచుండెను. ఆ సెలయేళ్ళన్నియును గిలామి వెజీసులు వర్ణించిన నూయను సరస్సులోనికి జేరుచుండెను. నూట యేబదిమైళ్ళు జనునప్పటికి సాయంకాల మాసన్నమగుటచే లంగరులు విడువబడెను. ధ్రువరేఖయందలి 27 వ కళలోను దక్షిణఅక్షాంశరేఖయందలి 4 వ కళలోని 20 వ వికళయందును లంగరుబంధింపబడ విమానము నిలబడెను.

# ఇరువదియవ అధ్యాయము.

ఆరాత్రి గాఢాంధకారమగుటచే డాక్టరు ఫెర్గు సను దేశమును పరిశీలింపజాలకుండెను. విమాన మొక వృక్ష మునకు లంగరు వేయబడియుండ నావృక్షమైనను సరిగ కాన్పించుటలేదు. రాత్రి రెండుఝాములవరకును ఫెర్గుసను మేల్కొనియుండి తదుపరి కెనడీని లేపి తాను నిదురించెను.

"కెనడీ! జాగరూకుడవై యుండుము."

"క్రొత్తవింత లేమైన గలవా?"

"లేదుగాని క్రింద నొక మరమరధ్వని వినవచ్చె. వాయువు మనల నెచ్చటికి కొనివచ్చెనో తెలియనందున మన మప్రమత్తతతో మెలగవలెను."

"నీవు వినిన ధ్వని మృగములదై యుండనోవు!"

"కాదుగాని అవసరమైనయెడల నన్ను లేపుము.

"తప్పక లేపెదను."

మరమరధ్వని తగ్గుటచే ఫెర్గుసను నిదురించెను. గగన మండలము మేఘావృతమై చలనవిహీనమైన వాయువుతో నిండియుండెను. విమానము కదలక నిలబడియుండెను. మినుకు మినుకుమను దీపపుకాంతిచే భూమి రెండువంద లడుగుల దూర మున నున్నటుల కెనడీకి తోచెను. ఆదీపపుకాంతియు నదృశ్య మగుటచే చిమ్మచీకటుల నెడతెగక చూచునపుడు కనులకు గలుగు మిరుమిట్లు భ్రమలు తన నేత్రములకుగూడ సంభవించి

యుండనోపు నని కెనడీ భావించెను. ఈలధ్వనియెందువినవచ్చె. ఆయాల యెట్లుకలిగెను? అడవిమృగములదై యుండునా? లేక నిశాచరవిహంగములదై యుండునా? లేక మానవులదై యుండునా? ఏదిరెగా అపాయము వాటిల్లునను భయముచే కెనడీ తుపాకిని గైకొని దూరదర్శనితో దేశమును పరీక్షించు చుండెను.

మలయమారుతముచే మేఘములు కొనిపోబడ దాగుడు మూతలాడిన చంద్రికిరణముల సహాయముచే కొందరు నీగ్రోలు లంగరు బంధింపబడిన చెట్టును సమీపించుచున్నటుల కెనడీకి గోచరింప ఫెర్గుసనును లేపెను."

"బిగ్గరగ మాటాడవలదు" అని కెనడీ నుడివెను.

"ఆపద వచ్చెనా?"

"అవును. జోవు! లెమ్ము."

జోవుకూడ లేచినవెంటనే కెనడీ తాను జూచిన సంగతి నెరింగించెను.

"వానరదండు తిరిగివచ్చెనా?"

"జోవు, నేను నిచ్చెనవెంబడిన చెట్టులోని కేగుదును."

"ఈలోన నేను విమానమెగురుటకు సిద్ధముచేయుదును. ఉపాయాంతరము లేనప్పుడేగాని తుపాకిని కాల్పవలదు. మన మిచ్చట నున్న ట్లెవరికిని తెలియగూడదు."

కెనడీజోవులు నిశ్శబ్దముగ చెట్టులోని కేగి లంగరుబంధింపబడిన చెట్టుకొమ్మపై నిలబడిరి. చెట్టుపట్టను గోళ్ళతో

గీకిన శబ్దము చెవి సోకగనే జోవు కెనడీచెయి పట్టుకొని విను చున్నావా? ” అని రహస్యముగ ననెను.

“ అవును, చెట్టెక్కుచున్నారు. ”

“ అది కొండచిలువ కాదుగద? ”

“ కాదు, నరశబ్దమే. ”

“ అవును. యెవరో చెట్టెక్కుచున్నారు. ”

“ నీవు నీవైపున చూడుము. నేను నావైపున చూచు చుందును. ” వారు నిలబడినది ఆచెట్టునకు మధ్యకొమ్మ. కొమ్మలచేతను ఆకులచేతను చెట్టుపై గాఢాంధకారముగ నుండెను. జోవు క్రిందకొమ్మవైపు చూచి ‘ నీగ్రోలి’ లని నుడివెను. కొన్ని మాటలుకూడ వినవచ్చె” జోవు గురిజూచెను.

“ ఆగుము. ” అని కెనడీ పలికెను.

కొందరు నీగ్రోలు చెట్టెక్కి సరీసృపములవలె పాకు చుండిరి. నీగ్రోల దేహమునుండి వెలువడు వాసనయే వారి రాకను దెలుపుచుండెను కెనడీ జోవులు నిలబడిన కొమ్మపై రెండుశిరములు కనబడెను.

“ కాల్చుము ” అని కెనడీ కేకవైచెను.

ఇద్దరును ఏకకాలమున తుపాకులను కాల్చుటచే జనించినధ్వని పిడుగుధ్వనివలె నుండ కీచుమను కేకలతో నీగ్రోలు పారిపోయిరి. చెట్టుపై కెక్కిన యిద్దరు నీగ్రోలును చనిపోయిరి. వారి కేకలలో ఘెూరించి భాషయం దొక యార్తనాదము వినవచ్చె.

"రక్షింపుడు! రక్షింపుడు!"

కెనడీ జోవులు భయభ్రాంతులై వెంటనే విమానము లోని కేగిరి.

"డాక్టరుగారు! మీకు వినబడినదా!"

"వినబడినది. ఆర్తనాదమొందు నాచెవుల సోకెను."

"ఒక ఫ్రెంచిమతబోధకుని జంపుచున్నారు. మనకు సాధ్యమైనంత సాయము చేయవలెను. మీకు యిష్టమైనచో రక్షింప యత్నించెదము."

"మీయిష్టమే నాయిష్టము. అనీగ్రోలను తరిమివేయు టెట్లు?"

"తుపాకులసంగతి తెలియనివా రగుటచే వారిని తుపాకులతో తరుమవచ్చును."

"అతడు సమీపమందే కలడు."

"శరణు! శరణు! రక్షింపుము! రక్షింపుము!"

"క్రూరాత్ములు వానిని హింసించుచున్నారు. ఈ రాత్రియే వానిని చంపుదురేమో!"

"డాక్టరుగారు! వినుచున్నారా? వానినియీరాత్రియే చంపుదురేమో?" అని కెనడీ ఫెర్గుసనుచేతిని పట్టుకొనెను.

"అట్లెన్నటికిని కానేరదు. నీగ్రోలు ఖైదీలను రాత్రి వేళ చంపరు."

"చీకటిలో నెమ్మదిగ వానిని సమీపించగలను" అని కెనడీ యనెను.

"నీవెంబడి నేను కూడ వచ్చెదను" అని జో ననెను.

"తొందరపడకుడు. మీదయార్ద్రహృదయమునందలి దుఃఖావేశము మీమాటలచే వెల్లడియగుచున్నది. మన విమానము సంగతి తెలిసినచో ఉపకారమునకు బదు లపకారము జేసినవార మగుదుము."

"అది యేలాగునా? నీగ్రోలు భయపడి పారిపోయిరి. తిరిగి రారుగదా!"

"కెనడీ! తొందరవలదు. మీరు నీగ్రోలచేతుల జిక్కినచో తప్పించుకొనలేరు."

"ఆమాట నిజముగాని మన సహాయమునకై యెదురు చూచుచు, సహాయము రానియెడల యాదీను డేమితలంచును?"

"వానికి ధైర్య మొసగెదము" అని డాక్టరుఫ్రెంచి భాషయందు "మీరెవరైనను సరే భయపడవలదు. మిమ్ముల రక్షింప ముగ్గురు స్నేహితులు వేచియున్నారు" అని కేకవైచెను. దానికి ప్రత్యుత్తరముగ రోదనశబ్దము వినవచ్చెను.

"అయ్యో! వానిని చంపుచున్నారే! మనమూలమున వాని చావు దగ్గిర పడినది!" అని కెనడీ ఆతురుడై పలికెను.

"ఈ చీకటిలో నేమి చేయగలము?"

"ఆహా! ఇదే పట్టపగలైనచో!" అని జో వనెను.

"మనము చేయునదేమి?" అని డాక్టరు ప్రశ్నించెను.

"నేను క్రిందకు దిగి నా తుపాకితో నందరిని తరిమి వేయుదును" అని కెనడీ పలికెను.

"జోవు! నీ వేమి చేయుదువు?"

"ఈ బాణమునకు చీటినిగట్టి పడవేసి ఖైదీని పరుగెత్తుమందును" అని జో వనెను.

"మీతలంపులచే కార్యము నెరవేరదు. క్రూరుల బారినుండి తప్పించుకొనుట కష్టతరము. కెనడీతలంపు బాగున్నను తన కపాయము కలదు. అందుచే ఒకరికిగాను యిద్దరిని రక్షింపవలసి యుండును. కనుక క్రొత్తమార్గ మరయుట మంచిది."

"ఆలసింపరాదు."

"త్వరలోనే చేయుదము."

"చీకటులను వేదజిమ్మగలరా?" అని జో వడిగెను.

ఫెర్గసను ప్రత్యుత్తర మొసగకయే యోచించుచుండెను. కెనడీజోవులు ఫెర్గుసనువైపు చూచుచుండిరి.

"మనవద్ద 200 పౌనుల స్థిరత్వాధారముగలదు. ఖైదీని ఎక్కించుకొని పైకేగుటకు దాని నుపయోగించవలెను.

"అది యెట్లు?"

"ఖైదీని తొట్టిలోనికెక్కించినయెడల వానిభారము నకు సరియగు స్థిరత్వభారమును విసర్జించవలెను. అప్పుడు విమానపుభారమందు వ్యత్యాసము లేకయుండును. పిదప ఉదజనిని కొన్నినిమిషములు ఉష్ణీకరించినగాని విమానము పైకేగదు. వెంటనే ఎగురుటకుగాను మిగిలిన 60 పౌనుల స్థిరత్వభారమును విడిచిపెట్టవలెను."

"అవును."

"స్థిరత్వభారము వ్యయమగుటచే దిగుటకు నుదజనిని గోల్పోవుటయే మంచిది. ఉదజనికన్న ఆర్తరక్షణమే ప్రధానము."

"అవును."

"ఈస్థిరత్వభారవు సంచులను తొట్టియంచున నుంచుము. త్రోయుటకు వీలుగానుండును."

"చీకటిని పోగొట్టు టెట్లు?"

"చీకటిలో మనము చేయుపని యితరులకు తెలియదు గనుక మనపని పూర్తిచేసినపిదప చీకటులను పారదోలుదము. తుపాకులలో మందునుకూరి సిద్ధముగ నుంచుము. మనవద్దనున్న 17 గుండ్లను తీయుదు."

"అంతయు సిద్ధముగ నున్నది."

"జోవు! నేను సైగచేసినవెంటనే స్థిరత్వభారమును పారవేయుము. కెనడీ! పైదీని నెత్తుకొనిరావలెను. జోవు! నీవు ముందుగా జని లంగరునూడదీసి రమ్ము" జో వట్లుచేసెను.

జోవు త్రాటివెంబడి దిగుటచే విమానమున నుత్పతనశక్తిహెచ్చి కదలక నిలబడెను. నీటిని విభజించు విద్యుద్ద్వారాహారకములు తీయబడెను. తనచేతిసంచిలోనుండి రెండు కర్బనుకణికలనుదీసి ఫెర్గుసను వాటికొనలను సన్నముగ చెక్కి వాహారకములచిగురున తగిలించెను. కెనడీ జోవులు వింతగ జూచుచుండిరి. డాక్టరు విమానపుతొట్టిలో నిలబడి రెండుకర్బనుకణికలను రెండుచేతులతో పట్టుకొని రెంటినిచేర్చెను. వెంటనే సూర్యకిరణములను మించుచు కనులకు మిరుమిట్లుగొలుపు కాంతి నలుదిక్కుల వ్యాపించెను. చీకటులు విద్యుత్కిరణముల బారినుండి పలాయనములయ్యెను.

"ఆహా!" అని జోవు ఆశ్చర్యపడెను.

"మాట్లాడవలదు" అని డాక్టరు మందలించెను.



# ఇరువదియొకటవ అధ్యాయము.

" సీ॥ ఒకదీపమార్చిన నన్యదీపంబులు
నవ్వాడ తమకు దా మాఱుటయును
దాలవృంతానిల చేలాంచలాదిక
వ్యాపారములదీప మాఱమియును
నాఱిన దీపంబు లప్రియత్నంబున
మఱిచూడ జూడంగ మండుటయును
మండి యాఱియు నాఱి మండినదీపంబు
వెలుగు జీకటియు గావించుటయును
గలుగునట్లుగ వరశక్తికలన రాజు
శిల్పముల నవ్వుటాలకు జేయుచుండ
దరుణకుతుకతరిపాద్భుతాతంకభార
సంకటస్థాయి వైసారిణాంకమయ్యె! "

—శృంగారనైషధము.

ఫెర్గుసను విద్యుత్కాంతిని నలుదిక్కుల ప్రసరింపజేసి ఆర్తనాదము జనించినవైపున పరీక్షించెను. వాని సహచరులును ఆవైపునకే చూచుచుండిరి.

విజయలక్ష్మి లంగరు వేయబడినవృక్ష మొక మహారణ్యమందలి గొప్ప బయలునందు నెలకొని యుండెను. చెట్టు

నకు సమీపముననే పదిగుడిసెలు గలవు. గుడిసెలచుట్టును నీగ్రోలు గలరు. విమానమునకు దిగువ నొక యురిస్తంభము గలదు. ఆస్తంభమునొద్ద ముప్పది సంవత్సరముల ప్రాయము గల ఫ్రెంచిదేశీయుడగు మతగురువొక డాసీనుడై యుండెను.

"శిరముమధ్య వెండ్రుకలు కురుచగనున్నవి. అందుచే నతడు మతగురువు" అని జోవు పలికెను.

"పాపము!" అని కెనడీ విచారించెను.

"మనము వానిని రక్షింపగలము."

తోకచుక్కవలె కనబడు విమానమును జూచినతోడనే నీగ్రోలు భయభ్రాంతులై పారిపోయిరి. వారు పారిపోవుటను జూచి మతగురువు తల పైకెత్తెను.

"బ్రతికియే యున్నాడు. మనము మంచితరుణమున జేరితిమి. నీగ్రోలు భయభ్రాంతులై పరుగిడుచుండుటచే వానిని రక్షింప నిదియే మంచిసమయము. సిద్ధముగ నుండుడు."

"సిద్ధముగ నున్నాము."

"జోవు! మరప్రొయ్యి నార్పుము."

నెమ్మదిగ వీచుచుండిన వాయుతరంగమొండు విమానమును మతగురువు కూరుచున్న స్థలమునకు గొనిపోయెను. లోపల ఉదజని సంకోచింప విమానము నెమ్మదిగ భూమిపైకి దిగెను. నీగ్రోలు గుడిసెలలో దాగిరి.

తొట్టి భూమిని సమీపించినతోడనే ధైర్యసాహసములుగల నీగ్రోలు గుడిసెలనుండి వెలువడిరి. కెనడీ తుపాకిని గైకొనెనుగాని డాక్టరు వారించుటచే కాల్పలేదు. మతగురువు లేవబోయి శక్తిజాలక కూలబడెను. అంతబలహీనుడుగ నుండుటచేతనే వానిని వధ్యస్తంభమునకు రెక్కలువిరిచి కట్టరైరి. తొట్టి భూమిని సమీపించిన వెంటనే కెనడీ తుపాకిని విసర్జించి భూమిపై కురికి ఖైదీని తొట్టిలోనికి జేర్చెను. వెంటనే జోవు రెండువందలపౌనుల స్థిరత్వభారమును పారవైచినను విమానము రెండుమూడడుగులు మాత్రమే లేచినిలబడెను.

"విమానచలనమున కవరోధము కలిగినది" అని డాక్టరనెను.

కొందరు నీగ్రోలు పరుగెత్తివచ్చిరి.

"నీగ్రోయొకడు తొట్టినిపట్టుకొని వ్రేలాడుచున్నాడు" అని జోవు కేకవైచెను.

"కెనడీ! నీళ్ళపీపా!" అని డాక్టరనెను.

కెనడీ వెంటనే నూరుపౌనుల నీటిపీపాను పారవేయ విమానము మూడువందల అడుగుల యెత్తున కేగెను. నీగ్రోలందరును గుడిసెలనుండి వెలువడి కేకలువేయసాగిరి. ఎన్ని కేకలువైచిన నేమిప్రయోజనము? డాక్టరు చేసిన విద్యుత్ప్రభాప్రదర్శనము నీగ్రోలను భయభ్రాంతులను జేసి మతగురువును చిత్రవధనుండి కాపాడెను.

"బ్రదికితిమి మనము కృతకృత్యులమైతిమి" అని కెనడీ జోపులు సంతసించిరి.

వా రామాటను ముగించకముందే విమానమువేయి అడుగుల యున్నతమున కేగెను.

"ఎందుచేత?" అని కెనడీ ప్రశ్నించెను.

"నీగ్రో విమానమును విడిచిపెట్టుటచే వాని భారము తగ్గినందున విమానమున కుత్పతనశక్తి హెచ్చెను" అని డాక్టరనెను.

జోపునకు విమానమును విడచి క్రిందబడి చనిపోయిన నీగ్రో కనబడెను. డాక్టరు విద్యుత్కార్బన కణికలను విడదీయుటచే లోకమంతయు గాఢాంధకారమయ్యెను. రాత్రి ఒంటిగంటయైనది. ఫ్రెంచిమతబోధకుడు కండ్లను తెరచి చూచెను.

ఆహా! తమ దేశీయుడన నెంతటి యాదరణ! వాని ప్రాణమునకై తమ ప్రాణమును గోల్పోవ సిద్ధపడిరే! దీనినే కొందరు దయార్ద్రహృదయు మందురు. దయార్ద్రహృదయు మొక్కటేయైనచో నంతటి సాహసమున కీయకొందురా! దేశాభిమానమే దయార్ద్రహృదయమునకు కారణభూతమై యుండుటచే వా రంతటి సాహసకార్యమును చేయగలిగిరి. దేశాభిమానము మానవులకుగల సద్గుణములలో నమూల్యమైనది.

" నీగ్రోల చేతులలో చావు తప్పినది " అని డాక్టరు ఫెర్గుసను భాషతో ననెను.

" అవును. క్రూరపుచావునుండి దాటితిని. మీకు మిగుల కృతజ్ఞుడను. కాని నేను జీవించుట కొన్ని గంటలు మాత్రమే " అని ఇంగ్లీషులో ప్రత్యుత్తర మొసగినందున ఆయాసము హెచ్చి స్పృహదప్పెను.

" వాని ప్రాణములు పోవుచున్నవే ! " అని కెనడీ పలికెను.

" లేదు. నీరసము హెచ్చుగనున్నందున మాట్లాడలే కుండెను. "

వానిని పరుండబెట్టి వానిశరీరమం దున్న ముప్పదిగాయ ములను కడిగి కట్టుకట్టి ఫెర్గుసను తన చందువా పెట్టెనుండి మందునుతిసి రోగినోటిలోపోసి రోగిని పరుండనిచ్చెను. విమా నమునకు స్థిరత్వభారము తగ్గుటచే ఉదజనిని ఉష్ణీకరింపకయే ఉత్పతనశక్తి హెచ్చెను. తూర్పుదెస తెలతెలవారుచుండ పవనుడు విమానమును ఈశాన్యమూలగా గొనిపోవుచుండెను. ఫెర్గుసను నిదురించుచున్న రోగిని సమీపించెను.

" మనరోగి బ్రతుకునుగాక ! జీవించగలడా ? " అని కెనడీ ప్రశ్నించెను.

"జీవించు యాశగలదు. వాతావరణము నిర్మలముగను ఆహ్లాదకరముగను నున్నది. రోగి కుపచారము చేయుచుండ వలెను."

"ఎంతటి బాధలకు లోనాయెను? నీగ్రోల మధ్యకు ఒంటరిగ జనుటలో మనకన్న నెక్కుడుసాహసమును జూపెనే!" అని జోవనెను.

"అవును" అని కెనడీ పలికెను.

ఆరోజంతయు రోగి నిదురించియుండెను. అప్పుడప్పుడు బాధచే మూల్గుచుండెను. ఫెర్గసను ఆ రాత్రికూడ మేల్కొని యుండి రోగిని కాపాడుచుండెను. కెనడీ జోవులు వంతుల ప్రకారము నిదురించిరి. మరుచటిదినమున విమానము మలయమారుతముచే పశ్చిమముగా కొనిపోబడుచుండెను. రోగి నిర్మలవాయువును తనివిదీర కోరులుచుండెను.

"నీ దేహము స్వస్థతగనున్నదా ?" అని డాక్టరు ప్రశ్నించెను.

"కొంచెము నెమ్మదిగ నున్నది. మిమ్ములను చూచుట కలయని భ్రమించితిని. మీ రే దేశీయులో తెలిపెదరా ? భగవంతుని ప్రార్థించునపుడు మీనామము లుచ్చరించి మీకు సకలశుభములొసంగుమని దైవమునకునా వేడికోలర్పింతును."

"మేము ఆంగ్లేయులము. ఆఫ్రికా దేశమును విమానములో దాటుచున్నాము. మామార్గమం దొక ప్రాణమును కాపాడ తటస్థించెను."

"ప్రకృతిశాస్త్రజ్ఞులలో గూడ ఆర్తత్రాణపరాయణులు గలరే?"

"మత గురువులలో గూడ తృణప్రాయముగ ప్రాణ పరిత్యాగ మొనరించు మహాత్ము లున్నారు."

"మీరు మతగురువులా?"

"నేను లాజరిస్టు మతగురువులలోని వాడను. దేవుడు నా ప్రాణరక్షణార్థమై మిమ్ముల నంపెను. కాని నేను ఎక్కువ కాలము జీవించను. మన దేశమునుండి మీరు వచ్చుచున్నారు. ఆ దేశపు వార్తలు విని 5 సంవత్సరములైనది. అచ్చటి వింత లను చెప్పుడు."

"అయిదు సంవత్సరములనుండి నీగ్రోలమధ్యనా!" అని కెనడీ ఆశ్చర్యపడెను.

"వారినే మన ముద్ధరింపవలయును. మన మతముచే వారికి నాగరకత చేకూరును."

రోగి వాంఛను సంతృప్తిపరుప ఫెర్గుసను ఫ్రెంచిదేశమునుగురించి వివరముగ దెలిపెను. రోగి కెనడీజోవులకు కరచాలన మొసగెను. ఫెర్గుసను కొంచెము తేనీటిని తయారుచేసి రోగి కొసగెను. రోగి ఆ తేనీరమును గ్రోలి లేచి కూర్చుండెను.

" మీరు ధైర్యసాహసములు గలవారు. మీరు ప్రాని నకార్యమునందు కృతార్థులై మీ బంధువులను స్నేహితులను తిరిగి వెంటనే కలిసికొందురు" అని రోగి పలికెను.

రోగి కాయాసము హెచ్చినందున కొన్నిగంటలవరకు స్పృహదప్పి పరుండెను. హృదయమున కావేదన హెచ్చెను. డాక్టరు గాయములను కడిగి మందువేసి కట్టెను. నీటిచే పెదవులను తడుపుచుండుటచే రోగికి తచ్ఛాంతిగలిగి డాక్టరుచేతులలో పరుండి తనచరిత్ర నీక్రిందివిధముగా చెప్పెను.

" ఫ్రెంచిభాషలోనే చెప్పుడు, అదుచే నాయాస ముండును."

రోగి బ్రిటనులోని యరడాగాయను గ్రామవాసి. మత బోధనలయందు ప్రీతిని గలిగియుండుటచే ఆవృత్తియే తనజీవనోపాధిగ నెన్నుకొనెను. విన్సెంటుడిపాల్ అను ఫ్రెంచిదేశీయుడు స్థాపించిన మతసంఘములో సభ్యుడుగ జేరి పనిజేయుచుండెను. ఇరువది సంవత్సరముల ప్రాయముననే ఆఫ్రికా దేశమున కేగి మతవ్యాపనను ప్రారంభించెను. కష్టముల కోర్చి నైలు జన్మస్థానమందలి యుపనదులవద్ద నివసించు నీగ్రోల దరి కేగి రెండు సంవత్సరములు బాధపడినను అతని కష్టములు ఫలించలేదు. అత డొసగిన బహుమానముల నెవ్వరును ముట్టుకొనరైరి. తుదకు న్యయంబరోలోని నీగ్రోలచే

చెరపెట్టబడి యా నీగ్రోలకు యుద్ధము పొసగిన సమయమున విడువబడెను. వారిభాషను నేర్చుకొనెను. తదుపరి న్యాంన్యాం యను నీగ్రోలతో నివసించినపుడు వారి యజమాని చని పోవుటచే యీ తెల్లవాడే వాని చావునకు కారణభూతమని యీ మతగురువును బలియిచ్చుటకు సిద్ధపడిరి. తుపాకిదెబ్బను వినినతోడనే యార్తనాదమును జేసెను. తిరిగి ప్రత్యుత్తర మును ఒడయువరకు తుపాకిధ్వని కలయని భావించియుండెను.

రోగికి బాధ హెచ్చెను. రోగి మధ్యాహ్నమువరకు జీవించుట కష్టమని ఫెర్గుసను తలంచెను.

" చనిపోవుదునని నాకు విచారములేదు. నాజీవితము సర్వస్వమును దైవాధీన మొనరించితిని."

" భయపడవలదు. మాకు సాధ్యమైనంతవరకు మీకు పరిచర్యలను జేయుదుము."

" ఇటువంటి స్నేహితుల ముఖసందర్శనము, కరస్పర్శ నము లేకుండ చనిపోవనందుకు దేవుని వేయినోళ్ళ స్తుతించ వలయును."

రోగి క్షీణించుచుండెను. జోవు కండ్లనీటిని తుడుచు కొనెను. కెనడీ విచారించెను. విజయలక్ష్మి నెమ్మదిగ నేగు చుండెను. కెనడీ దిఙ్మండలమును పరికింప భూమండలమును దహించు కార్చిచ్చువలె గొప్పమంటలు కానవచ్చెను. ఫెర్గు సను పరీక్షించి చూచెను.

"వాయువు మనల నామంటలవైపునకు గొనిపోవుచున్నది" అని కెనడీ పలికెను.

"భయపడవలదు. హానిలేకుండ మన మా మంటల నవలీలగ దాటగలము" అని డాక్టరనెను.

మూడు గంటలలో విమానము ధ్రువరేఖయందలి 24 వ కళలోని 15 వ వికళకు అక్షరేఖలోని 4 వ కళలోని 42 వ వికళను దాటి పర్వతములను సమీపించెను.

మంటలు విమానమును సమీపించెను. పర్వతశిఖరమందలి కలుగులోనుండి జాజ్వల్యమానమైన గంధకాది పదార్థములు చిమ్మనగ్రోవిలోనుండి వెలువడు ద్రవపదార్థమువలె వెడలుచుండెను. పైకెగరవేయబడిన ద్రవపదార్థము జలపతనమువలె భూమిపైబడి చుట్టుప్రక్కలనున్న మహారణ్యములను భస్మీపటలము జేయుచుండెను. వాయువా విమానమును మంటలవైపునకు గొనిపోవుచుండుటచే ఉదజనిని ఉష్ణీకరించి విమానమును పైర్గునను 6000 అడుగుల ఉన్నతమునకు గొనిపోయెను. చనిపోవనున్నరోగి అగ్నిపర్వతమందలి అగ్నికుండమును వీక్షించెను.

"ఆహా! ఇంతటి చిత్రమును గగనభాగమునుండి వీక్షించుట యెవరికైనను లభించునే? ఆహా! ఈవిచిత్ర దృశ్యమత్యంత భయానకప్రదముగ జెలంగుచున్నను ప్రకృతివనితా రౌద్ర స్వరూపమును ప్రదర్శించుచు పూర్వరామణీయ

శమును వెలిబుచ్చుచు పరమపురుషుని చిద్విలాసమును ప్రక టించుచున్నది. భగవంతుని మహిమలు అనంతములు, అద్భు తములని పలుకుట కింతకన్న నిదర్శన మేమి గావలయును? " అని రోగి పలికెను.

మంటలచే పర్వతపార్శ్వములు గాన్పించుట లేదు. అగ్ని జ్వాలలు తరంగములవలె లేచుచుండెను. ఉష్ణము విమానము నకు స్వల్పముగ సోకెను. ఫెర్గుసను విమానము నాస్థానము నుండి వెంటనే తప్పించెను. రాత్రిపదిగంటలకు అగ్నిపర్వతము దిఙ్మండలమున నొక యెఱ్ఱనిచుక్కగా గాన్పించుచుండెను. భూమికిసమీపమున వీచు వాయుతరంగముచే విమానము గొనిపోబడుచుండెను.



# ఇరువదిరెండవ అధ్యాయము

ఆరేయి గడచుచుండ రోగి నిదురించెను.

" తిరిగి తేరుకొనుట కష్టము. పాపము! ముప్పది యేండ్ల ప్రాయమువాడు! " అని జోవు విచారించెను.

" ఇతడు మన చేతులలో ప్రాణముల బాయును. శ్వాస క్షీణించుచున్నది. చేయవలసిన ఉపచారము కాన్పిం చుట లేదు " అని డాక్టరనెను.

"దుర్మార్గులు నిష్కారణముగ వారు వీనిని హింసించిననువీనికి వారిపై ప్రేమ తగ్గలేదు." అని జో వచనెను.

రోగి పరాకుమాట లాడుచుండుటచే ఫెర్గుసను రోగిని సమీపించి డేరాను తొలగించినందున చల్లనిగాలిని రోగి పీల్చుచుండెను. అంబరమున నక్షత్రములు మినుకుమినుకుమని ప్రకాశించుచుండ చంద్రకిరణము లనుచాకింటిమడతలచే రోగి శరీర మాపాదమస్తకము కప్పబడియుండెను.

"స్నేహితులారా! నేను మిమ్ములను వీడుచున్నాను. మీకార్యము సౌఖ్యముగ కొనసాగుగాక! నాకృతజ్ఞతను దేవుడే మీకు తెలియపరచును." అని రోగి నుడివెను.

"భయపడవలదు. ఇంతటిచక్కని రాత్రియందు నీవు మమ్ములను వీడజాలవు." అని కెనడీ ధైర్యము నొసగెను.

"చావు సమీపమునకే తెంచి నన్ను తేరిపారజూచుచున్నది. మరణమనగా భూలోకమందలి విచారములనెల్ల దూరమొనరించి స్వర్గలోకసౌఖ్యమును శాశ్వతముగ ననుభవించుటయే. నన్ను కూర్చొనబెట్టుడు." కెనడీ రోగిని లేవదీసి కూర్చొనబెట్టెను.

"దేవా! నామీద దయచూపుము."

ఆమాటల నుచ్చరించుచు రోగి కెనడీచేతులలోని కొరిగెను. ఇహలోకసౌఖ్యములను విసర్జించి పరలోకసౌఖ్యముల నందగోరెను. కెనడీకండ్లవెంబడి నీరు స్రవించెను.

"చనిపోయెను." అని డాక్టరు నిట్టూర్పు విడచెను. ముగ్గురు వైమానికులును దైవప్రార్థన జేసిరి.

"తెల్లవారినపిదప తనరక్తముచే పవిత్రవంతముగజేసిన యీఆఫ్రికాదేశమందే యీతనిని భూస్థాపితము చేయుదము" అని డాక్టరనెను.

మిగిలినరేయి వంతులప్రకారము వారు మేల్కొని యుండ నిశ్శబ్దముగ గడచెను.

మరునాడుదయమున దక్షిణదిశగా వీచు వాయువు విమానమును పీటభూమిమీదుగా గొనిపోవుచుండెను బావులు గాని, నీటిగుంటలుగాని, తటాకములుగాని లేక భూమి బీటలు వారియుండెను. తరుగుల్మాదులైనను కాన్పించుటలేదు. నిర్మానుష్యమై నిర్జీవస్థానమై నిర్మలోదకహీనమై నిశ్శబ్దముగనున్న నాప్రదేశము నేమని వర్ణింపనగును? మధ్యాహ్నమగుచుండ మన వైమానికులు విమానము నొకలోయలోనికిదింపి శవమును భూస్థాపితము జేయయత్నించిరి. ఉదజనివల్లము తెరువబడుటచే విమానము క్రిందకుదిగెను. తొట్టి భూమిని సమీపించినవెంటనే వల్లము బంధింపబడెను. జోవు ఒకచేతితో తొట్టినిపట్టుకొని రెండవచేతితో కొన్నిరాళ్ళను తొట్టిలోవైచెను. పిదప రెండుచేతులతోను సుమారు అయిదువందల పౌనుల భారము గలరాళ్ళను తొట్టిలోవైచెను. పిదప ఫెర్గుసను కెనడీలుకూడ దిగిరి. వారిముగ్గురిభారమును మించినభారమును తొట్టిలో

నిడుటచే విమానము నిలబడియుండెను. ఫెర్గుసను మంచిపరిశోధ కు డగుటచే తొట్టినుండి దిగినవెంటనే యాతనిదృష్టి చుట్టునున్న రాళ్ళపై బడెను,

"మంచిపరిశోధన" అని డాక్టరనెను.

డాక్టరట్లు పరిశోధనచేయుచుండ కెనడీ జోవులు తొట్టి కి సమీపమున నొక గోతినిత్రివ్వి శవమును ఆగోతియందుంచి మట్టిని గప్పిరి. ఆఫ్రికనులు ఫ్రెంచిమతగురువును బాధించి చం పిరను కోపోద్రేకమును వహించెనో యన సూర్యుడు వేడికిరణ ములచే ఆఫ్రికాదేశమును దహించుచుండెను.

ఫెర్గుసను ఆలోచనానిమగ్నుడగుటచే తనస్నేహితు లెన్ని కేకలువైచినను వినిపించుకొనకుండుటయేగాక ఎండవేడిమిని గూడ లక్ష్యపెట్టలేదు.

"అయ్యా! మీ యాలోచనయేమి?" అని కెనడీప్ర శ్నించెను.

"ఇచ్చట ఒకవింతవస్తువు కాన్పించుచున్నది. మన మ తబోధకు డిచ్చట శయనించుచున్నాడో తెలియునా?"

"తెలియదుగాని యేమివింత?"

"బ్రతికియున్నన్ని దినములు కుచేలుడై కాలముగడపిన మహనీయుడు మరణించినవెంటనే కుబేరునితో సమానుడై వెలయుచున్నాడు."

"ఏమిది! ఈప్రదేశము నవనిధులకు జన్మస్థానమా!

లేక యీపర్వతకంధరము స్వర్ణఖనియా?" అని కెనడీజోవు
లొక్కసారి పలికిరి.

"ఆ నెరియలలో చూడుడు. మీకే తెలియగలదు. క్రింది
వరస రాళ్ళన్నియు పదహారువన్నె బంగారపు కణికలై చెలు
వొందుచున్నవి."

కెనడీజోవులు వంగిచూచిరి. జోవుసంతసము మేరమీ
రుచుండెను.

"జోవు! తొందరవలదు. మన మీబంగారమును కొని
పోవుటకై రాలేదు."

"ఏందువలన?"

"మనవిమాన మెట్లుమోయగలదు? ఇందుచే నీవింత
ను మీతో చెప్పకూడదనియే తలంచితిని."

"అంతటిభాగ్యమును వీడుటెట్లు? మన మదృష్టవంతు
లము. బీదరికము పంచబంగాళమై పారిపోవును."

"జాగ్రత్త. నిన్ను ధనపిశాచ మావహించుచున్నది.
మన మతగురువుజీవితమువలన త్యాగము నణుమాత్రమైన
నేర్చుకొనలేదా?"

"మీరుచెప్పినది వాస్తవమేగాని సిరిరా మోకా లడ్డు
వారుగలరా? ఇచ్చటగూడ త్యాగమా! కొన్నిలక్షల విలువ
గల బంగారపుముక్కలను మాత్రమే తీసికొందము."

"మనకు లాభమేమి? మనము ధనముకొఱకు రాలేదు"
అని కెనడీ నవ్వుచు పలికెను.

"లక్షలకొలది విలువగల బంగారుతునుకలు జేబులలో నిముడునా!" అని డాక్టరు పరిహాసించెను.

"స్థిరత్వాభారమువకై యిసుకసంచులకు బదులు బంగారమును కొనిపోవుదము."

"అందుకు నేను సమ్మతించెదను గాని స్థిరత్వాభారమును పారవేయునప్పుడుమాత్రము నీవభ్యంతరము పెట్టకూడదు."

"కొన్నిలక్షలపౌనుల బంగారమును పారవేయుటయే!"

"అవును. ఇది భూదేవిధనాగారము. ఇచ్చట వేలకొలది సంవత్సరములనుండి బంగారము కూడియున్నది. అయిదు ఖండములను భాగ్యవంతముగ జేయునంతటి బంగారముగలదు. కాని మనకు నిరుపయోగము."

"ఇంతబంగారము నిరుపయోగముగ నున్నదే!"

"అందుచే నీకొక్కమాటచెప్పెదను వినుము."

"నేను వినజాలను! ఈ బంగారమును విడిచినచో ప్రాణములుపోవును."

"కాదు వినుము. ఈ గనియున్న తావును పటమందు చక్కగా నిరూపించి వ్రాసెదను. ఇంగ్లాండువెళ్ళినప్పుడు యీసంగతి వెల్లడిచేసినయెడల అందరును భాగ్యవంతులయ్యెదరు."

"సరే! మీరుచెప్పినది మంచిదే. నేను ఆశపడను. తొట్టినిమాత్రము యీబంగారముతో నింపెదను. ప్రయాణాంతమున నెంత మిగులునో అంతయు మనదే."

తొట్టిని వేయిపౌనల భారముగల రాళ్ళతో జోవు నింపెను. వారున్నచోటు ధ్రువరేఖయందల 22వ కళలోని 23 వ వికళయందు నెలకొనియుండెను. ఫ్రెంచిమతబోధకుని గోరీవైపు కడసారి చూచి ఫెర్గుసను విమానము నధిరోహించెను. కెనడీ జోవులు తొట్టిలోని కేగిరి.

"సర్వము దేవునికి విదితమే." అని డాక్టరు పలికి తిరిగి ఆలోచనా నిమగ్నుడాయెను. నీరు తక్కువగా నుండుటచే నీరు దొరకినచోట దిగి నీటిని నింపుకొన నెంచెను. వారివద్ద త్రాగుటకైన సరిపడు నీరము లేదు. కొల్పోయిన నీటిపీపాయుండినచో వారి కీనీటి యిద్దడి లేకుండెడిది. కెనడీ జోవుల దృష్టి స్వర్ణశిలలపైనుంత ఫెర్గుసను మరపౌర్యున్ని వెలిగించెను. ఉదజని వ్యాకోచింపబడినను విమానము లేవనందున జోవు ఆత్రముతో ఫెర్గుసను వైపు జూచెను.

"జోవు!" అని డాక్టరనెను. జోవు పూట్లాడలేదు.

"జోవు! వినబడుచున్నదా?"

జోవు వినినటుల తలయూచినను, చేయునది తెలియనటుల నటించెను.

"కొన్ని రాళ్ళను పారవేయుదువా?"

"మీరు సమ్మతించియుంటిరే!"

"స్థిరత్వభారమునకు సరియగు భారము నిడుటకు మాత్రమే సమ్మతించియుంటిని"

"కాని........."

"ఈయుదారియం దుండవలె ననియా నీతలంపు?"

జోవు కెనడీవై పు జూచెను. కెనడీ నిరాశదీపించు ముఖమును కనబరచెను.

"జోవు! ఏమి చేయదలంచితివి?"

"మీా మరపొ్రియ్యి పని చేయదా?"

"మరపొ్రియ్యి పనిచేసినను స్థిరత్వభార మమితముగ నున్నందున విమాన మెగురజాలదు."

జోవు శిరఃకంపనజేయుచు చిన్నరాతినెత్తి దానిభారమును జూచి తెగించి పారవేసెను. దాని భారము రెండు మూడు పౌనుల కన్న నెక్కువ లేనందున విజయలక్ష్మికి తృప్తి గలుగలేదు.

"విమాన మెగురుటలేదా?"

"లేదు. ఇంకను కొన్నిరాళ్ళను పారవేయుము."

కెనడీనవ్వెను. జోవు పదిపౌనులరాతి నెత్తి పారవేసెను. విమానము కదలనందున జోవుముఖవర్చస్సు మారెను.

"నీవు నేను కెనడీయు జేరి 400 పౌనుల భారముందుము. అంతభారమును పారవేయుము."

"నాలుగువందల పౌనులేనా?"

"మనలను పైకి గొనిపోవుట కంతకన్న నెక్కువ పారవేయవలెను. కనుక పారవేయుటకు విచారింపకుము."

జోవు విచారముతో నొక్కొక రాతిని పారవేసియాగు చుండెను.

"మనము ఎగురుచున్నాము."

"లేదు."

"ఇదిగో కదలుచున్నది."

"ఇంకను పారవేయుము."

విసిగి తుదకు పెద్దరాతిని పారవేసెను. విమానము నూరడుగులు పైకేగెను. చుట్టునున్న పర్వతములు లోట్టిక్రింద కనబడుచుండెను.

"జోవు! నీకు చాల బంగారము మిగిలినది. జాగ్రత్తగ కొనిపోయినచో నీ జీవితకాలమంతయును నీవు భోగభాగ్యములతో తులదూగగలవు." అని కెనడీ యనెను.

"కాంచితివా నీవు! కాంతామోహబంధముల గట్టువడని వారలుగూడ నీకలికాలమున కాంచనాశాపాశజాలముల నవలీల గట్టువడుచున్నవారలు. ఔరా! ఏమి యీ కనక మహిమ!" అని డాక్టరు కెనడీతో పలికెను.

విమానము పశ్చిమదిశగా తొంబదిమైళ్లదూరమేగి జాంజిబారు నుండి 1400 మైళ్లదూరములో నుండెను.

# ఇరువదిమూడవ అధ్యాయము.

విమాన మొక తరువునకు లంగరు వేయబడియుండ రాత్రికాలము గడచెను. వైమానికులు వంతుల ప్రకారము మేలుకొనియుండిరి. కడచినదినమున జరిగిన విచారకరమగు సంగతి వారి మానసముల నింకను కలతపెట్టుచుండెను. సూర్యుడు తన కొలువుకూటమున కేతెంచి తన కిరణములచే నుదజని నుష్ణీకరించి నందున విమానోత్పతనశక్తి హెచ్చి వాయువ్యమూలగా వీచు వాయువుచే గొనిపోబడుచుండెను.

"ఈవేగము చాలదు. మన ప్రయాణములో నర్ధభాగము పదిరోజులలో జేసితిమి. ఈవేగమున మిగిలిన అర్ధభాగమును ముగించుటకు కొన్నినెలలుపట్టును. మనవద్దనున్ననీరము కూడ తగ్గుచున్నది." అని డాక్టరనెను.

"నీరు దొరకవచ్చును. ఇంత గొప్పదేశమందు నీటికి కరువురాదు. నదిగాని, సెలయేరుగాని, కొలనుగాని మనకు కనబడ వచ్చును." అని కెనడీ హెచ్చరించెను.

"దొరకవచ్చును."

"జోవు! స్వర్ణభారమే కదా మన విమానమును నెమ్మదిగ పోనిచ్చుటకు కారణము?" అని జోవును కెనడీ పరిహాసించెను.

జోవు దీనవదనుడై కెనడీవైపు జూచెను.

సహారాయెడారియు నచటి ప్రయాణీకులు పడు కష్ట

సుఖములును తెలిసినవాడగుటచే ఫెర్గుసను యోజనా నిమగ్నుడయ్యెను. జోవు ముందురాబోవు స్వర్ణశిలల విలువను గురించి యోజించుచుండెను. విమానము జనినకొలది జలచిహ్నము లంతరించుచుండెను. రాబోవునది సహారాయెడారి. గ్రామములు గాని, తరుగుల్మాదులు గాని కానబడకుండుటచే నీరు దొరకదని ఫెర్గుసను భయపడసాగెను. నీటికొరకు వెనుకకు జనుట కష్టము. అట్టి సమయమున తుపాను తారసిల్లినను మంచిదే. తుపానసాయముచే విమానము యెడారిని త్వరలో దాటగలదు. ఆదినమున విమానము ముప్పదిమైళ్ళ దూరమైనను జనలేదు. తొట్టిలో మూడుగేలనుల నీరు కలదు. అందులో ఒకగేలను దాహము నుపశమింపజేయుటకును, మిగిలిన రెండు గేలనులనీరును మరప్రాయ్యకొరకును నుద్దేశింపబడెను. రెండుగేలనుల నీటినుండి 480 ఘనఅడుగుల ఉదజని వెలువడి మరప్రాయ్యకొరకు గంటకు 9 ఘన అడుగుల ఉదజని వ్యయపడును గనుక రెండు గేలనుల నీరు విమానమును 54 గంటల కాలము నడిపించును.

"రాత్రికాలము నీరు కనబడుట కష్టము గనుక రాత్రి ప్రయాణము మాని మూడున్నర రోజులు తిరిగి నీటిని కనుగొనవలెను. మనము త్రాగుట కొక గేలను నీరు మాత్రము గలదు." అని డాక్టరనెను.

"మీ యిష్టప్రకారమే నడిచెదము." అని కెనడీ పలికెను.

సాయంకాల భోజనసమయమున నీటిని కొలిచి శాస్త్రి గిరి. దాహమును పుట్టించునుగాన బాగిందిని వారు మట్టిరైరి. ఆరాత్రి విమానము సముద్రమునకు 800 అడుగుల యెత్తున నున్న పీటభూమిపై నిలబడెను. ఆఫ్రికా దేశముమధ్య గొప్ప జలభాగము కలదని వచించుశాస్త్రజ్ఞుల మాటలు ఫెర్గుసనుకు స్ఫురించెను. కాని యాప్రదేశమున కేగుటెట్లు?

తూర్పుదిక్కున తెలతెలవారుచుండెను. సూర్యకిరణములు తమ శత్రువులైన చీకటులను సంహరించి తమ యాధిక్యతను నెలకొలుపుచు చుట్టునున్న పర్వతములను యెడారిని ఉష్ణీకరించుచుండెను. యంత్రములను స్థాపించుటకు పునాదియం దిమిడ్చిన మరమేకులవలె విమానము చలనవిహీనమై నిలబడెను. ఆ వాతావరణమును దాటి మఱికొంత యెత్తయిన ప్రదేశమునకు బోయిన బాగుగానుండును కాని నీరు చాలదు. అందుచే విమానము భూమికి నూరడుగుల యెత్తునకు కొనిపోబడుటచే సన్నని వాయుప్రవాహము విమానమును పశ్చిమదిశగా కొనిపోవుచుండెను. మధ్యాహ్నము రెండు ఝాములకు విమానము పండ్రెండుమైళ్ళ దూరమేగెను.

"ఇంతకన్న నెక్కువ వేగమున బోజాలము. ప్రకృతి బద్ధులమై మనము సంచరింపవలయునేగాని యీమెను బంధించి

దానురాలనుగా జేయుటకు మనకింక సామార్థ్యముజాలదు." అని డాక్టరు పలికెను.

"ఈసమయమున తెడ్లున్నచో మన కుపకరించెడివి."

"మర తెడ్లను త్రిప్పుటకు ఆవిరియంత్ర ముపయోగించి నను మనపని యీవిధముగ నుండెడిదే. ఓడలకు మగ తెడ్లను కను గొనుటకు యేడుశతాబ్దములు పట్టెను. విమానములకు మా ర్పులు రాబోవుకాలము ముందున్నది."

"ఈవేడి దారుణముగ నున్నదే?" అని జోవు జేబు రుమాలుతో ముఖమును తుడుచుకొనెను.

"నీరున్నచో ఉదజనిని ఉష్ణీకరించుట కీవేడిమి చాలును. ఆనీగ్రోల ఘోరకృత్యముచే మన నీటిపీపాను గోల్పోతిమి."

"గతజలసేతుబంధన మేల?"

"అవును. ఆ నీరున్నచో వత్తుమురోజులు నీటిబాధ లేక యుండెడిది. రెండువారములలో నీ యెడారిని దాటెడి వారము."

"మనము ప్రారంభించిన ప్రయాణములో సగభాగమైన ము గిసినదా?" అని జోవుప్రశ్నించెను.

"దూరమును జూచినచో ముగిసినది. కాని రోజుల ననుసరించికాదు. వాయువు మనలను మోసపుచ్చుచున్నది."

"తొందరపడకుడు. నీరు దొరకును."

పర్వతములును స్వర్ణశిలలును దృష్టికి గోచరించుటలేదు

ప్రకృతి మారుచుండెను. ఇసుకయందు జనించు మొలకలు తప్ప వేరేమియును కాన్పించుటలేదు. ఏవైపునజూచిన నిసుక యెడారియే.

"నీతో సుడివిన ఆఫ్రికాదేశమిది." అని డాక్టరు జోవుతో వనెను.

"అవును. ఇది ప్రకృతిసిద్ధము. ఎండయును, ఇసుకయును కలిసియే యుండును. ఇంతవరకు అడవులను, పచ్చికబయళ్లను జూచితిమి. అందుచే నీ యెడారినిజూచు టొకవింత. ఆఫ్రికా ఖండమున జూడదగిన దిదియే." అని జో వనెను.

సాయంకాలమునకు విమానము యిరువదిమైళ్లదూర మేగెను. సూర్యుడు పడమటియెడారియందు గ్రుంకుచుండుటచే చీకటులు గ్రమ్ముచుండినను వేడిమితగ్గలేదు. దినములు గడచుచుండినను ప్రాతఃకాల, మధ్యాహ్నకాల, సాయంకాలములకు శీతోష్ణస్థితియందు వ్యత్యాసములేదు. ఫెర్గుసను దూరదర్శనిచే దిఙ్మండలమును పరీక్షించెను. ఇసుకయెడారియే కాన్పించెను.

ఫెర్గుసను పైకి ధైర్యముగ గనబడినను ఆకలిదప్పికలకు లోనయి తనతోగూడ తనస్నేహితు లిద్దరును చనిపోవుదురని లోలోన విచారించుచుండెను. విమానవునును చేయలేనికార్యమును తాను చేయుచుండుట మంచిదా? అసాధ్యమును సాధింప శక్యమా? అట్టిసమయమున వెనుకకు మరలుట మంచిదా? శీతలవాతావరణ ప్రదేశములులేవా? రాబోవుదేశము క్రొత్త

దేశము. ఈ సంగతులను తనచెలికాండ్రకు తెలియబరచి వారి యభిప్రాయమును ఫెర్గుసను కనుగొన యత్నించెను.

"నాయజమానుని యాజ్ఞను నెరవేర్చుటయే నావిధి. వారికష్టములను ముందుగా నే ననుభవించెదను." అని జోవు పలికెను.

"కెనడీ, నీవు?"

"ప్రయాణపు కష్టసుఖములు నాకు క్రొత్తవిగావు. ఆపదలకు లక్ష్యపెట్టను. నాశరీరము నీయధీనమందున్నది. నీవు పూనినకార్యమును నెరవేర్చుటయే నామనోనిశ్చయము. వెనుకకు మరలుట కష్టము. మాయందు నమ్మకముంచి ముందంజ వేయవచ్చును." అని కెనడీ నుడివెను.

స్నేహితులారా! మీయుత్సాహవాక్యములు నన్ను పురిగొల్పుచున్నవి. మీస్వభావము నాకు తెలిసినను మీమాటలను వినగోరి నే నిట్లు ప్రశ్నించితిని." అని డాక్టరనెను.

ముప్పురును కరస్పర్శనము గావించుకొనిరి.

"నేను చెప్పునది వినుడు. గినియాగల్ఫు ఇచ్చటికి సుమారు మూడువందలమైళ్ళదూరమందున్నది. ఈయెడారిని దాటినగాని దానిని సమీపింపజాలము. అవైపునకే చనుటకుయత్నించుదము. ఈలోన నేదైన యెడారిలంక (Oasis) దొరకగలదు. అచ్చట నీటిని నింపుకొనవచ్చును. అటువంటి ద్వీపమును చేరుటకు వాయువుకొరకు యత్నించుదము."

"ఓర్పుతో వాయుతరంగముకొరకు నిరీక్షించుటయే మంచిది." అని కెనడీ పలికెను.

పగటిపూట దేశమును వెదకినను చెరువుగాని బావిగాని కాన్పించలేదు. సూర్యకిరణముల వేడిమి మిక్కుటముగనుండెను. నూటముప్పదియైదు ఘనఅడుగుల ఉదజని వ్యయపడినను విమానము పదునైదుమైళ్ళ దూరమైనను జనలేదు. రెండుపైంటుల నీరు దాహమునకై వ్యయపడెను. ఆరాత్రి డాక్టరు నిదురింపలేదు.



# ఇరువదినాల్గవ అధ్యాయము

మరునాడు నిర్మలాకాశమున విమానమైదువందల అడుగులయెత్తున నున్నను చలించుటలేదు.

"మనము యెడారిమధ్య నున్నాము. ప్రకృతిమహిమ నేమని కొనియాడనగును! సమాంతరేఖయందు సూర్యరశ్మి సమముగనున్నను ఒకచోట ఫలవంత ప్రదేశమును, వేరొకచోట నిస్సారమగు యెడారియు నుండుట సృష్టివైచిత్ర్యము గదా!" అని డాక్టరనెను.

"ఎందుచే నిట్లుండవలయును?" అని కెనడీ ప్రశ్నించెను.

"మన మీ సమయమున వేదాంతగోష్ఠిని సల్పుట మంచిది."

"అవును. అందు కిది మంచితరుణమే!"

"తూర్పుదిక్కున మేఘము కాన్పించుచున్నది." అని జోవనెను.

"జోవునుడివినది వాస్తవమే!" అని డాక్టరనెను.

"మేఘములు కనబడుచున్నవా? అయినచో మనకష్టములు గట్టెక్కినవి." అని కెనడీ పలికెను.

"మేఘమే! సుమ్మాటికిని మేఘమే!" అని జోవు కేకలు వేసెను.

దిక్చక్రముపైకి మేఘము లేచుచున్నటుల దూరదర్శిని సాయముచే కానబడెను. కాని ప్రాతఃకాలమున ఎనిమిదగంటలకు కనబడిన మేఘాకృతిపదునొకండుగంటలైనను మారలేదు.

"ఈమేఘమొక్కటియె కాన్పించుచున్నది. ఇది మన కుపకరించదు." అని డాక్టరనెను.

"అవును వాయుతరంగముగాని వర్షముగాని వచ్చువటులలేదు." అని కెనడీ పలికెను.

"మేఘము మనవద్దకు వచ్చుటలేదు. మనమే మేఘమువద్ద కేగినచో?"

"అందుచే మనకు ప్రయోజనమేమి? ఉదజనిని వృథా వ్యయపరచుటయే! అయినను మనము మేఘమువద్ద కేగిన మొదల యేమార్పైనను కలుగగూడదా!"

అని డాక్టరు మరప్రొయ్యిచే నుదజనిని ఉష్ణీకరించెను. అందుచే విమానము 1500 అడుగులయెత్తుననున్న మేఘములో జొరబడినను విమానపువేగము హెచ్చలేదు. అదివరకు గంటకు పదియడుగుల దూరమేగుచున్న విమానము గంటకు పదిన్నరయడుగు లేగుచుండెను. తొందరపడి నీటిని ఖర్చుపెట్టినందుకు ఫెర్గసను విచారించెను.

" కెనడీ, డాక్టరుగారు, ఇది వింతగనున్నది." అని జోవు కేకవేసెను

" ఏమి వింత ? "

" ఇచ్చటనున్నది మన మొక్కరమేగాదు. మనకీర్తిని పంచుకొనుటకై యితరులు కూడ వచ్చుచున్నారు. "

" వీనికి మతి చలించినదా లేక వడగొట్టినదా ? " అని కెనడీ యనెను.

జోవు నిశ్చేష్టుడై నిలబడెను.

" నామాట నిజమగునో కాదో మీరే యిటువైపు చూడుడు ! "

" జోవు నుడివినది వాస్తవమే. శాముయలుగారు! యిటుచూడుడు ! "

" ఓహో యిదియా! సరి." అని డాక్టరనెను.

" ఇంకొక విమానమును అందులో మనవలె ముగ్గురు ప్రయాణీకులును. "

" మంచిది. దానికి సైగలు జేయుదము. బావుటా

నెత్తుము. మన దేశమును తెలియపరచుము. ” అని డాక్టరు నుడివెను.

రెండవవిమానములోని వారల కాతలంపే గలిగి వీరి జండానుబోలిన జండానే యెత్తిరి. వీరు చేయు సైగలనే వారు కూడ జేయుచుండిరి. వీరు వారిని జూచిన వారు వీరినిజూచు చుండిరి. ”

“ వారి యభిప్రాయ మేమి? ” అని వేటకా డడిగెను.

“ వారు వానరులు. మనము నవ్వివ వారు కూడ నవ్వు చున్నారు. ” అని జోవు పలికెను.

“ దానిసత్య మిది. దానిలోనున్నవారము మనమే. ఆవి మానము మనవిమానమే. ” అని డాక్టరు నవ్వెను.

“ మీారు చెప్పునది సందర్భముగా లేదు. ” అని జో వనెను.

“ తొట్టిఅంచుమీాద కెక్కి నీచేతిని ఆడించుము. నీకే తెలియగలదు.” జోవట్లొనరింప రెండవవిమానములోనివాడు కూడ నట్లే చేసెను.

“ దీనినే ఎండమావు లందురు. వాయుతారతమ్య గరిమ తగ్గుటచే వాయువే అద్దమువలె ప్రతిబింబించుచుండెను.” అని డాక్టరు నుడివెను.

“ ఎంతవింతగ నున్నది! ” అని జోవు తనకు తానే వెక్కిరించుకొనెను.

"కన్నుల పండువుగ నున్నదే! విమాన మెంత చక్క గా కాన్పించుచున్నది." అని కెనడీ పలికెను.

"కొంత సేపటికి ప్రతిబింబ మదృశ్యమై మేఘములు విమానమును వీడి పైకేగెను. ఒకగంటలో మేఘము లదృశ్య మై గాలి వేగము క్షీణించెను. వైమానికులు విచారసాగర మందు మునిగియుండ దాహము హెచ్చుచుండెను. సాయం కాలమునకు జోవు రెండు కొబ్బరిచెట్లను జూచెను.

"చెట్లున్నచో నీరు దొరకును." అని డాక్టరు జోవు నుడివినదానిని దూరదర్శనిచే నిర్ధారణ జేసెను.

"అట్లైనచో నీటిని కొంచెము త్రాగవచ్చునా? దాహము మిక్కుటముగ నున్నది." అని జో వడిగెను.

డాక్టరనుజ్ఞనీయఁ కాయును పే పైంటునీరు నాతడు త్రాగెను. మిగిలిన నీరు మూడున్నర పైంటులుమాత్రమే.

"ఇప్పుడు నాప్రాణము కుదుటబడినది. బ్రాందీ మొదలగు నేపానీయము నిట్టి సుఖము నీయజాలదు."

"ఆకలి రుచి యెరుగదు. నిద్ర సౌఖ్య మెరుగదు." అని డాక్టరనెను.

"ఇంకొక గ్లాసునీటిని త్రాగియుందును గాని తిరిగి కావలసినయెడల నీయరని యూరకొంటిని."

సాయంకాల మూడుగంటలకు విమానము చెట్లపై నెగు

రుచుండెను. సగమువరకు ఎండియున్న కొబ్బరిచెట్లుమాత్రము రెండు కనబడెను. ఆచెట్లయొద్ద పాడుబావి యొండు కానవచ్చె. అచ్చటి రాళ్ళు ప్రకృతిచే మార్పుజెంది పిండియగుచుండెను. బావిచుట్టును కనుమేరవరకు నెనుకల గుట్టలు కానబడెను. అచ్చటికి ఒంటెలదండొకటి వచ్చి దాహముచే చనిపోయెను. వైమానికులు భయభ్రాంతులైరి.

" మనము దిగవలదు. ఈ భయంకరప్రదేశమును చూడజాలము. ఇచ్చట త్రాగుట కొక్క నీటిచుక్కయైన దొరకదు. " అని వేటకాడనెను.

" అట్లు కాదు, దిగి చూడవలెను. మన మీరాత్రి యిచ్చటనే గడపవలెను. "

విమానము భూమిని సమీపించెను. కెనడీ జోవులు తమ భారమునకు సరియగు భారమును తొట్టిలో నుంచిరి. బావివద్దకు పరుగిడి బావిలో దిగి చూచిరిగాని నీటి తడియైన కాన్పించలేదు. నిరాశతో నేతెంచు వారిద్దరి ముఖవర్చస్సును ఫెర్గుసను చూచెను. జోవు నిరాశచే జనించిన కోపముచే తొలుసీసాను పారవైచెను. సాయంకాల భోజనము ముగిసెను.

# ఇరువదియైదవ అధ్యాయము.

గతదినమున విమానము పదిమైళ్ళదూర మేగెను. 162 ఘనయడుగుల ఉదజని వ్యయపడెను. శనివారము ప్రాతఃకాలముననే బయలుదేరుటకు వైమానికులు సిద్ధపడిరి.

"మరప్రొయ్యి ఆరుగంటలకాలముమాత్రము పనిచేయును. ఆలోన మనకు బావిగాని సెలయేరుగాని దొరకనిచో మనగతి యేమగునో తెలియదు." అని డాక్టరనెను.

"ఉదయమున సన్ననిగాలి వీచుచుండెను. అది పైకేగియుండును." అని నిరాశజెందిన పెర్గుసనుతో జోపు పలికెను.

వాయుతరంగములేని సముద్రమందలి యోడభాతి విజయలక్ష్మి యీయెడారి సంద్రమున వాయుతరంగము దొరకక నిలబడియుండెను. ఉష్ణమాపకము 113 అంశల వేడిని తెలియజేయుచుండెను. కెనడీజోపులు నిదురింప ప్రయత్నించినను నిద్రాదేవత వారిని జేరదయ్యె. ఆలోచనానిమగ్నమైన మానసమునకు బాహ్యోపచారములచే శాంతికలుగదు. దాహబాధ హెచ్చుచుండెను. బ్రాంది వారిదాహబాధను వృద్ధిజేయుచున్నదేగాని తగ్గించుటలేదు. మిగిలిన రెండుపైంటుల వేడినీరు ఆ యెడారియందు చాలునా?

"విమానమును మేఘములలోనికి గొనిపోవుటకు వ్యయపరచిన రెండుగ్యాలనుల నీరున్నచో వారిని తొమ్మిదిరోజుల వరకు కాపాడెడిది. తొమ్మిదిరోజులలో నెట్టిమార్పులు కలుగు

నో కదా!" అని ఫెర్గుసను విచారించెను.

కొంతకాలము యోచించి "కడసారిప్రయత్న మొండు జేసెదను. వాయుతరంగమును వెదకుటకై మిగిలిననీటిని వ్యయపరచెదను." అని తనలో ననుకొనెను.

తన చెలికాండ్రిద్దరు నిదురించుచుండ మరపొయ్యిని వెలిగించి ఉదజనినుష్ణీకరించి విమానము నూర్ధ్వముఖముగా గొనిపోయెను. నూరడుగులనుండి అయిదుమైళ్ళవర కేగినను వాయుతరంగము దొరకలేదు. శేషించిన జలము వ్యయపడెను. మరపొయ్యి ఆరిపోయెను. విద్యుద్యంత్రముల పనిచేయుట లేదు. ఉదజని వేడిమి తగ్గుటచే విమానము బయలుదేరినచోటునకే దిగెను. విమానమున్నచోటు ధ్రువరేఖలోని 19 వ కళయందలి 35 వ వికళలోను, అక్షరేఖలోని 6 వ కళయందలి 1 వ వికళలోను నెలకొనియుండెను. అచ్చటి చాడుసరస్సు అయిదువందలమైళ్ళదూరమందున్నది. తొట్టి భూమిని తాకుటచే కెనడీజోప్రులు లేచిరి.

"విమానము జనులలేదా?"

"లేదు. విమానము కదలుటలేదు." అని డాక్టరనెను.

బిస్కట్లు పెమ్మికనుమాత్రమే సాయంకాలపుభోజనమునందుపయోగపడెను. గ్రుక్కెడు వేడినీరము త్రాగి వారు భోజనమును ముగించిరి. రాత్రికాలమున విమానసంరక్షణకై మేల్కొనవలసిన యాగత్యము లేకున్నను వైమాని

కులకు నిమరరాలేదు. మరుచటిదినమున కరఫైంటునీరము మాత్రము మిగిలెను. ప్రాణాపాయసమయమునసే ఆనీటి నుప యోగించనెంచిరి.

"వేడిచే నా దేహము మండుచున్నది." అని జోవ నెను.

"అది వింతగాదు. ఉష్ణమాపకమందు 140 అంశల వేడి మి కనబడుచున్నది." అని డాక్టరనెను.

"భయపడవలదు. ఇంతవేడిమి వర్షమునకు హేతువు. ఆకాశ మెట్లున్నను గంటలో మార్పును జెందగలదు." అని తిరిగి డాక్టరనెను.

"అట్టిసూచనలు లేవే!"

"భారమాపకములోని పాదరసము తగ్గుచున్నది."

"రెక్కలుతెగిన పక్షులవలె భూమి నంటుకొనియున్న మన కిది శుభసూచకమే."

"స్వల్పవాయుతరంగ మొకటి దొరకినను చాలును. దానిసాయముచే నీరున్నప్రదేశమున కేగనగును. దాహమను పెనుభూతము మనల నావేశించి యున్నది." అని జోవు పలి కెను.

కమ్మరపుకొలిమిలోనుండి వెలువడు వేడిగాలివలె నున్న యామెడారిలోని వాతావరణము వైమానికుల కసహ నముగ నుండెను. రాత్రికాల మాసన్నమగుటచే కొంతదూర

ము నడచినచో మెదడునకు విశ్రాంతికలుగు నని యెంచి ఫెర్గు సను తన సహచరులను రమ్మని బలవంతపరచెను.

"నేను ఒక్కడుగైన నిడజాలను." అని కెనడీ పలికెను.

"నేను నిద్రించెదను" అని జో వచెను.

"మనము విచారముతో నిదురించుట మంచిది గాదు." అని ఫెర్గుసను చెప్పినను వారు వినరైరి.

అందుచే ఫెర్గుసను ఒంటరిగ బయలుదేరెను. అయిను కసెడారియందు నక్షత్రకాంతిచే చాలదూరము జనినందున ఫెర్గుసనునకు తలతిరిగి కండ్లు చీకట్లు గ్రమ్మెను. తిరిగి విమానము జేరలేక కేకలువేసి యచటనే పడుండెను. రాత్రి రెండుఝాము లకు కండ్లువిప్పిచూడ ఫెర్గుసను జోవుచేతులలో నుండెను. తన యజమానుడు తిరిగిరానందున జోవు ఫెర్గుసను చనిన మార్గము నజని నిదురించు యజమానునితల తనతొడపై నిడి కూర్చుని యుండెను.

"మీ దేహమందున్న రుగ్మత యేమి?"

"నీరసము."

"నామీద ఆనుకొనుడు. విమానమును జేరుదము."

వారిద్దరట్లు విమానాభిముఖులై చనుచుండ జోవు,

"ఇంతదూరము మీరొంటరిగ వచ్చుట న్యాయమా? ప్రాణముపోయిన దిక్కెవ్వరు? మన మిట్లెన్నాళ్ళుండవలయును? రెండు మూడురోజులలో వాయుతరంగము దొరకనిచో మన

ము మరణించుట నిజము" అని పలికెను.

డాక్టరు జవాబీయలేదు.

"మనలో నొకరు నీటిని వెదకవలయును. ఆపనిని నేను చేయుదును."

"నీ వేమి చేయుదువు ?"

"నేను కొంతభోజనసామగ్రిని గైకొని కాలినడకను బోయెదను. కొన్నిరోజులలో పచ్చికబయలు కనబడును. ఈలోన మీకు గాలిదొరకినచో నాకొరకై నిరీక్షింపవలదు. నేను యే గ్రామమైన జేరి జీవించెదను. నాకు కొన్ని అరబ్బీమాటలను వ్రాసియుంచు. వీలున్నచో నీరమును కొనివచ్చి మీకు సాయము జేయుదును. లేనిచో నాయాశను వీడుడు."

"నీతలంపువలన కించిత్ప్రయోజనమైన లేదు. నీవు మమ్ముల నిడకూడదు."

"వ్యర్థముగ నిచ్చట కూర్చొనిన లాభ మేమి ?"

"వద్దు. సహాయము త్వరలో దొరకును. కొంచెమోపి మిలో నుండవలెను."

"సరే. మీకు ఒకరోజు గడువొసగెదను. నేడు ఆది వారము. కాదు. రాత్రి ఒంటిగంటయగుటచే సోమవార మనిన మంచిది. మంగళవారమునాడైన మనకు సహాయము దొరకనిచో నేను మిమ్ములను వీడుట నిశ్చయము."

వారిద్దరు విమానమును జేరిరి. ఫెర్గుసను శయనించి యున్న కెనడీయొద్ద కూర్చొనెను.

---

# ఇరువదియారవ అధ్యాయము

తెల్లవారినపిదప భారమాపకమును జూడ పాదరసము తగ్గలేదు. వేడిమి తగ్గలేదు. వాతావరణము నిర్మలమైయుండెను.

" మనకు విముక్తిలేదా ? " అని డాక్టరనెను.

విచారముతోనున్న జోవునకు దాహము మెండగుచుండెను. నోటియందును పెదవులందును తడిలేదు. శేషించిన నీరమును వ్యయపరచుటకు భయపడుచుండెను. కెనడీ పిచ్చివానివలె తిరిగివరుండెను. జోవునకు మతిచలింప యిసుకమైదానియే మంచినీటిసముద్రమని త్రాగయత్నింప నిసుకరేణువులు పెదవుల కంటుకొనుటచే,

" ఛీ, యిది ఉప్పనీరు. " అని అనుకొనెను.

కెనడీ ఫెర్గుసనులు శయనించియుండ జోవు నీటిసీసావద్దకేగి కొంచెము నీటిని త్రాగి, మిగిలిననీటిని కెనడీకొసగెను.

కెనడీ మిగిలిననీటిని త్రాగి నిదురించెను. ఆనాడందరును నిదురించిరి.

మంగళవారమునాడుదయమున జోవు లేచుటకు శక్తిలేక లేవజాలకపోయెను. ఫెర్గుసను కూర్చొని నేమివెవునో చూచుచుండెను. కెనడీ తల నటునిటు త్రిప్పి తుపాకినిగైకొని తననోటికి గురిచూచుకొనుచుండెను.

" అయ్యో, కెనడీ ! " అని జోవు కేకవేసి కెనడీని పట్టుకొనెను.

"దూరముగ నుండుము. లేనిచో నిన్ను కాల్చివేయుదును."

కాని జోవు కెనడీని విడువనందున వారిద్దరును పెనగులాడుచుండ మీటు కదలి తుపాకి పేలెను. కాని దెబ్బయెవరికిని తగులలేదు.

"ఆవైపున చూడుము!" అని ఫెర్గుసను కేకవేసెను.

ఆ కేక వినినతోడనే కెనడీజోవులు ద్వంద్వయుద్ధమును మాని ఫెర్గుసను నిరూపించిన వైపునకు జూచిరి. యెడారి నడచివచ్చుచున్నటులుండెను. ఇసుకరేణువులచే సూర్యకిరణములు కాన్పించుటలేదు. డాక్టరునకు సంతోషము కలిగెను.

"సైమూన్ (Simoon)" అని డాక్టరనెను.

"సైమూనా!" అని కెనడీ జోవులనిరి.

"మంచిదే. ఇది మనకనాయాసమరణ మొసగును."

"భయపడవలదు. మనలనిది రక్షించును." అని ఫెర్గుసను స్థిరత్వభారమును పారవేయుచుండ కెనడీ జోవులుకూడ సాయమొనర్చుచుండిరి

"జోవు, సంశయింపక స్వర్ణశిలలను పారవేయుము

ఈసారి స్వర్ణరాశిని పారవేయుటలో జోవు వెనుకంజ వేయలేదు. భారము తగ్గుటచే విమానము పైకేగెను. ఇసుక తుపాను మెరపువలె వచ్చెను. కొంచమాలస్యమైనచో విమానము ఇసుకలో స్థాపితమై యుండెడిది. పెనుగాలిచే విమా

నము శరవేగమున జనుచుండెను. వైమానికుల శరీరములు చల్లబడ నిశ్శబ్దముగ వీక్షించుచుండిరి. సాయంకాలము మూడు గంటలకు తుపాను శాంతించెను. ఎడారిలో ఇసుక గుట్ట లేర్ప డెను. ఆకాశము నిర్మలమైయుండ విమాన మొక యెడారిలంక పై నాగెను. ఎడారిలోని యీజలస్థానములు ప్రయాణీకులకు శరణ్య మగుచుండును.

"నీరుకల దిచ్చోట." అని డాక్టరు పలికెను.

విమానపు వల్వమును తెరచుటచే నుదజని వెలువడి విమానము క్రిందకు దిగెను. స్థిరత్వభారమునకై యిసుకను తొట్టిలోనుంచి కెనడీ జోవులు క్రిందకు దిగిరి. నాలుగు గంట లలో విమానము 240 మైళ్ళదూర మేగెను.

"తుపాకులను గొనిపొండు." అని డాక్టరు హెచ్చ రించెను.

కెనడీ జోవులు తుపాకులను గైకొని చెట్లవైపు జను చుండ సింహగర్జనము వినబడెను.

"అది సింహగర్జనము." అని జోవనెను.

"వేట యన నాకు విందే!"

"జాగ్రత్త. మాప్రాణములు నీమీద ఆధారపడి యున్నవి."

పులిమీద పుట్రవచ్చెనన్నట్లు దాహబాధచే మరణి

చుటకు సిద్ధమైయుండినవారు సింహపువాత బడవలసియుం డెనా !

కెనడీ భయపడక తుపాకిలో మందును దట్టించి ముందు కునడుచ కొబ్బరిచెట్లక్రింద కూర్చొనియున్న నీలకేసరములు గల ఆఫ్రికాదేశపు సింహము వేటగానిమీదికి దుమికెను. అది యెగిరి కెనడీమీద పడుటకు ముందే దెబ్బతిని క్రిందపడి మృతినొందెను.

"ఆహా! ఎంత భయంకర మృగము? " అని జోవు విస్మయ మందెను.

కెనడీ నూతివద్దకు పరుగిడి మెట్లమీదుగా నీటిలోనికి జారి మునిగెను. జోవుకూడ నట్లే చేసెను. ఇరువురును కడుపునిండ నీరమును గ్రోలిరి.

"కెనడీ, నీటిని యెక్కువగా త్రాగవద్దు. కడుపుబ్బును." అని జోవు పలికెను.

కెనడీ జోవుపలుకులను లక్ష్యపెట్టక త్రాగుచుండెను.

"ఫెర్గుసనుగారూ!" అని జోవు కేకవేసెను.

కెనడీ జోవుకేకలు వినకయే నీటినిత్రాగుట మానెను. వారి వెంట గొనిపోయిన పీపాను నీటితో నింపి బయట కరుదెంచుచుండ వారిదారి నీడచే చీకటిక్రమ్మెను. జోవుకెనడీలు ఆగిరి.

"మన మడ్డగింపబడితిమి."

"అట్లైనను టికిని కాజాలదు. ఎందువలన?" అని కెనడీ ప

లుకుచుండ గర్జనము వినవచ్చె.

"ఇంకొకసింహ మిది." అని కెనడీ మందును దట్టించి కాల్చెనుగాని సింహము తప్పించుకొనెను.

"ఇప్పుడు పోవచ్చును."

"వద్దు. ఆమృగము వేచియుండి మనము కనబడినవెంటనే మీాదికి దుముకును."

"అట్లయినచో మనము చేయున దేమి? యజమానునికి నీరుకావలయునుగదా!"

" మృగమును మనసమీాపమునకు రప్పింతము. నీతుపాకిని నా కిచ్చి నాతుపాకిలో మందుకూరుము."

" ఏమిచేయుదువు? "

" నీవే చూచెదవుగాక. "

కూరినతుపాకిని కెనడీ [illegible]కొని,

" జోవు, నీకోటును తీసి తుపాకికొనకు తగిలించి పైకెత్తుము. అందుచే పైకివచ్చుచున్నా రని భ్రమించి కోటుపైకి దుముకును. "

జోవు తుపాకితో కోటును పైకెత్త సింహము కోటుపైకి దుమికినవెంటనే కెనడీ గుఱిచూచి కాల్చెను. దెబ్బతిని మెట్ల మీాదుగా నీటిలోనికి జారెను. సింహపుత్రోపుచే జోవుకూడ నీట జారియే యుండెడివాడు, కాని కెనడీచేయూత దొరకుటచే

నాగెను. ఆసమయమున ఫెర్గసను ప్రత్యక్షమాయెను. జోవు నీటిసీసాను యజమానుని కొసగగా నతడు తనివిదీర గ్రోలెను. వైమానికులకును విమానమునకును దాహశాంతి జరిగెను.

---

# ఇరువదియేడవ అధ్యాయము

భానుడు పశ్చిమాంబుధిని గ్రుంకుచుండ నచ్చటనున్న కొలది విహంగములు కలకలారావములు చేయుచుండెను. వైమానికులు సాయంకాలపుభోజనమును చెట్లనీడ నారగించిరి. బ్రాందిని కడుపార గ్రోలిరి. ఆలంకచుట్టుపట్టులగల పొదలను చెట్లగుంపుల నన్నిటిని కెనడీ పరీకించెను. వన్యమృగముల బాధతొలగుటచే వైమానికులు హాయిగ నిదురించిరి. నాటికష్టము లంతటితో నంతమొందెను. మరునాడు మే నెల 7వ తేదీ. సూర్యుడు చెట్లసందులనుండి పాంథుల వేధింప యత్నించుచుండెనుగాని చెట్లుదట్టముగ నుండుటచే సూర్యకిరణములు జొరలేకుండెను. భోజనసామగ్రికి లోటులేనందున మంచివాయుతరంగము దొరకునంతవరకు యిచ్చటనే యుండుటకు వారు స్థిరపరచుకొనిరి.

జోవు మరప్రొయ్యిని కొనివచ్చి వంటజేసెను. నీటి నమితముగ నుపయోగించుచుండిరి.

“ ఆహా! తలవని తలంపుగా కష్టములను సుఖములెట్లు

వెంబడించును! దప్పికచే చనిపోవ సిద్ధపడిన మన కింత జలము దొరకినదే! ”

“ ఈనీటిని చూడ నాకు పిచ్చియెత్తుచున్నది. ” అని కెనడీ పలికెను.

“ అవును. నీవు చేయబూనిన కార్యమును జోవు వారింపనిచో మనుజుల కష్టసుఖములను గురించి పరలోకమున చక్కసి ఉపన్యాస మొనగియుందువు. ” అని డాక్టరనెను.

“ నీవు మంచిపనిజేసితివి. ” అని కెనడీ తనచేతిని జోవునకు చూపించెను.

“ నీకు నీలు దొరకనిచ్చినచో నన్ను వేయిరెట్లు బాధపెట్టియుందువు. ”

“ భుజింపకుండ కొన్ని దినములుండవచ్చును గాని నీరు లేక జీవింపజాలరు. ” అని ఫెర్గుసను వారివాదమును మార్చెను.

“ కొన్ని వేళలందు క్షుద్బాధ కోర్వజాలక జనులు జనులనే భుజింతురు.” అని కెనడీ నుడివెను.

ఆదినము సౌఖ్యముగ గడచెను. వైమానికులకు ధైర్యసాహసములు వృద్ధియైనవి. ఫెర్గుస నాయెడారిద్వీపమును తన పొత్తమున లిఖించెను. ధృవరేఖలోని 15వ కళయందలి 43వ వికళయందును, అక్షాంశరేఖలోని 8 వ కళయందలి 32 వ వికళలోను ఆయెడారిలంక నెలకొని యుండెను.

"సింహములమాట మరచితిరా?"

"లేదు. అవి యిచ్చటనుండుటచే సారవంతప్రదేశ మిచ్చటికి సమీపమందే గలదు." అని కెనడీ పలికెను.

"ఈమృగములు ఆహారార్థమై పెక్కుమై లేగుచుం డును. ఈరాత్రి మంటవేసికొని భద్రముగ నుండవలెను."

"అవసరమైనచో నట్లే చేసెదను."

"ఈస్థానము బాటసారులకు తెలియునా?"

"తెలిసియే యుండును. వర్తకులకిదివిశ్రాంతిస్థానము."

"న్యాంన్యాంతెగవా రిచ్చట గలరా?"

"ఉన్నారు. వీరందరి కదే పేరు. వీరి నడతలు కూడ నట్లే యుండును."

"ఫ్రెంచి మతబోధకునికై మనతో బేరమాడరుగద!" అని జో వనెను.

ఆరాత్రి వంతులప్రకారము వైమానికులునిదురించిరి.

మరునాడు గాలి మారలేదు. విమానము కదలక నిల బడి యుండెను. వా రెన్నిరోజు లచ టుండగలరు? భోజనసా మగ్రిలు వ్యయపడుచుండెను. భారమాపకములోని పాద రసము తగ్గుటచే వాతావరణమందు మార్పుకలుగునని తలంచి బయలుదేరుటకు సిద్ధపడిరి. స్థిరత్వభారమును తగ్గించి నీటిని పూరించుకొనవలెను.

"జోవు, నీకు నీరుకావలెనా? బంగారము కావలెనా?" అని డాక్టరడుగ జోవు బదులుచెప్పక పెద్దరాతిని పారవైచెను.

"ఈయెడారిలంకను జేరు పాంథులీ స్వర్ణశిలను జూచి యపరిమితానందభరితు లగుదురు. కొన్నిసంవత్సరములలో యెడారిమధ్య స్వర్ణశిల దొరకిన దని చెప్పుకొనుటను మనమే వినగలము."

"శాస్త్రకారు డెవరైన వచ్చి యీశిలను జూచి యాశ్చర్యపడి ఈ లంకను పటములో వ్రాసి ప్రచురించును."

"అందుకు జోవే కారకుడు."

జోవున కానందము హెచ్చెను. వేసవి 149 అంశము లున్నను వైమానికులకు సోకుటలేదు. సాయంకాలము మూడుగంటలకు ఉష్ణము తగ్గి గగనభాగము మేఘావృత మగుచుండెను. రాత్రికాల మాసన్నమగుచుండుటచే చీకటులు క్రమ్ముచుండెను.

"గాలివచ్చినది లెండు." అని జోవు తన స్నేహితులను లేపెను.

"తుపాను పట్టినది, తొట్టిలోని కెక్కుడు."

విమానము తుపానుచే లాగబడుచుండ జోవు పరుగిడి విమానము నాపెను. డాక్టరు తొట్టిలోని కేగ మరప్రొయ్యిని వెలిగించెను. కెనడీజోవులుకూడ తొట్టిలోని కేగిరి. కొంతిస్థిరత్వాభారమును పారవేయ విమానము రెండువందల అడుగుల యెత్తున కేగెను. తమప్రాణములను కాపాడిన యెడారిలంకవైపు వైమానికులు కడసారిచూచిరి.

---

# ఇరువదియొనిమిదవ అధ్యాయము.

"మ॥ గిరు లేనుంగులుబోలు వార్ధు లమరుం గ్రీడాసరంబుల్బలెం
దరుపుల్ నాచనుబోలు బావటలచందం బూనెదుఃగా వాహినుల్
వరసౌధంబులు బిందుల ట్లమరెదుఃగా బ్రిచ్ఛన్ననిమ్నస్థలం
బరయఃగా భూమి కనంబడు న్ఖగమహాయత్యంతసంక్షిప్తమై."

—అవిమారకము.

విమానము రయమున జనుచుండ యెడారిని దాటు చుండుటచే వైమానికులకు సంతసమొదవెను. ఉదయము తో ద్దిగంతలకు చిన్నచిన్న మొక్కలు కానవచ్చెను. దూర మున కొన్ని పర్వతములు కానవచ్చె.

"చెట్లు కనబడుచున్నవి." అని ఫెర్గుసను నుడివెను.

ఒకగంటకాలములో విమానము చెట్లను సమీపించెను.

"ఇది నాగరకతగల దేశమా?" అని కెనడీ ప్రశ్నిం చెను.

"ఇదికూడ నీగ్రోల దేశమే. రాబోవునది అరబ్బుల దేశము."

"అరబ్బుల దేశమైనచో ఒంటె లుండునా?" అని జో వ డిగెను.

"ఒంటె లీ దేశమున లేవు గాని ఉత్తర దేశమున గలవు."

"అట్లయినచో మన కుపకరించవు."

"ఎందు చేత?"

“ మనకు వాయుతరంగము దొరకనిచో విమానమును ఒంటెలకు గట్టి పరుగెత్తించవచ్చును. ”

దిగువ నర స్సొందు కానబడెను. సారవంతములగు లోయలతోను ఫలవృక్షతరుగుల్మాదులతోను కూడిన పర్వతములానరస్సును నావరించియుండెను.

“ ఈదేశము మనోహరముగ నున్నది.” అని డాక్టరనెను.

“ ఇచ్చట మృగములు విస్తారముగ నున్నవి. ” అని జోవు పలికెను.

“ ఎంత గొప్ప యేనుగులు? ఒక తుపాకిగుండును వదలగూడదా? ” అని కెనడీ అడిగెను.

“ ఈవేగమున నాగుటకష్టము. శాంతించిన తరుణము దొరకగలదు.”

వేటగానికి మంచి దేశము. అడవియెద్దు? వానినిమించిన పచ్చిక బయుళ్ళలో మేయుచుండెను. బూడిదరంగుగల గజములు అరణ్యములందు సంచరించు చుండెను. నీటియేనుగులు నదీప్రవాహములలో నీదులాడుచుండెను. జంతుప్రదర్శనారామమువలె నున్న ‘ఏడమూవా’ దేశమందు ప్రవేశించినటుల ఫెర్గుసను తనపొత్తమున లిఖించెను.

“ మనము ప్రవేశించినది క్రొత్తదేశము. ఏపరిశోధకు లీ దేశము నింతవరకును జూడలేదు. బర్టనుస్పెకీగార్ల పరిశోధనలతో

బార్తుపరిశోధనలను జేర్చుచున్నాము." అని డాక్టరనెను.

"మనము దాటుచున్న దేశమును జూడ వారిద్దరు తిరిగి చూచిన దేశములమధ్య గొప్పదేశ మున్నటుల తోచుచున్నది." అని కెనడీ నుడివెను.

"ఈమధ్యదేశమును గొలుచుట సులభమే. ధ్రువరేఖ యందలి ఏకళయందు ఉకెరూ సరస్సు కలదో చూడుము."

"అది 37 వ కళయం దున్నది."

"సాయంకాలమునకు బార్తు చూచిన జోలాపట్టణ మును జూడగలము. అది ఎన్నవకళయం దున్నది?"

"12 వ కళయం దున్నది."

"రెంటికిని గలతేడా 25 కళలు. కళఒక్కింటికి 60 మైళ్ళచొప్పున లెక్కించినచో 1500 మైళ్ళదూరము గలదు."

"నడచుటకు చాలదగ్గరే!" అని జో వనెను.

"కాలినడకను జనుటకు కొందరు యత్నించుచున్నారు. మనలను వాయువు పశ్చిమదిశగా కొనిపోవుచున్నది. కాని మనము ఉత్తరదిశగా జనవలెను."

పంచ్రెండు గంటలలో విమానము నైజరుదేశపుసరిహద్దు లోనికి ప్రవేశించెను. అలాంటికాపర్వతశిఖరములు కనుల కట్టెదుట గోచరించుచుండెను. ఆశిఖరములఔన్నత్యము రేండు వేల అయిదువందల అడుగులు. వా రొకనదిని సమీపించిరి.

"ధైర్యవంతుడైన సేనానియొక్క డానది పై జోలా పట్ట ణమువరకు జనెను."

బానిసలు పొలములలో సేద్యము చేయుచుండిరి. సగ్గు చెట్లు మిక్కుటముగ గలవు. విమానము తోకచుక్కవలె కానబడుటచే బానిసలు వెరగొంది కేకలు వేయసాగిరి. సాయంకాలమునకు విమానము జోలాపట్టణమును జేరెను. జోలా పట్టణమునకు నలుబదిమైళ్ళ దూరమందు గల వృక్షములలో నొకదానికి విమానములంగరు వేయబడెను. పెనుగాలి వీచుచుండుటచే ఫెర్గుసను నిదురింపక విమానమును జూచుచుండెను. రెండుసార్లు లంగరుత్రాటిని కోయ యత్నించెను. మరునాడు వాయువేగము మందీభవించినను జోలాపట్టణము దాటబడెను.

కెనడీ వేటతమకముచే క్రొత్తమాంసము కావలెనని జోవుచే ఫెర్గుసనునకు చెప్పించెను. ఆదేశీయులు శత్రుభావమును జూపుటచేతను తుపాకిదెబ్బలు వినబడుటచేతను కెనడీని దిగగూడదని ఫెర్గుసను వారించెను. గాలిచే విమాన మీశాన్యమూలగా గొనిపోబడుచుండెను. మిండిఫ్ పర్వతశిఖరములు మేఘములచే నావరింపబడియుండెను. సాయంకాలము మూడు గంటలకు వైమానికులు మిండిఫ్ పర్వత శిఖరములను సమీపించిరి. వాటిని దాటుటకై ఉదజనిని 180 అంశలవర కుష్ణీకరింప పదునారువందల పౌనుల ఉత్ప్లవనశక్తి కలిగి విమానము ఎనిమిదివేల అడుగుల యెత్తున కేగెను. ఆయున్నతప్రదేశ

మున శైత్యము హెచ్చుగనుండుటచే వైమానికులు కంబళ్ళను గప్పుకొనిరి. వాయుపీడన తగ్గుటచే విమానమునకు మఱింత ఉత్ప్లవనశక్తి కలిగెను.

మిండిఫ్ పర్వతమందలి అగ్నికుండములను వైమానికులు చూచిరి. ఆపర్వతపార్శ్వములు పక్షిరెట్టలతో శ్వేతవర్ణమును దాల్చియుండెను. సాయంకాల మైదుగంటలకు పర్వతము దాటబడెను. విమానమును దించి లంగరుచే బంధించి కెనడీ దిగి కొన్నిపక్షులను వేటాడి తెచ్చెను. పక్షిమాంసమును జోవు పచనముజేయ వైమానికులు ముప్పురును భుజించి, వంతుల ప్రకారము నిదురించిరి.

---

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

మరుచటిదినము ప్రాతఃకాలమున వాయుతరంగ మొందు విమానము నుత్తరదిశగా గొనిపోవుచుండెను. జాము ప్రొద్దెక్కుసమయమున విమానము మోస్ఫియా పట్టణమును జేరెను. ఆపట్టణము రెండుకొండలమధ్య నున్న ఉన్నతప్రదేశమున కట్టబడి ఒకవైపున మహారణ్యముచేతను, రెండవవైపున యూబిచేతను నాక్రమింపబడి యుండి సన్నని బాటచే బాహ్యప్రపంచముతో జేరియుండెను. ఆసమయమున నా

దేశపురాజు పరివారముతో గుఱ్ఱముల నధిరోహించి ముందు బ్యాండువాద్యము నడువ మోస్కియాపట్టణమును ప్రవేశించు చుండెను. బాటకొరకు పరిజనులు చెట్లకొమ్మలను విరచి దారి చేయుచుండిరి. వారిని చూచుటకై ఫెర్గుసను విమానమును క్రిందకు దింపెను. విమానము దిగుచుండ రాజు, పరివారము భయపడి గుఱ్ఱములను పరుగెత్తించుచుండిరి. జోకు భయ పడక తనవద్దనున్న తుపాకినిండ మందును దట్టించి నిలబడి చూచుచుండెను. విమానమును నూటయేబది యడుగులవరకు గొనిపోయి ఫెర్గుసను అరబ్బీభాషలో గట్టిగా మాట్లాడెను. ఆమాటలను విని జోకు గుఱ్ఱమునుండి దిగి భూమిపై సాష్టాంగ దండప్రణామం బాచరించి విమాన మచ్చోటును వీడువర కును లేవలేదు.

"ఈదేశీయులు మనలను దేవతలుగ పూజింతురు. వారి మూఢవిశ్వాసమును త్రిప్పుట కష్టము. తన పరివార ముతో నీసంగతి జోకు అతిశయోక్తిగా మాట్లాడును." అని డాక్టరనెను.

"నీగ్రోలు మూఢవిశ్వాసముగలవారైనను వారిని మోసగించుట నాగరకులకు న్యాయమా ?" అని కెనడీ ప్రశ్నించెను.

"నీవు చెప్పునది నిజమే. కాని వారికి విమాననిర్మా

ంకము బోధపరచుట కష్టము. విమానములను దేవతలవాహా
నము లనియే భావింతురు."

"మొదట యీ దేశమున కేతెంచిన ఐరోపాదేశీయు
డెవడు ?" అని జోవు ప్రశ్నించెను.

"ప్రథమమున వచ్చినవాడు డెన్హాము. అతడు తిరిగిన
దారినే మనముగూడ జనుచున్నాము."

"ఈ డెన్హా మెవరు?"

"బోర్ను దేశమును జూచుటకై క్లాపర్టన్, డాక్టర్ అవు
డ్నీ లనువారలతో జనెను. ఔడ్నీ ప్రయాణవుబడలికచే జని
పోవ డెన్హాము క్రొత్తదేశములను జూచెను. ఓజ లను శాస్త్ర
కారుడు 1856 వ సం॥న వాడై దేశములోనికి జని తిరిగి రాన్వెం
చలేదు. వాడై దేశములో ఖైదీగానుండెనను ప్రతీతిగలదు.
వానిని వెదకుటకై డిహుబ్లిన్ అనువాడు బయలుదేరుచుం
డెను. వానిచర్యలు ముందు తెలియగలవు." అని డాక్టరు
నుడివెను.

మోస్కియా దృష్టిపథముననుండి యదృశ్యమై తిరుగు
ల్మాదులతో నిండిన మందరా దేశము సమీపించుచుండెను.
పొలములన్నియును ప్రత్తినీలిపైరులచే నిండియుండెను. షారీ
నది యెనుబదినాలుగుమైళ్లదూరమం దున్న చాడుసరస్సులో
నికి ప్రవహించుచుండెను.

"ఈ దేశము ఐరోపాదేశీయులకు శ్మశానవాటిక యన
దగును."

చిన్న తొట్టిపడవలు పారీనదిమీద జనుచుండెను. పడవవాండ్రు విమానమును జూచిరి. గాలి తగ్గెను.

"గాలికొరకు తిరిగి నిరీక్షించవలెనా?" అని డాక్టరనెను.

"ఎడారియందుగల నీటిబాధలేదు."

"ఈదేశీయు లంతకన్న భయంకరులు."

"ఏదియో పట్టణము కాన్పించుచున్నది."

"దానినే కైర్వాకు అందురు. గాలి మనల నాపట్టణము మీదుగా గొనిపోవుచున్నది. మనము దానిపటమును వ్రాయవగును."

"ఆపట్టణమును సమీపించగూడదా?" అని కెనడీయడిగెను.

"సమీపించవచ్చును." మరప్రాంత్య నార్ప విమానము పట్టణమునకు రెండువందలడుగులవరకు జనెను.

"కరగ్రిసుత్తెల దెబ్బలు వినబడుచున్నవి. ఏమైయుండును."

జోవు సావధానముగ నాలకించి యాధ్వని చెట్లకు తగిలించి సేయుబడుచుండిన మగ్గములదై యుండు ననిస్థిరపరచెను. విశాలమగు వీధులు గలిగి వరుసతీరియున్న గృహములతో నాపట్టణ మొప్పారుచుండెను. పట్టణబాహ్యప్రదేశమున బానిసవర్తకము జరుగుచుండెను. విమానము భూమి కరువది యడుగులవరకు జనుటచే ఆదేశపుగవర్నరు పచ్చనిబావుటా

తోడను, డప్పులు, కొమ్ములు మొదలగు వాద్యములతోడను గృహమునుండి వెలువడెను. వారి కోలాహలము మిన్నుముట్టు చుండుటచే ఫెర్గసను వారితో సంభాషింప యత్నించినను వానిమాటలు వారికి వినబడుటలేదు. వారి ఫాలభాగములు విశాలమై కురులు మెలికలుతిరిగి యుండి గరుడుని తిరస్కరించు నాసికలను గలిగియుండిరి. విమానసందర్శనము భయమును కలుగజేయుటచే గవర్నరు విమానమును ముట్టడింప సేనకాజ్ఞ యొసగెను. జోవు పలురంగుల గుడ్డలను జూపించినను తిరిగి జవాబు లేదు.

విమానము కదలనందున నీగ్రోలు వరుసదీరి నిలబడి బాణములను వింట సంధించిరి. విమానము వారిబారిలో లేనందున గవర్నరు తన చేతిలోని తుపాకితో విమానమును గురిచూచుచుండ కెనడీ గవర్నరుచేతిలోని తుపాకికి గురి చూచి కాల్చెను. వెంటనే తుపాకి ముక్కలగుటచే సిపాయిలందరు భయవిహ్వలులై పారిపోయి తమతమ గృహములలో దూరి తిరిగి కాన్పించరైరి.

గాలి వీచుటలేదు. విమానము భూమికి మూడువంద లడుగుల యెత్తున నిలిచియుండెను. చీకటులు గ్రమ్మెను. రాత్రికాలమున పట్టణమందు మంటగాని దీపముగాని కాన్పించుటలేదు. ఫెర్గుసను విమానమును కాయుచుండ రాత్రి రెండు

ఘాముల వేళయందు పట్టణమంతటను విద్యుద్దీపములవలె నొక్కసారి మంటలు కానవచ్చె. తారాజువ్వలవలె జ్వాలలు పైకెగురుచుండెను. విమానమును సమీపించుచున్నటులతోచె ను. జోవు స్థిరత్వాధారమును పారవేయ నుద్యుక్తుడైయుండె ను. ఆమంట లేమైయుండు నని ఫెర్గుసను యోచించెను. ఆపురజనులు విమానమును ముట్టడింప ఆగ్నేయాస్త్రములను విడచిరా? అవును. వేలకొలది పావురముల తోకలకు దివి టీలు కట్టబడి విమానమును ముట్టడింప విడువబడెను. ఆవిహం గములు మంటలజూచి భయపడి అటు నిటు పరుగిడుచుండెను. విహంగములు వేలకొలది యుండుటచే వేట కలవిగానంజేసి ఫెర్గుసను ఒకరాతిని పారవేయ విమానము పక్షులబారినుండి తప్పించుకొనెను. రెండుగంటలలో పావురములన్నియు నదృ శ్యములయ్యెను.

" మన మిప్పుడు సుఖముగ నిదురింపవచ్చును. " అని డాక్టరనెను.

" ఇవి హానికరములగు పక్షులు. " అని జోవనెను.

" ఈ దేశీయులు దేశముల కొల్లగొనుటకు ముం డిట్టి యస్త్రములను విడుచుచుందురు. మన గాలిమను వీరివిహంగ ములకు దుర్భేద్యమైన దగుటచే యీపురవాసులవాంఛ కొన సాగినదికాదు. " అని డాక్టరు పలికెను.

"విమానమునకు శత్రువుల భయము లేదు." అని జో వనెను.

"వైమానికులు జాగరూకులై యున్నచో నట్టిభీతియు నుండదు."



# ముప్పదియవ అధ్యాయము

తెల్లవారుజామున విమానము పట్టణమును వీడుచుండ ఫెర్గుసనూ కెనడీలు మేల్కొనిరి. కంపాసును జూడ విమానము ఉత్తర ఈశాన్యమూలగా చనుచుండెను.

"మనము సరియగు దారినే చనుచున్నాము. చాడుసరస్సును నేడే చూడగలము." అని డాక్టరనెను.

"ఆసరస్సు గొప్పసరస్సేనా?" అని కెనడీ ప్రశ్నించెను.

"దాని నిడివి 120 మైళ్ళు. వెడల్పు రమారమి అంతే యుండును." అని డాక్టరనెను.

"నీటిపై ప్రయాణముగూడ సౌఖ్యమే."

"మనకు వచ్చిన కష్టములలో నెడారిబాధయే గొప్పది. నేడు మేనెల 12వ తేదీ. మనము ఏప్రిల్ 18వ తేదీని బయలుదేరితిమి. 25 రోజులు ప్రయాణము గడచెను. ఇంకొక పది

రోజులలో మన గమ్యస్థానమును జేరగలము."

"ఎచ్చటికి?"

"ఏచ్చటికో పడమటితీరమునకు."

"అవును. మనము చెప్పజాలము. ప్రకృతి యెట్లు మారుచుండునో."

"ఎచ్చటికేగవలెనన్న మనకు విమానము గలదు. 25 రోజులలో నిచ్చటికి జేరితిమి. మనకు శరీరారోగ్యము చెడలేదు. నేను ముప్పదిమైళ్ళు నడచినను నా కాళ్లగుదులు తీరనట్లున్నవి."

"లండను నగరవీధులలో తిరుగవచ్చును. డెన్హాము క్లాపర్టను ఓవరువెగ్గుల వలెను, బార్తు రిచ్చర్డుసన్ వోజెలుల వలెను మనముగూడ ముగ్గురము బయలుదేరితిమి. కాని వారం దరికన్న మంచి శరీరారోగ్యస్థితిలో నున్నాము. మన మొకరి నొక రెడబాయగూడదు. ఆకారణముననే కెనడీని వేటకై చాలదూరము జననిచ్చుట లేదు."

"నన్ను పలుమారు వేటకు పంపుచుండుము."

"ఒక యేనుగును ఒక దుప్పిని రెండు సింహములను జంపినను నీవేటకుతూహలము తీరలేదా!"

"ఆఫ్రికాదేశపు వేటగాని కీనాలుగు జంతువుల జంపి నంతనే తృప్తిదీరునా? ఆ గిరాఫీలను జూడుము"

"గిరాఫీలా? అవి చిన్నవిగా నున్నవే!"

"క్రిందకు దిగినచో నీకన్ని కూడురెట్లు పొడు గుందును."

"వాటిని సమీపించ గూడదా? ఆస్ట్రిచ్చి పక్షులను జూడుడు. ఎట్లు పరుగిడుచున్నవో!" అని కెనడీ నిరూపించెను.

"వాటిని చంపిన ప్రయోజనమేమి? హానిచేయని జంతువులను జంపరాదు. భూమికి నూరడుగులవరకేగుదము. క్రూరమృగములు కనబడినచో వేటాడవచ్చును."

విమానము పాశ్చదివెంబడి జనుచుండ ప్రకృతికాంత చెట్లచేతను లతలచేతను పలురంగులుగల సస్యములచేతను అలంకరింపబడి యుండెను. ఆప్రదేశము మొఫిట్ జిల్లాలోనిది. ఉదయము తొమ్మిదిగంటలకు చాడుసరస్సుదక్షిణతీరమును విమానము జేరగలిగెను.

సరోవరపటమును లిఖించుటకు ఫెర్గుసను యత్నించెను. ఆసరస్సు కొన్నివైపుల గట్లులేక పదునైదడుగుల జమ్ముతో నావరింపబడి యుండెను.

"తీరమందున్న పురములు నీట మునుగుచుండును. బర్నోలు నివసించిన గుడిసెలలో నిప్పుడు మొసళ్ళు యీదు లాడుచుండెను." అని డాక్టరనెను.

నీటిని రుచిచూడ ఫెర్గుసను విమానమును నీటికైదడుగులవరకు గొనిపోవ, జోపు సీసాకు త్రాడుగట్టి నీటిని చేదెను. ఆనీటియందు సోడియముకర్బనద్రవ్యమ్లజనిదము కలదు. కెనడీ

నీటిగుఱ్ఱమును గురిజూచి కాల్చెను గాని యాజంతువు తప్పించుకొనెను.

"తిమింగిలమునకు వలె గాలము నుపయోగించినచో మంచిది." అని జో వనెను.

"జో వనినది మంచిదే." అని కెనడీ పలికెను.

"మీరు గాలమును మాత్రము విడువవలదు. మనల నాజంతు వెచ్చటికి గొనిపోవునో తెలియదు."

"ఆమత్స్యమాంసము రుచికరముగ నుండునా?"

"దానిమాంసము చాలరుచికరముగ నుండునని చెప్పుదురు. ఈదేశీయుల కీమాంసముతో మంచి వ్యాపారముగలదు." అని డాక్టరనెను.

"ఇంకొక నీటిగుఱ్ఱమును గురిజూచి కాల్చినచో దాని మాంసమును రుచిచూడనగును. అఫ్రికా దేశములోనుండియును ఇంగ్లాండులో వలె పిట్టలమాంసమునే తినవలయునా?"

---

# ముప్పదియొకటవ అధ్యాయము

చాడుసరస్సు జేరినపిదప పశ్చిమముగా వీచు వాయుతరంగమొండు విమానమునకు దొరకెను. అంబరవీధి మేఘములు స్వారిజేయుచుండుటచే సూర్యకిరణముల వేడిమి కొంత

వరకు తగ్గెను. నీటిపైనుండుటచే చల్లగానుండెను. ఒంటిగంటకు విమానము సరస్సును వీడి దేశములోని క్రేడెనిమిదిమైళ్ళవరకు జని బోర్నొకు ముఖ్యపట్టణమగు కొకానగరమును జూచెను. ఆనగరము ఒంకాయతోపులచే నిండియుండెను. కొకానగరము భాగ్యవంతుల పెద్దగృహములతోడను, బీదవారి చిన్నగుడిసెలతోడ నేర్పడియుండెను. వైమానికులు పట్టణమును బాగుగ పరీక్షించుటకుముందే వ్యతిరేకవాయుతరంగ మొందు విమానమును చాడుసరస్సుమీదికి నలభై మైళ్ళవరకు గొనిపోయెను. ఆసరస్సులోని ద్వీపములన్నియును కనబడెను. ఆద్వీపములలో నివసించువారు టోరిగ్గులంతటి కూరులు. వారు విమానమును బాణములతోడను రాళ్లతోడను నుట్టడించిరి. జోవు అంబరవీధిని పరికించి కెనడీతో వేటకు మంచితరుణము దొరకిన దనెను.

"ఏమది?"

"మనవైపున కేతెంచుచున్న ఆపక్షులను జూచితివా?"

"పక్షులా!" అని డాక్టరు దూరదర్శనితో పరీక్షించెను.

అవును. పన్నెండు పక్షులు గలవు." అని కెనడీ నుడివెను.

"పదునాలుగున్నవి." అని జోవనెను.

"కాల్పినచో నపాయకరమగు నేమో?"

"అవి మనవైపునకు రాకుండిన మంచిది. అవి మనలను

ముట్టడించినచో—"

"మన తుపాకులతో వారింపజాలమా?"

"అవి హానికరములగు పక్షులుగా వని తలచెదను."

"నిరపాయకరము లని నమ్మజాలము."

పదినిమిషములలో పక్షులు రివాల్వరు బారిలోనికి తెంచెను. వాటికిచకిచధ్వనులు మిన్నుముట్టుచుండెను. అవి విమానమును జూచి భయపడకపోవుటయేగాక భయంకరములుగ గనబడుచుండెను.

"అబ్బ! ఎంత అల్లరి జేయుచున్నవి? ఆజ్ఞాపత్రము (passport) లేనిదే వాటి దేశములోనికి మనము వచ్చుటచే వానికి కోపమువచ్చినటు లున్నది." అని జోవు పలికెను.

"చాల భయంకరములుగ నున్నవి. వానికి తుపాకులనవసరము." అని ఫెర్గుసను భయమును కనబరచెను.

ఆపక్షులు విమానమునకు ప్రదక్షిణము జేయుచు విమానమును సమీపించుచుండెను. వానిబారినుండి తప్పించుటకై విమాన మత్యున్నతప్రదేశమునకు గొనిపోబడినను పక్షులు విమానమువెంట జనుచుండెను.

"ఒకపక్షిని చంపెదను." అని కెనడీ ఫెర్గుసను నడిగెను.

"వలదు. అందుచే మనల ముట్టడించుట మానవు."

"మనవద్దనున్న పన్నెండుగుండ్లచే నన్నిటిని చంప వచ్చును."

"అవి తప్పించుకొనగలవు. కొంచెమునిదానించవలెను. కాల్చుటకు సిద్ధముగ నుండుడు."

పక్షులన్నియు నొకచో చేరి విమానవుముట్టడిని గురించి యోచించునటుల కనబడెను. వాటి దీర్ఘనాసికలు కత్తులవలె మెరయుచుండెను. ఒక్కొక్కపక్షి గజము పొడవువనుండి చాపలవలెనున్న తెల్లని రెక్కలను విదల్చుచుండెను.

"అవి మనలను తరుముచున్నవి. మనకన్న నెక్కువ దూర మేగగలవు." అని డాక్టరనెను.

"అటులయిన మనము చేయున దేమి?" అని కెనడీ ప్రశ్నించెను.

డాక్టరు జవాబీయలేదు.

"అవి పదునాలు గున్నవి. మనవద్ద 17 గుండ్లున్నవి. కొన్నిటిని చంపి మిగిలినవాటిని సాగనంపగలము."

"నీసామర్థ్యమునుగురించి సందేహములేదు. విమానవుబుట్టకు పైభాగమున ముట్టడించినచో నీ కెట్లు కనబడును? ముక్కుతో ముట్టుకొనిన విమానవుగుడ్డ చినుగునుగదా! అట్లు చినిగినచో మన మేమి చేయగలము?"

ఒకపక్షి విమానమును సమీపించుచుండెను.

"కాల్చు." అని డాక్టరు కేకవైచెను.

కేకవేయుట తడవుగా పక్షి దెబ్బతిని క్రిందపడెను. ఆ దెబ్బతో పక్షులు భయపడినటుల కనబడినను తిరిగి విమానమును ముట్టడించెను. కెనడీ జోవులు వేటాడుచుండిరి.

" పదకొండున్నవి. "

" యుద్ధకౌశలముగల యావిహంగములు ముట్టడిని వేరొకతెరగున మార్చెను. కెనడీ ఫెర్గుసను జోవులు ముగ్గురు భయపడిరి. విమానవుగుడ్డ చినిగినశబ్దము వినబడెను. విమానము దిగిపోవుచుండెను.

" స్థిరత్వభారమును పారవేయుడు. " అని డాక్టరు కేక వేసెను. జోవు స్వర్ణశిలలను పారవేయుచుండెను. సరస్సు విమానము నాలింగనముజేయ పరుగిడివచ్చునటు లుండెను.

విమానము మూడువేల అడుగుల యెత్తుననుండి రెండు వందల యడుగుల యెత్తునకు దిగెను.

" తినుబండారముల పీపానుగూడ పారవేయుడు. "

" ఇంకేమియును మిగులలేదు. "

" ఉన్నది. " అని జోవు తొట్టిలోనుండి నీటిలోనికి జారెను.

" అయ్యో! జోవు! " అని ఫెర్గుసను కేకవేసెను.

జోవునకు వినబడలేదు. భారము తగ్గినందున విమానము వేయియడుగుల ఎత్తున కేగెను. గాలి చిన్నవిమానము నుత్తరదిశగా కొనిపోయెను.

"పోయెనుగదా!" అని కెనడీ దుఃఖించెను.

"మనల రక్షించుటకై తనప్రాణముల నొసగెనే!" అని డాక్టరు విచారించెను.

మిగిలిన వైమానికులిద్దరినయనములనుండి నీరుప్రవించుచుండెను. కడసారి జోవును చూడయత్నించిరిగాని జోవు కనబడలేదు.

"మనము చేయునదేమి?"

"మన మీ సమీపముననాగి జోవును వెదకవలెను."

విమానము జోవు పడినచోటున కిరువది మైళ్ళదూరమున లంగరువేయుబడెను. సాయంకాలమైనది. ఆరాత్రి వారు నిదురింపలేదు.

---

# ముప్పదిరెండవ అధ్యాయము

మరునాడుదయమున తీరమును పరిశీలించుటయే వైమానికుల కర్తవ్యము. వారు లంగరువేసిన స్థానము గొప్ప వృక్షములు గల లంక. వారిద్దరు మౌనమును దాల్చియుండిరి.

తుదకు కెనడీ "జోవు మృతినొందియుండడనియే నేను తలంచెదను. వానికి యీతవచ్చును. వివేకి ఎడింబరో వద్దనున్న ఫర్తు ఫోర్తునది నవలీలగ నీదెను. వానిని చూడగలమని ఆశకలుగుచున్నది. ఎట్లో ఏవిధముగనో తెలియుటలేదు." అనెను.

"నీమాట నిజమగునుగాక! మనము విదకుటలో లోటు చేయరాదు. ముందుగా పెద్ద విమానపుగుడ్డనుతీసిపార వేయవలెను. అందుచే 650 పౌనులభారము తగ్గును."

వారిద్దరు శ్రీమపడి పెద్దవిమానపుగుడ్డను ముక్కలు ముక్కలుగ జీల్చి వలలోనుండి లాగి పారవేసిరి. పక్షులము క్కలచే చాలవరకు చినిగెను. నాలుగు గంటలలో నాపని ముగిసెను. చిన్నవిమానము మంచిస్థితిలో నుండెను. విమానపు ఘనపరిమితి అయిదువంతులు తగ్గుటచే కెనడీ కాశ్చర్యముజనించెను.

"దీని పరిమాణము చాలునా?"

"చాలును. స్థిరత్వభారమును మాత్రము ఎక్కువ జేయవలెను. జోవు కనబడినను వానినికూడ వెంట గొనిపోవచ్చును.

"వాడుపడిన ప్రదేశమునకు సమీపమున ద్వీపమొండు గలదు. మూఢభక్తి కలవారి చేతులనుండి తప్పించుకొనగలదు."

"వాని కానేర్పు గలదు."

"కెనడీ, ఆకలి మిక్కుటముగనున్నది. ఆహారపదార్థములను పోగొట్టికొనినందున జంతువులనుగాని, పక్షులనుగాని వేటాడి మాంసమును తెమ్ము.

"పోయివత్తును." అని కెనడీ తుపాకినిగైకొని అరణ్యములోనికేగెను. తొట్టిలో 30 పౌనుల పెమ్మికను, కొంచెము కాఫీ,కొంచెను తేయాకు, సగము బ్రాంది, నీరులేని పీపాయును గలవు. నిలవమాంసముగూడ పారవేయబడెను. వ్యాకోచవు మరపొర్యిబ్యు మంచిస్థితిలో నుండెను. చిన్నవిమానవు ఉత్పతన శక్తి మూడువేలపౌనులు. మరపొర్యిబ్యు, తొట్టి, అందులోనివని ముట్లు, 50 గేలనుల నీరు, నూరుపౌనుల మాంసము, మొదలగువాటి భారమున్ను వైమానికుల భారమున్ను జేర్చి 2830పౌనులు. అందుచే 120 పౌనుల స్థిరత్వభారమును కొనిపోవచ్చును. జోవు భారమునకుగాను స్థిరత్వభార ముంచబడెను. కెనడీ తిరిగి వచ్చులోపల విమానము సిద్ధముగ నుంచబడెను. కెనడీతెచ్చిన అడవిబాతులు, పొట్టిబాతులు, కొన్నిపక్షుల మాంసమును వచనముచేసికొని వైమానికులిద్దరును భుజించిరి. జోవు కాన్పించుట లేదు. పిదపవారిద్ద రలసటచే నిదురించిరి.

తెల్లవారుచుండ ఫెర్గుసను కెనడీని లేపెను.

"జోవును కనుగొనుటకు మార్గము నరయుచున్నాను."

"నీతలం పేమి?"

"మనయునికి వానికి తెలియజేయుటయే మన కర్తవ్యము."

"అవును. వానిని విడిచిపోయి రని జోవు తలచగూడదు

"వాని కట్టి తలం పెన్నటికిని కలుగదు."

"మనయునికి వానికి తెలియజేయు టెట్లు?"

"మనవిమానము నటునిటు త్రిప్పుచుండినయెడల మనము వానికి కనబడగలము."

"వాయువు మనలను గొనిపోయినచో?"

"ఈగాలి మనలను సరస్సువైపునకే గొనిపోవుచున్నది. నేడు సరస్సుపైననే తిరుగుచుండవలెను. వాడు విమానమును జూచి వానియునికి మనకు దెలియజేయును."

"మనలను చూడజాలనిచో?"

"అట్లయిన సరస్సున నుత్తరతీరమున వెదకుట మంచిది. జో వాతీరమును జేరగలడు." వారు దిగిన ద్వీపమును గురుతిడుకొనిరి. ప్రాతఃకాలమున ఏడుగంటలకు లంగరునెత్తిరి. ఉదజని ఉష్ణీకరింపబడుటచే విమానము రెండువందలయడుగుల యెత్తున కేగెను. వాయువు గంట కిరువదిమైళ్ళ వేగమున వీచుచుండెను. విమానము భూమినుండి 500 అడుగులదూరమును మించక జనుచుండెను. కెనడీ మధ్య మధ్య తుపాకిని ప్రేల్చుచుండెను. పల్లెవాండ్రు తెప్పలను వీడి నీటమునిగి తమద్వీపములను చేరుచుండిరి.

"ఇచ్చట జోవులేదు."

"తొందరపడకుడు. వాడుపడినస్థానము సమీపముననే గలదు."

మధ్యాహ్నము పదకొండుగంటలకు విమానముతొంబది

మైళ్ళదూర మేగెను. తూర్పుగా వీచు వాయువు విమానమును అరువదిమైళ్ళవరకు కొనివచ్చి ఒక్కలంకపై నాపెను. ఆద్వీపమున జోవు కనబడలేదు. సాయంకాలము మూడుగంటలకు చాడుసరస్సు తూర్పుతీరమందున్న టాంగెలియా గ్రామమును కాన్పించెను. డెన్హాము పరిశోధకు లాగ్రామమును దాటలేదు.

"మన మిచ్చట యాగి క్రొత్తవాయుప్రవాహమును చూడవలెను."

గంటన్నరకాలము శ్రమపడి విమానమునూర్ధ్వముఖమున త్రిప్పగా వేయి అడుగుల యెత్తున వాయువ్యమూలగా వీచు వాయుప్రవాహమొండు దొరకెను. జోవు తీరమందలి దేపట్టణమైన జేరియుండునని ఫెర్గుసను యోచించెను.

ఆఫ్రికాదేశపు సరస్సులలోను నదులలోను మొసళ్ళు నీటిగుఱ్ఱములు మొదలగు నీటిజంతువులు స్వేచ్ఛగా విహరించుచుండెను. జోవునకు వాటి బారినుండి తప్పించుకొను మార్గము తెలియును. ఆఫ్రికాదేశపు మొసళ్లు మనుజులను బాధించవు. అందుచే ఆఫ్రికనులు సరస్సులలోను నదులలోను నిర్భయముగ స్నానముజేయుదురు. సాయంకాల మైదుగంటలకు లారీపట్టణము కానవయ్యె. ఆపట్టణవాసులు ప్రత్తిచెట్లనుండి ప్రత్తిని యేరుచుండిరి. తాము విడచిన ద్వీపమును జూచి వైమానికులు లంగరును విడువ, నది జమ్ముచే నిండిన యా[illegible]

యందు పట్టుబడెను. గాలి తగ్గుటచే విమానము నిలబడియుండెను. రాత్రి వైమానికు లిద్దరు వంతులవారీకారము సిదురించిరి.

---

# ముప్పదిమూడవ అధ్యాయము

తూర్పుదెస తెలతెలవారుచుండ గాలి హెచ్చుచుండెను.

" మనము బయలుదేరవలెను. గాలి హెచ్చుగానున్నందున భూమికి సమీపమున విమానము బంధింపబడియుండరాదు. " అని డాక్టరనెను.

" జోవును వెదకు టెట్లు ? "

" మనల నీగాలి యెచ్చటికి కొనిపోయినను తిరిగి రాగలము. ఈ వాయుతరంగోద్రేకముచే మన మిచ్చట నిలువరాదు. విమానమునకు హానివాటిల్లును. "

విమానము గాలిచే నీడ్వబడుచుండుటచే లంగరు నూడదీయుట కష్టతరము. కెనడీ లంగరు నూడదీసి తిరిగి విమానము నెక్కుట కష్టము. అందుచే డాక్టరు లంగరు త్రాటిని నరికెను. విమానము వెంటనే మూడువందల అడుగులయెత్తున కేగి వాయుతరంగమునం బడి ఉత్తరదిశగా జనుచుండెను. ఫెర్గుసను విమానమును వాయుప్రవాహమునుండి తప్పించ యత్నించెను గాని శక్యముగాలేదు.

" మానవశక్తికి మేరమీరెను." అని డాక్టరనెను.

"ఎడారిలో సహితము ఒకరినొకరు విడగూడదని సిరపరచుకొనినను దైవోపహతులమై జోవును విడవలసి వచ్చెనుగదా!" అని కెనడీ విచారించెను.

"పాపము. జోవు తాను కొనివచ్చిన శిలలను పారవేయుటయే గాక తానుగూడ పడిపోయెను. గాలి మనలను తరుముచున్నది."

"దేశీయుల శరణు జొచ్చి కొంతకాలమునకైన డెన్హాము క్లాపర్టనులవలె నింగ్లాండునకు రాకూడదా!"

"జోవునకు వారిభాష తెలియదు. నిరాయుధుడు. డెన్హాము క్లాపర్టనుల వెంట పరివారముండెను. వారీదేశపు పాలకులకు కానుకలను గొనివచ్చిరి. అప్పటికిని వారి కష్టములకు మితిలేదు. అట్టిస్థితిలో జోవేమిచేయగలడు?"

"మనము తిరిగి ఆచోటున కేగవలయును."

"అవును. విమానమును వీడి కాలినడకనైన జనవలెను. బోర్నాసుల్తానుతో మాట్లాడవలయును. అరబ్బులు తెల్లవారితో స్నేహభావమును జూపుదురనుకొనెదను."

"ఎంతకష్టములనైన లక్ష్యపెట్టక జోవును వెదకవలయును. జోవు మనకొరకు తనప్రాణముల నొసగెను. మనమాతని వెదకుటకై ప్రాణముల తృణప్రాయముగ నర్పింపవలయును." అని కెనడీ పలికెను. సరస్సును జేర్పగలవాయు

తరంగముకొరకు వెదకిరిగాని వాయుతరంగము దొరకకపోవు టయేగాక విమానము నాపి దిగుటకైన వీలు చిక్కుటలేదు. విమానము ఒంటెలమందలుండు యెడారియందు ప్రవేశించెను. సారవంతమగు భూమి కాన్పించుటలేదు. కొలదిదూరమందొక యెడారిలంక కనబడెను. అచ్చట కొందరు బాటసారులు గుడారములవైచి విశ్రమించియుండిరి. వరుగిడుచున్న తోకచుక్కవలె విమానము గోచరించుచు అరువదిమైళ్ళవర కేగెను. సహారా యెడారిలోనికి విమానమును గొనిపోవు నని ఫెర్గుసను భయపడెను.

ఆహా! ప్రకృతిమహిమ నే మని కొనియాడ నగును? వాతావరణమున ఫెర్గుసనునకు నిరాశకలుగునంత మార్పునను కూడు నని యెవరికి తెలియును? వ్యతిరేకముగ వీచువాయువొండు యెడారిలోని యిసుకనంతను గొనివచ్చుచున్నదే! బాటసారుల బిడారు ఒంటెలతోసహా యిసుకపాతరలో మునిగిపోయెనే! ఒంటెల అరపులు మాత్రము వినబడుచుండెను. గాలితగ్గెను. కెనడీ డాక్టర్లు వింతగాజూచిరి. విమానము వ్యతిరేకపు వాయుప్రవాహములచే ముందువెనుకల తిరుగుచుండెను. ఉదజనికి వ్యాకోచనశక్తి చాలదు. తొట్టిలోని పనిముట్లు కదలుచుండెను. సర్పాకారపు గొట్టములు వంగెను. ఉత్తర దిశగా వీచువాయువు దొరకెను.

" మన మెచటికి జనుచున్నాము? "

" మనము నిరాశచేసికొనిన స్థానమునకే! "

సమమట్టముగనుండిన యెడారి యిసుకతిప్పలచే నిండి యుండెను. వాయువు వీచుచుండెను. ఉదయము తొమ్మిది గంటలైనను చాడునరస్సు కనబడుటలేదు. ఈసంగతి కెనడీ డాక్టరుతో నుడువ,

" అందుచే నష్టములేదు. వెనుకకు మరలుటయే చాలును. బోర్నో. వ్రూడీ,కౌకావట్టణములలో నొకటైనను కాన్పించకపోదు. " అని డాక్టరనెను.

" అటులైన నాకును సంతోషమే. అరబ్బుల స్థితిని జూడ నాకు భయమగుచున్నది. ఎంతఘోరమైనపని జరిగినది. "

" ఈ యిసుకతుపానులు యెడారులలో తరుచుగ వచ్చు చుండును. అందుచే నెడారిప్రయాణముకన్న సముద్రప్రయాణమే చాలమేలు. "

"గాలితగ్గుచున్నది. ఆకాశము నిర్మలముగ నున్నది. దూరదర్శనిని చేగొని చూచుచుండుము. "

"కనబడునదెల్ల నీకు తెలియజేయుదును." అని కెనడీ దూరదర్శనిని చేగొని తొట్టిలో ముందరభాగమున నాసీనుడయ్యెను.

---

# ముప్పదినాల్గవ అధ్యాయము.

జోవుగతి యేమయ్యెనో. పరికించుట మనకు కర్తవ్యము. వెనుక నుడివినప్రకారము జోవు నీటిలో మునిగి పైకి తేలిన వెంటనే విమానముదెస గాంచెను. విమానము గనబడి క్రమక్రమముగ నదృశ్యమయ్యెను. తన యజమానుడును స్నేహితుడును సురక్షితముగ నున్నందుకు సంతసించెను.

"నేను విమానమును వీడుట మంచిపనియైనది. కెనడీకి యీయాలోచన తోచిన నాకన్నముందుగా నీపనిని చేసియుండును."

అని తనలో ననుకొని తృప్తినొంది జోవు స్వవిషయమై యోచించెను. అతడు గొప్పనరస్సునం దుండెను. చుట్టును నడవిజాతి నీగ్రోలు గలరు. పక్షులు విమానమును చూచుటకు ముందు సమీపమున నొకద్వీపమును జూచియుండెను. ఆద్వీపమును జేరి దుస్తులనుమార్చి సరస్సుతీరమును జేరవలె ననుకొనెను. గంటకాలములో చాలదూరమువరకీదెను. తీరమునూరడుగుల దూరమందుండ కస్తూరిపరిమళానిలములువీచెను.సమీపమున మొసలి గలదని గ్రహించి జోవు నీట మునిగెను గాని మొసలిశరీరవు రాపిడినిమాత్రము తప్పించుకొనజాలకపోయెను. తాను మొసలి కాహారమగుదు నని తలచినను యీదుట మానలేదు. పావుగంట గడచినపిదప జోవు శరీరము నేదో పట్టు

కొనెను. పాపము! తన యజమానుని తలచుకొని పట్టును తప్పించుకొన జూచెను గాని నీటిలోపలికి లాగబడుటకు మారుగా నీటిపైకి తేల్చబడెను. ఇద్దరు నీగ్రోలు జోవును చేతులతో నెత్తి చూచిరి.

"మొసళ్ళకు బదులు నీగ్రోలు పట్టుకొనిరే! వారిట్టి భయంకరసరస్సునం దెట్లు స్నానము చేయుచున్నారు?" అని జోవు అనుకొనెను.

ఆఫ్రికాదేశపు మొసళ్లు మానవులజోలికిరావని జోవునకు తెలియదు. భయచిహ్నములు కనుబడనీయకుండ తన్ను గట్టునకు కొనిపోవనియ్యకొనెను.

"విమానమునుండి పడిపోవుటను వారుచూచిరి. అంతరిక్షమునుండి పడిన వస్తువులను వీరు పూజింతురు." అని జోవు తలచి ధైర్యముగ నుండెను.

నీగ్రోలు జోవును కొనిపోయి తమ స్నేహితులవద్దనుంచిరి. పిల్లలు పెద్దలు ముసలివారు అందరు జోవును చూడ వచ్చిరి. వారు బిడియమాలో నొక తెగవారు. జోవు శుభ్రమగు దుస్తులను ధరించి యుండలే దని విచారించలేదు.

"విమాన మీవైపునకు వచ్చినచో దేవతలు ఆకాశవిమానములో నెగిరిపోయినట్లు విమానములో నెక్కి వీరినందరిని ఆశ్చర్యనిమగ్నుల జేసియుందును." అని జోవు అనుకొనెను.

నీగ్రోలు జోవును పూజించి, ఫుల్లనిపాలను అన్నమును తేనెను నైవేద్యమొసగిరి. జోవు చాకచక్యమును గనబరచుచు నైవేద్యము నారగించెను. చీకటిపడినతోడనే జోవును రత్న రేకులచే నలంకరింపబడిన గృహమునం దుంచిరి. దానిచుట్టును మొనుకలగుట్టలు కలవు. జోవునకు రాబోవు ఆపదనుగురించి యోచించుటకు సమయ మిప్పుడు ధొరకెను.

నీగ్రోలు కొంతరాత్రివరకును డప్పులధ్వనితో కీర్తనలను పాడుచు భజనసలిపిరి. యుద్ధమునపేలు ఫిరంగిశబ్దములవలెనున్న యానీగ్రోపాటలు జోవుచెవులకు ములుకులై యుండ మలయమారుతము గొనివచ్చు గాంధర్వగానామృతమువలె నీగ్రోలు పిల్లలు, పెద్దవారు, ముసలివారు నాహ్లాదకరముగ వినుచుండిరి. నృత్యముగూడ జరిగెను. జోవు గుడిసెలోనుండి చూచుచుండెను. కొంతసేపటికి కోయసభముగియ జోవు గాఢనిద్రాపరవశు డయ్యెను. సూర్యోదయమై సూర్యకిరణములు తడికలసందులనుండి లోన ప్రవేశించి లేపువరకును జోవు నిదురించియుండెడివాడుగాని నేలతడి యెక్కువగుటచే నతనినిదురకు భంగముకలిగెను. కొన్నినిముసములలో జలము లోన ప్రవేశించుటచే జోవు లేచి బయట కేతెంచిచూడ తన గుడిసెచుట్టును నీటిమయమై యుండెను. ద్వీపమంతయు మునిగి పోయెను. ఇటువంటి మార్పులచట తరచు జరుగుచుండును. ఈమార్పు తనమేలుకొరకే జరిగె నని గుడిసెకు నలువైపుల పరి

కింప సమీపమున నొకనావ దొరకుటచే దాని నూతగాఁగొని ప్రవాహమువెంబడి నుత్తరదిశగా జనుచుండెను. రాత్రి రెండు గంటల కొకదిబ్బకు జేరి యచ్చటనున్న చెట్టునొకదాని నెక్కి తెల్లవారువరకందు కూర్చొనెను. తెల్లవారినపిదప తనకు తావు నొసగిన వృక్షమును పరికింప దానికొమ్మలపై పాములు, తేళ్లు, ఊసరవిల్లులు మిక్కుటముగ నుండెను. జోవు పాములబున లకు భయపడి వెంటనే క్రిందికురికెను.

"ఈ వింతవార్త నితరులకు నుడివిన నమ్మరు" అని జో వనుకొనెను. "

డాక్టరు వోజీననువాడు ప్రపంచమున నెచ్చటను గానరాని సరీసృపములు చాడునరస్సుతీరమందుగలవని చెప్పినటుల జోవునకు తెలియదు. జో వచ్చోటును వీడి యీశాన్యమూలగా జనుచు అంబరవీధిని విమానముకొరకు వెదకుచుండెను. అదినమంతయును వెదకి వేసారినను జోవు విమానము కనపడదని నిరాశను జెందలేదు. ఆకలిబాధ హెచ్చినను జోవు లక్ష్యపెట్టక ముప్పదిమైళ్ళవర కేగెను. వానిపాదములు ముండ్లచే రక్తసిక్తములైయుండెను. ఆరాత్రి తీరముననే నిదురింపనెంచెనుగాని పురుగులు, జోరీగలు, వాటినిమించిన దోమలు, పేడపురుగులు మొదలగువాటి బాధ తప్పినదికాదు. రెండుగంటల కాలములో పురుగులచే జోవు పరచుకొనిన పైబట్ట ముక్కలు ముక్కలుగా గొరుకబడెను. రాత్రి జోవు నిదురింపలేదు. వన్య

మృగముల కూతలు వినబడెను. తెల్లవారెను. జోవు నిదురించి నచోటున అయిదంగుళముల పొడవుననున్న మండూకమొండు శయనించియుండ యసహ్యముచే జోవు పరుగిడి నీట మునిగెను. స్నానముచే కొంతబాధ తగ్గినందున కొంచెము కందమూలము లను భుజించి బయలుదేరెను.

"విమాన మెచ్చట గానబడును. గాలి ఉత్తరదిశగా వీచుచుండెను. అందుచే విమానము సరస్సువైపునకు వచ్చును. యజమానుడు విమానమును సరిచేసి స్థిరత్వభారముకొరకు నిన్ననే విమానమును లంగరువేసియుండును. విమానము కన బడదనియే నిశ్చయించుకొనుట మంచిది. ఏ పట్టణమునైన చేరుటకు ప్రయత్నించెదను" అని జోవు యోచించెను. ఇట్లు వితర్కించుచు జనుచుండ జోవునకు కొందరు నీగ్రోలు కనబడిరి. వారు అమ్ములకు విషమును పూయుచుండిరి. జోవు వారికంట బడకుండ నొకపొదచాటున దాగెను ఆసమయ ముననే విమానము జోవుపై నూరడుగులయెత్తున కనబడెను. జోవు కదలిన నీగ్రోలు పట్టుకొందురు. అందుచే జోవు యజ మానుని తలచి బాష్పముల విడచెను.

నీగ్రోలచ్చోటును బాసినవెంటనే జోవు పొదనుండి వెలువడి కేకలువేసినను వైమానికులకు వినబడలేదు. తిరిగి వచ్చెద రని జోవు వేచియుండెను. విమానము తూర్పుదెసగా నేతేర జోవు తిరిగి కేకలువేసినను వారికి వినబడలేదు. వాయువు

విమానమును రయమునగొని పోవుచుండెను. జోవునకు మొదటి తడవ క్రొంచెము నిరాశజనించెను.

విమానమును జూచుచు పరుగిడ జోవు బురదలో దిగెను. ఆబురద మొలలోతువరకు వచ్చెను. జోవు యత్నించినను గట్టినేల దొరకలేదు. సమీపమున చెట్టుగాని కర్రగాని దొరకలేదు.

"ఫెర్గుసనుగారు! ఫెర్గుసనుగారు! సహాయముజేయుడు." అని జోవు కండ్లుమూసికొని కేకవైచెను. ఆ నిర్జన ప్రదేశమున వానిమాట వినువారెవరు?

---

# ముప్పదియైదవ అధ్యాయము.

కెనడీ తొట్టిలో ముందువైపున నాసీనుడై దిక్చక్రమును పరికించుచుండెను.

"క్రాంతదూరమున గుర్రపుదళమొండు స్వారిచేయుచున్నది. దుమ్ముచే రౌతులు కాన్పించుటలేదు." అని కెనడీ చెప్పెను.

"గాలిదుమ్ము గాదుగద!" అని డాక్టరనెను.

"గాలిదుమ్ముగాదు. గుర్రపుదండు గాని లేళ్లమందగాని యైయుండును."

" నీ వనునది నిజమే. చాలదూరమున నుండుటచే తెలి యుటలేదు."

కెనడీ దూరదర్శని నుపయోగించుచుండెను. గుర్రపు దళము రెండుభాగములుగ చీలియుండెను.

" వారు దేనినో పట్టుకొనుటకై యత్నించుచున్నారు. ఆజంతు వేదో చూడవలెను."

" వారు అరబ్బులు. వారు ఏబదిమంది గలరు."

" వా రెవరైనను వారి తుపాకుల బారినుండి తప్పించు కొనగలుగు."

" వారు దేనినో పట్టుకొనవలెనని యత్నించుచున్నారు."

" నిజమా ? "

" అవును. వా డొక మానవుడు. పలాయితుడు."

" వానిని చూచుచుండుము."

గుర్రపుదళము విమానమునకు నాలుగైదుమైళ్ళ ముందుండెను.

" డాక్టరుగారూ! వా డే—" అని కెనడీ కేకవేసెను.

" ఎవరు? "

" వాడే—"

వాడనుటచే ఫెర్గుసనునకు తెలిసెను. వా డొకగుర్రము నెక్కి శతృవులకు నూరడుగులుముందు స్వారీ చేయుచుండెను. గుర్రము శరవేగమున పరుగిడుచుండెను.

"వాడు జోవే!" అని డాక్టరనెను.

"వాడు మనలను చూడజాలడు."

"చూడవలయును." అని మరపొర్గ్యుని తగ్గించెను.

"అయిదునిమిషములలో భూమి కేబది యడుగులవరకు దిగి పదిమైనెమనిమిషములలో వానిని జేరగలము."

"వానికి వినబడుటకై తుపాకిని బ్రేల్చినచో?"

"వలదు. వాడు వెనుకకు తిరుగలేదు."

"ఆహా!"

"ఏమది?"

జో ప్రయెక్కిన గుఱ్ఱము అయాసముచే పడిపోయినందున కెనడీ కేకవైచెను.

"వాడు తిరిగిలేచుచు మనవిమానమును జూచి సంజ్ఞ జేసెను."

"ఎందుకు నిలబడెను? అరబ్బీలు పట్టుకొనరా?"

"ఆహా! ఎంతధైర్యవంతుడు!" అని కెనడీ పలికెను.

జోవు మొదటి గుఱ్ఱపురౌతు వచ్చువరకాగి చిరుత పులివలె రౌతుపైకి దుమికి ఆరౌతును పడద్రోసి తాను యెప్పటివలెనే స్వారిజేయుచుండెను. అరబ్బులు జోవుచేసిన కార్యమునకై కేకలువేయసాగిరి. వారు విమానమును చూడలేదు. రౌతులవెనుక విమానమైదువందలడుగుల దూరమునందుండెను. అరబ్బీలలో నొకడు జోవును సమీపించి బల్లెమును

వినర నుద్యుక్తుఁడై యుండ కెనడీ యారౌతును తుపాకితో బరి మార్చెను. సేనలో కొందరు వెనుకకు తగ్గిరి. కొందరు విమానము జూచి సాష్టాంగపడిరి. మిగిలినవారు జోవును తరుముచుండిరి.

"జోవు ఎందు కాగడు?" అని కెనడీ ప్రశ్నింప,

"ఆగుట కన్న స్వారిచేయుచుండుటయే మేలు. మనము వానికి రెండువందలకుగులదూరమందున్నాము. నీతుపాకిని క్రిందనుంచి నూటయేబదిపౌనుల స్థిరత్వభారము నెత్తగలవా?"

"అంతకన్న నెక్కువ బరువు నెత్తగలను."

"అంతవరకు చాలును." అని డాక్టరు కెనడీ చేతులలో నిసుకసంచులను పేర్చెను.

"పారవేయుటకు సిద్ధముగ నుండుము. నేను చెప్పక ముందు పారవేసినచో జోవును రక్షింపజాలము."

"మంచిది."

"జోవు జాగ్రత్త." అని,

విమానము జోవుపై నెగురుచుండ ఫెర్గుసను నిచ్చెనను జారవిడచెను. డాక్టరుమాటను విని వెనుదిరిగి జోవు నిచ్చెనను పట్టుకొనెను. వెంటనే కెనడీ కనుజ్ఞ నీయ నాతడు స్థిరత్వభారమును పారవైచెను. విమానము నూటయేబది యడుగుల యెత్తున కేగెను. జోవు కడసారి అరబ్బీలను జూచి పరిహసించి నిచ్చెనమీఁదుగా తొట్టిలోని కేగెను. కెనడీఫెర్గుసనులు జోవును

గాఢాలింగన మొనర్చికొనిరి.

"మాస్టరుగారూ! కెనడీ!" అని పిలిచి జోవు మూర్ఛిల్లెను.

జోవు దిగంబరుడై యుండుట యేగాక ఒడలంతయును గాయములచే నరగ్రిబారియుండెను. మేనిపై గాయములను కడిగి ఫెర్గుసను కట్టుగట్టెను. కొంతతడవుకు తెలివినొంది కొంచెము సారాయినడుగ ఫెర్గుసను గ్లాసులోపోసి జోవునికిచ్చెను. అది త్రాగుటచే కొంచెము శక్తి కలుగుటచే తనకథను చెప్ప వలెనని యత్నింప ఫెర్గుసను వారించెను. అందుచే తిరిగి నిదురించెను. వాయువు తీవ్రముగ వీచుచుండుటచే సాయంకాలమునకు విమానము రెండువందలమైళ్ళ దూరమేగి ధ్రువరేఖలోని 10 వ కళను దాటెను.

# ముప్పదియారవ అధ్యాయము

చీకటులు క్రమ్ముచుండ వాయువేగము తగ్గినందున విమాన మొక అశ్వత్థ వృక్షముపై నిలబడెను. ఫెర్గుసను కెనడీలు వంతులప్రకారము విమానమును గాచుచుండ జోవు యిరువదినాలుగు గంటలకాలము నిదురించెను.

"వానికి ప్రకృతియే పరిపూర్ణారోగ్యమును ప్రసాదించ గలదు" అని ఫెర్గుసను పలికెను.

సూర్యుడు తూర్పుదిశను గొలువుదీర్పుటకై వెడలుచుండ విమానము త్తరదిశగా జని దక్షిణదిశగా తిరిగి తుదకు తూర్పు దిశగా జనుచుండెను. విమానము జిండరను పట్టణమును దాటెను.

"మన ముత్తరదిశగా జనుచున్నాము." అని కెనడీ కంపాసునుజూచి పలికెను.

"దానివలన మనకు లాభమేమి? మనము టింబక్టూ పట్టణమున కేగినను మంచిది."

"ఇంతటిచక్కనిప్రయాణము నెవరును జేసియుండరు."

"ఇంతమంచి ఆరోగ్యస్థితియందు గూడ." అని జోవు గుడారము నెత్తి పలికెను.

"నీశరీర మెట్లున్నది?" అని డాక్టరు ప్రశ్నింప,

"హాయిగా నున్నది. స్నానమున్ను గుఱ్ఱపుస్వారియున్ను శరీరమున కారోగ్యమును గలిగించెను." అని జోవు ప్రత్యుత్తర మొసగెను.

"నీత్యాగము చాలమంచిది. మమ్ములను రక్షించుటయేగాక విమానమును కాపాడినది."

"నేను చేసినపని నిరర్థకము గాలేదు గనుక దానిని గురించి పదిసారులనుట వ్యర్థము."

"నీవు ఒకరిమాటను విందువా? నీవు పడినశ్రమను మాకు దెల్పుము." అని డాక్టరడిగెను.

"మీరు విన గుతూహల పడుచున్న యెడల్ జెప్పెదను. ముందీ పెద్దబాతును భక్షించి ఆఫ్రికా దేశపు మాంసమును రుచి చూడనిండు."

అని జోవు బాతును మరపాఱ్ఱియ్యమీద పచనముజేసి ఫెర్గుసను కెనడీలతో కలిసి భుజించెను. తేనీళ్ళను, సారాయిని గ్రోలినపిదప జోవు తనచరితమును చెలికాండ్రకు వినిపించెను.

జోవు తనచరిత్రయందు బురదలో పడువరకు నుడివి నశేషము నీక్రింది విధముగ వినిపించెను.

"నేను నిరాశను జెందియుండ త్రాడొండు చేజిక్కె ను. అది గట్టిగా కట్టబడియుండుటచే దానినూతగాగొని బయ టికివచ్చి దానికొనను పరీక్షింప నది విమానపులంగరు. దానిని చూచినందున ధైర్యమొదవి కొంతదూరము నడువగా మహా రణ్యమొండు గనపడెను. అందులో కొన్ని గుఱ్ఱములు మేయు చుండ నేను వెంటనే ఒకయశ్వము నధిరోహించి ఉత్తరదిశగా స్వారిజేయుచుండ అరబ్బీదళమొండు నన్ను పట్టుకొన యత్నిం చెను. నాగుఱ్ఱము పడిపోవ ముందువచ్చు అరబ్బీగుఱ్ఱముపై దుమికి వానినిచంపి యెప్పటివలె స్వారిచేయుచుంటిని. పిదప మిమ్ములను జూచితిని. మీరు నన్ను జూచిరి. ఇదియంతయు లిప్తకాలములో జరిగినటు లున్నది. తిరిగి మీకు సాయము జేయ సిద్ధముగ నున్నాను."

జోవు తనచరితమును వినిపించుచుండ విమానము చాల

దవ్వేగి 'టాజిమెలు'గ్రామమును దాటెను.

"మనము బార్తుమార్గములో నున్నాము."

"ఆగ్రామముననే బార్తు తనచెలికాండ్రైన రిచ్చర్డునకు ఓవరువెగ్గులను పీడెను. వారుముగ్వురిలో బార్తు మాత్రము ఇంగ్లాండునకు జేరగలిగెను."

"ఈదారిని యీయెడారిని దాటి ట్రిపోలీ పట్టణమును జేరవలయునా?"

"అంతవర కేగ నవసరములేదు."

"ఎచ్చట ఆగుట మీయిష్టము. టింబక్టూ నగరమును చూడవలెను."

"అవును. ఆఫ్రికా దేశమంతయు తిరిగి టింబక్టూను చూడకుండ జనుటయా!" అని జో పలికెను.

"మనము అక్షరేఖలో 17, 18 కళలవరకును జని అచ్చటనుండి పశ్చిమముగా నేగవలెను."

"ఉత్తరదిశగా నెంతదూర మేగవలెను?" అని కెనడీ ప్రశ్నించెను.

"అర్ధమును నూటయేబది మైళ్ళవరకు.

"నేను కొంతకాలము నిదురించెదను." అని కెనడీ నుడివెను.

"మీరుగూడ నిదురింపుడు." అని జోవు ఫెర్గుసనును కోరెను.

వేటకాడు గుడారముక్రింద నిదురించెను. ఫెర్గుసను కూర్చొనియుండ పర్వతపంక్తులు దాటబడుచుండెను. గిరాఫీలు ఉష్ట్రపక్షులు తుమ్మలబీళ్ళలో పరుగిడుచుండెను. రాత్రి పదిగంటలకు విమానము రెండువందల మైళ్లు జని యొక నొకపట్టణముపై నిలబడెను. వెన్నెలలో నాపట్టణము కొంత వరకు పాడుపడినటుల గోచరించుచుండెను. ఫెర్గుసను దానిని ఏమడీసు పట్టణ మని తెలిపెను. అది వాణిజ్యమునకు ముఖ్యస్థానము. రాత్రికాలము గడచెను. తూర్పుదెసనుండి వేడి కిరణములు దాగుడుమూత లాడుచుండ సన్నని వాయుతరంగము విమానమును నైఋతిమూలగా గొనిపోవుచుండెను.

---

# ముప్పదియేడవ అధ్యాయము

మేయి నెల 17 వ తేదీ గడచెను. బయలుదేరుటకు ముందు ఫెర్గుసను పీపానిండ నీరమును నింపి పూరించెను. వైమానికులు సాయంకాలమునకు అక్షరేఖలోని 16 వ కళను, ధృవరేఖలోని 4 వ కళలోని 55 వ వికళను జేరిరి. ఆనాడు విమానము నూటయెనుబది మైళ్ళ దూరమేగెను.

తాము గొనిపోయిన మాంసాహారమును జోవు చక్కగా పచనము జేయ వైమానికులు భుజించిరి. గాలి బాగుగ నుండుటచేతను వెన్నెల చక్కగ గాయుచుండుటచేతను దారి

తప్పరని రాత్రి ప్రయాణమునకు పెర్గునను సమ్మతించెను. ఆ రాత్రి విమానము అయిదువందల యొనుగుల మొత్తునుండి అరువది మైళ్ల దూరమేగెను. మరునాడుదయమున వాయువ్య మూలగా వీచు వాయుతరంగముచే విమానము కొనిపోబడు చుండెను. దిఙ్మండలమున కొన్ని రాబందులును గద్దలును కన బడుటచే జోవు భయపడెను.

" ఒక్క విమానమైనచో మనపని యేమయ్యెడిది? ఈచిన్న విమానము ధూమనౌకలోని ప్రాణదోనెవలె నుపక రించెను."

" జోవు! నీమాట నిజము. కాని యీప్రాణదోనెను సంశయింపవలసి యున్నది."

" ఎందువలన? "

"విమానపుగుడ్డయందలి గట్టాపర్చా సర్వనాశపువేసి చే కరగుచున్నది. అందుచే ఉదజని గుడ్డలోనుండి వెలువడు చున్నది. ఊర్ధ్వముఖముగా జనుటకై ఉదజని నెక్కువ ఉష్ణీక రింపగూడదు."

"దానిని కాపాడుటకు మార్గములేదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"లేదు. అందుచేతనే మనము త్వరగా పచ్చసముద్ర తీరమును జేరవలెను."

"ఇచ్చటికి సముద్రతీర మెంతదూర మున్నది?" అని జో వడిగెను.

"తీరమందే ప్రదేశమునకు? వాయు వెచ్చటికిగొనిపోవునో తెలియదుగదా! టింబక్టూనగర మింకను నాలుగువందలమైళ్ళదూరమందున్నది."

"అచ్చటి కేగుట కెంతకాలము పట్టును?"

"వాయువు సరిగనున్నచో మంగళవారమునాటి కేగగలము."

"అట్లయినచో నావర్తకులకన్న ముందుగ జేరగలము."

అని జో క్రింద గనబడు వర్తకులను జూచి పలికెను. నూటయేబది ఒంటెలు టింబక్టూనగరమునుండి టాఫిలెటుపట్టణమునకు వ్యాపారార్థమై చనుచుండెను. వంటచెరకుతో నిండిన సంచులు ఒంటెలతోకలకు కట్టబడియుండెను. సార్థవాహులకునాయకుడగు కబీరునకు ఒంటెలు లొంగియుండును. ఆదేశీయులు కబీరును మొహారీ యందురు.

"సముద్రమువలెనుండు యెడారులలో వారికి మార్గ మెట్లు తెలియును?" అని జో వడిగెను.

"వారికది యలవాటు. మనము దారితప్పినను వారు దారితప్పరు. పగలు గులకరాయైనను వచ్చవి మొలకైనను లేకయిసుకరంగైనను వారికి దారిని గనబరచును. రాత్రులందు నక్షత్రములే యాధారములు. గంటకు రెండుమైళ్ల వేగమున జనుచు ఎండవేడిమి హెచ్చిన కొంతకాలము విశ్రమింతురు." అని డాక్టరు ప్రత్యుత్తరమొసగెను.

మరునాడు వాతావరణస్థితి మారెను. విమానము వాన చేత తడియుచున్నందున భారము హెచ్చి వేగము తగ్గెను. దేశము ఫలవంతమై తరుగుల్మాదులతో నిండియుండెను. మహారణ్యములు వన్యమృగములతో నిండియుండెను.

"మనము త్వరలో నైజరునదిని చూడగలము. ఈనది యీ దేశమును సారవంతముగజేసి జనులకు నాగరకత నొసంగుచుండెను. నైజరునది 2500 మైళ్ళ పొడవు గలది. దీనితీరములపై గొప్పగొప్ప పట్టణములు గలవు." అని డాక్టరనెను.

"బార్తు యీదారినే చనెనా?" అని కెనడీప్రశ్నించెను.

"లేదు. చాడుసరస్సును విడచి బోర్ను దేశమందు గల గొప్పపట్టణములను జూచి నైజరునదిని 'సేను' వద్ద దాటెను. ఎనిమిదినెలలు తిరిగి టింబక్టూనగరమున కేగెను. మనమాపట్టణమును మూడురోజులలో చేరగలము."

"నైజరునది జన్మస్థానమును చూచినవారు గలరా?"

"మంగోపార్కు 1805 వ సం॥లో చూడవలెనని యత్నించి యీదేశీయులచే చంపబడెను. 1816 వ సం॥న మేజరు గ్రేయును, 1822 వ సం॥న మేజరులెయింగును, 1827 వ సం॥న రెనికెయిలీయును, క్లాపర్టను, రిచ్చర్డుసను మొదలగువారు కూడ నైజరు జన్మస్థానమును చూడ యత్నించి చనిపోయిరి.

# ముప్పదియొనిమిదవ అధ్యాయము.

సోమవారమునాడు వైమానికులకు పనిలేనందున ఆఫ్రికా దేశపు గాథలను చెప్పుకొనిరి. ఉత్తరదిశగా ప్రవహించి పశ్చిమముగా తిరిగి సముద్రములో కలియు నైజరునదీ తీరమందుగల దేశము కొంతభాగము సారవంతముగను కొంత భాగము నిస్సారముగను కనబడెను. విమానము సాయంకాలమునకు పశ్చిమదిశగా రెండువందల మైళ్ళ దూర మేగెను. చంద్రకిరణములు మేఘములచాటున నుండి నీటిబిందువులలో దూరి పలుతెరంగుల విజయలక్ష్మి విమానము నలంకరింప జొచ్చెను. 20 వ తేదీ ఉదయమున విమాన ముత్తరదిశగా గొనిపోబడుచుండెను. పచ్చికమైదానమందు ప్రవహించుచుండిన సెలయేళ్ళు పల్లెవాడు విసరిన వలవలె గాన్పించెను బార్తు టింబక్టూనగరమునకు జనుటకై పడవ నెక్కిన స్థానము కనబడెను. జెన్నినుండి సరకులతో నేతెంచుచుండిన ఒంటెల మందలు చెట్లసందులనుండి గోచరమగుచుండెను. నదియొక్క వంపులో నున్న కుగ్రామమొకటుండు గనబడెను.

"దానినే 'కాబ్రా' గ్రామ మందురు. టింబక్టూపట్టణమున కదియే ఓడరేవు. టింబక్టూ యిచ్చటికి ఐదుమైళ్ళదూరములో నున్నది." అని డాక్టరు సంతోషమును గనబరచెను.

రెండుగంటలలో టింబక్టూ నగరము కనబడెను. బార్తు వ్రాసిన పటము ననుసరించి యుండుటచే ఫెర్గుసనున కాశ్చర

మొదవెను. ఆపట్టణము త్రికోణాకారముగ నుండి తెల్లని యిసుకనేలపై గట్టబడెను. చుట్టుప్రక్కల దేశము సారవంత మైనది గాదు. వీధులు సన్నముగనుండి పచ్చియిటుకలతో కట్ట బడిన యిండ్లను కలిగియుండెను. ఎండుగడ్డిచేతను జమ్ముచేతను నేయబడిన పూరిండ్లుకూడ గలవు. జనులు పలురంగుల వస్త్ర ములధరించి యొకచేతితో తుపాకిని పట్టుకొని చూచుచుండిరి. స్త్రీ లెవ్వరును కాన్పించుటలేదు.

"ఇచ్చటిస్త్రీలు అందగత్తె లని పేరొందిరి. మసుదు పెక్కు మసీదులు గలవుగాని యిప్పుడు మూడుమాత్రమే కన బడుచున్నవి. పట్టణమునకు పూర్వవు కళపోయినది. సాంకో రుమసీదు, సిడీయాహియామసీదు లవి. మేడలు లేవు. దీనిరాజు ఒక పెద్దవర్తకుడు. వాని భవన మొక దుకాణము." అనిఫెర్గు సను నుడివెను.

"మొండిగోడలు కనబడుచున్నవి." అని కెనడీ పలికెను.

"ఫులనీలచే నీపట్టణము 1626 వ సం॥ న పాడుచేయ బడినది. పదునొండవ శతాబ్దము నుండియును యీఫురవాసులు లోభులు. మొదట టౌరిగ్గులును, పిదప సోనేత్రియులును, తదు పరి రొకెయునులును తుదకు ఫులన్నీలును యీపట్టణమును పరి పాలించిరి. 16 వ శతాబ్దములో యీనగరమందు అహమ్మదు బాబా యనువానియొద్ద 1600 వ్రాతగ్రంథములు గల గ్రం థాలయ మొకటి యుండెడిది."

విమానము వేగముగ జనుచుండుటచే నగరమును చక్కగాపరికింప వలనుగాకుండెను అందుచే టింబక్టూనగరము మెఱుఁలుబండి ఆగని రైలుస్టేషనువలె దాటబడెను.

"మనల నిప్పుడు వాయు వెచ్చటికి గొనిపోయినను మంచిదే." అని ఫెర్గుసను నుడివెను.

"పశ్చిమముగా నెచ్చటికేగినను మంచిదే."

"తిరిగి జాంజాబారున కేగి సముద్రమును దాటి అమెరికాదేశమున కేగినను మంచిదే!" అని జో వనెను.

"ఆవైపునకు జనుట మంచిపనికాదు."

"ఎందువలన?"

"మనయొద్ద ఉదజని స్వల్పముగ నున్నది. ఎగురుటకు శక్తి చాలదు. మనలను సమీపతీరమునకు జేర్చినచాలును. కొంత స్థిరత్వభారమును పారవేయనియెడల విమానము శీఘ్రగమనమున జనుట కష్టతరము."

"మన శరీరముల బరువు హెచ్చినను విమానవుభారమును హెచ్చును." అని జో వనెను.

"మనము ప్రయాణాంతమును జేరుచున్నను మనము చేయుకార్యములు పెక్కులు గలవు. మనకు తీర మెచ్చట దొరకు నని నీతలంపు?" అని కెనడీ ప్రశ్నించెను.

"చెప్పలేను. గాలి సరిగా లేదు. సిరాలియోన్, పోర్టెండిక్కులమధ్య కేగినచో నదృష్టవంతులము. అచ్చట మనకు స్నేహితులు గలరు." అని డాక్టరనెను.

"మన విమానము జనుదారి సరియైనదా?"

"కాదు. కంపాసును జూడుము. దక్షిణదిశగా నైలు జన్మస్థానమున కేగుచున్నాము."

"మన మచ్చట కేగజనదు."

సాయంకాల మగుచుండ ఫెర్గుసను శేషించిన స్థిరత్వ భారమును పారవైచెను. విమాన మూర్ధ్వముఖముగా నేగి టింబక్టూనగరమునకు దక్షిణదిశగా నరువదిమైళ్ళ దూరమేగెను. మరుచటిదినము ప్రాతఃకాలమునకు నైజరునది మీదనున్న 'డిబో' రేవుపట్టణము కనబడెను.

---

# ముప్పదితొమ్మిదవ అధ్యాయము

నైజరునదీగర్భ మచ్చట లంకలచే పాయలుగ విభజింపబడెను. ఉదజని నుపేక్షించి విమానము నూర్ధ్వముఖముగ గొనిపోయి వ్యతిరేకపు వాయుతరంగముల కొరకు ఫెర్గుసను యత్నించినను నిష్ఫలమనోరథు డాయెను. ఉదజని గుడ్డలో నుండి వెలువడుచుండుటచే సర్వనాశము పని ముగిసెను. ఇంగ్లీషు ఫెరించి కాలనీలలో దిగుటమంచిది. విమానము ఫెర్గుసనునకు లొంగుటలేదు. వైమానికులు యోచనానిమగ్నులై యుండ వాయుతరంగము మారుచుండెను.

"వానకురియు చిహ్నములు పొడగట్టుచున్నవి. ఆ

వచ్చు మేఘములే మనశతృవులు. ఇంతవర కిట్టిమేఘములను మనము చూచియుండలేదు." అని జోవనెను.

"అది మేఘముగాదు, మిడుతలదండది. అది వ్రాలిన చోట దేశమునకు క్షామము కలుగును." అని డాక్టరనెను.

"మిడతలను చూడవలెను."

"తొందరపడవలదు, పదినిమిషములలో నవి మనయొద్దకే వచ్చును. నీవే చూచెదవు."

ఆమిడతలదండొక ఫలోన్ముఖమైన పైరుపై వ్రాలి పదునైదునిమిషములలో నెగిరి యింకొక ప్రదేశమున కేగెను. అవి విడచినపైరు పేరులేకుండ మాయమయ్యెను.

"ఈ మిడతలదండు చేయుహాని యింతయని చెప్పవలనిగాదు. ఈదేశీయులు మిడతలను భుజించుదురు."

"వాటిమాంసమును రుచిచూడవలెను."

సాయంకాలమునకు విమానము పల్లపుసాగు చేయబడుచున్న భూములపై కేగెను. నదీతీరమున పొగాకుసేద్యము జేయబడు చుండెను. జెన్నిపట్టణము కనబడెను. ఆపట్టణమందు గోపురములుగల మసీదులు రెండు కనబడెను. ఆ గోపురములందు చిన్నపక్షులు తమకులాయముల నిర్మించుకొనియుండెను. ఆపట్టణముమధ్య చింతలు, తుమ్మలు, కొబ్బరిచెట్లు లాటి చెట్లు పెరిగియుండెను. జెన్నినగరమునుండి టింబక్టూనగరమునకు వర్తకవ్యాపారము సాగుచుండెను.

"మనకు విమానము లాంగుటలేదు. ఈ పట్టణమందు యింగ్లాండున కేగిన అరబ్బీ యొకడు గలడు."

"ఇంకొకసారి రావచ్చును." అని జోవనెను.

"వాయువుమారుట మంచిది."

విమానపు భారమునుతగ్గింప వట్టిసీసాలు మాంసపు పీపా మొదలగునవి పారవేయబడెను. అందుచే విమానమున కుత్పతనశక్తి హెచ్చి పైకేగెను. ప్రాతఃకాలమున బాలసూర్య రశ్మి 'బంబరా' రాజ్యపు ముఖ్యపట్టణమైన 'నిగో' మీాద పడుచుండెను. నదిలో చిన్నపడవలు జనులను దాటించుచుండెను. ఆపట్టణవాసులు విమానమును చూడలేదు. విమానము వాయువ్యమూలగా జనుచుండుటచే డాక్టరునకు మనశ్శాంతి గలిగెను.

"ఈ వేగముతో రెండురోజులు నడచిన సెనిగాలు నదిని జేరగలము."

"ఆదేశీయులు మనకు స్నేహితులా?"

"స్నేహితులనే చెప్పవచ్చును. అప్పటినుండి పశ్చిమ సముద్రతీరమును జేరగలము."

"అంతటితో మనవిమానయానము ముగియును ననుకొనెదను. నాకథలను వినువారిమధ్యనే దిగవలెనుగాని యింకొక చోటనేను దిగను." అని జోవనెను.

# నలుబదియవ అధ్యాయము

తే॥గీ॥ " వనధిపరివృతయగు భూమి వఱుదునట్టు
లంబుదముల వెన్కకు దోయు చునట్లు దోచె
నహహా! కొరియా-రుమబ్బుల యట్టులున్న
వివిజృంభమాణ పటు మహీధరములు. "

—అవిమారకము.

మెయి 27వ తేదీ ఉదయము తొమ్మిదిగంటలకు దేశపు తీరు మారి పర్వతములు కాన్పించెను. అదియే నైజరు, సెని గాలునదుల మధ్యనున్న పర్వతపంక్తి. సెనిగాలు దేశపుజనులు కూరులు. పూర్వము కొందరు పరిశోధకు లచ్చటి జనులచే బాధల నొందిరి. కాని విమానపుబుట్ట మెుతలుపడుచు ఫెర్గు సనునకు లొంగుటలేదు. కొన్నిపనిముట్లుకూడ పారవేయబడెను.

" విమానపుగుడ్డ చిరుగలేదుగద! "

" లేదు. గట్టాపర్చా వేడిచే మెత్తబడెను. ఉదజని గుడ్డలోనుండి వెలుపడుచుండెను. అందుచే మనము విమాన మును తేలికపరచుటయే కర్తవ్యము." అని డాక్టరనెను.

" పారవేయుట కేమియు కాన్పించుటలేదు. " అని కెనడీ నుడివెను.

" ఈగుడారమును పారవేయుదము. చాల భారము తగ్గును. "

" గుడారమొక తెగవారికి వస్త్రములకిందనుపయోగ పడును. సుమారు వేయిమందికి సరిపోవును."

జోవు గుడారమును పారవేయు విమాన మార్గముఖముస కొంతదవ్వేగి తిరిగి క్రిందకు దిగుచుండెను.

"మనము విమాను పట్టువస్త్రమును బాగుచేయుట మంచిది." అని కెనడీ నుడివెను.

"ఇప్పుడు మనవల్లగాదు."

"అట్లయిన మనము చేయునదేమి?"

"మిగిలిన పనిముట్లను పారవేయుడు. ఈనరభక్షకుల మధ్య దిగకూడదు. వీరు అడవిమృగములకన్న క్రూరులు."

"మీ కెట్లు తెలియును?" అని జో వడిగెను.

"సెనిగాలు నాక్రమించిన ఫ్రెంచివారికి చుట్టుప్రక్కలనున్న తెగలతో యుద్ధము తటస్థించినందున ఫైడర్బీయను సైన్యాధ్యక్షుని సహాయముతో కొంత దేశమును కొల్లగొనిరి. పాస్కలు, విన్సెంటు, లాంబర్టనువారు వ్రాసినవ్రాతలనుబట్టి తెలియుచున్నది."

"ఏమి జరిగినది?"

"1854 సం॥న ఫౌటా ఆగ్డ్జీయను సెనిగాలు దేశీయుడు మహమ్మదుచే పురిగొల్పబడి ఐరోపాదేశీయులను తమదేశమునందు లేకుండ జేయుటకై తన తెగవారినందరిని లేవదీసి దేశమును కొల్లగొట్టి సెగోపట్టణమునుగూడ ముట్టడించెను. 1857 వ సం॥న ఫ్రెంచివారిచే కట్టబడిన మెడీనుకోటను ముట్టడించెను. కాని పాల్ హాల్ ఫైడర్బీయను సేనానాయకులచే నోడింపబడి

సెనిగాలును దాటి వారు కార్టా దేశమున దాగియుండిరి. ఆకా ర్టాదేశ మిదియే. మనము వారి చేతులలో జిక్కితిమా మనగతి యేమగునో తెలియదు."

" నాకు దిగుటకు భయమగుచున్నది." అని జో వ నెను.

"నదిని మన విమానము దాటలేదు." అని డాక్ట ర నెను.

" మనము నదీతీరమునకైన యీ విమానములో నే గవలెను."

" ముందు ప్రయత్నము జేసి యీపర్వతమును దాటు దము. అంతయెత్తున కేగుటకు మరపొర్లియ్యి ప్రయోజనకారి గాదు."

" పర్వతములు సమీపించుచున్నవి." అని కెనడీ ను డివెను.

" ఒకరోజుకు సరిపడునీటి నుంచి, మిగిలినసీటిని పారజో యుము."

" ఇదిగో నీరు పారిపోవుచున్నది." అని జోవు నీటిని పారపోసెను.

" విమానము లేచుచున్నదా?" అని కెనడీ ప్రశ్నించెను.

" ఏబదియడుగులు లేచెను. కాని చాలదు."

విమానమింకను నైదువందలయడుగుల యెత్తున కేగవ

లయును. మరపొయ్యికి కావలసిననీటిని పారబోసిరి.

"వట్టిపీపాలను పారవేయుడు."

"ఇదిగో" అని జోవు పారవేసెను.

"జోవు! నీవు క్రిందికిదుముకనని ప్రమాణముచేయుము. నీసహాయము మాకు ముఖ్యము."

"సరే."

పర్వతశిఖర మింకను కనబడుటలేదు. పదినిమిషముల లో విమానము పైకేగనిచో పర్వతమును తాకును. పెమ్మికను మిగిలిన మాంసమునుగూడ పారవైచిరి. కొంచెము పైకేగినను విమానము శిఖరమును దాటలేదు. ఫెర్గుసను తొట్టిలోనికి జూచెను.

"మీ తుపాకులనుగూడ పారవేయుడు."

"తుపాకులను పారవేయలేను."

"పర్వతమును జేరుచున్నాము." అని జోవనెను.

"పర్వతశిఖరము యేబదియడుగుల దూరమున గలదు."

జోవు కంబళ్ళను పారవేసెను. కొన్ని తూటాలసంచులను గూడ కెనడీకి తెలియకుండ పారవేసెను. అందుచే విమానము కొంచెము పైకేగినను శిఖరమును దాటలేదు.

"కెనడీ! తుపాకులను పారవేయనిచో మనపని ముగియును."

" తొందరపడకుడు." అని జోవు తొట్టిలో నుండి దిగెను.

" జోవు! జోవు! " అని కెనడీ డాక్టరులు కేకలు వేసిరి.

పర్వతశిఖర మిరువదియడుగుల వెడల్పున నుండెను. విమానపు తొట్టి దానిని తాకుచు జనుచుండెను.

" మన మిప్పుడు సురక్షితముగ నున్నాము. " అనుచు జోవు తొట్టిలోని కేగెను.

శిఖరముపై జోవు నడచుచు విమానమును పట్టుకొని యుండెను. శిఖరమును దాటినవెంటనే తొట్టిలోని కెక్కెను. కెనడీ ఫెర్గుసనులు జోవు సాహసమునకును తెలివికిని సంత సించిరి.

" ఇది కష్టమైనపని గాదు. " అని జో వనెను.

" మాకొరకు నీవు కష్టములపాలు గాగూడదు. " అని డాక్టరనెను.

" మీకొరకుగాదు. కెనడీ తుపాకులకొరకు. అవి నన్ను రక్షించినవి. నేను వాని ఋణమును తీర్చుకొంటిని."

పర్వతమును దాటి విమానము భూమికి రెండువందల యడుగుల యెత్తున కేగ చీకటులు క్రమ్ముచుండుటచే విమా నము నాపుటకు లంగరును విసరిరి.

" దిగవచ్చునా ? " అని కెనడీ యడిగెను.

" వలదు. మనము పీడగూడదు. నీనహాయము కూడ గావలెను."

లంగరు మహారణ్యమందలి చెట్టుకొమ్మకు తగిలినందున విమానము నిలబడెను.

---

# నలుబది యొకటవ అధ్యాయము

సెనిగాలునది విమాన మాగిన స్థానమున కిరువది మైళ్ళ దూరమున నుండెను.

" నదినిదాట పడవలు దొరకవుగనుక విమానముతో దాటవలెను. అందుచే విమానమును తేలికపరచెదము." అని డాక్టరనెను.

" ఏవిధమున చేయుగలము? మనలో నొకడిచట దిగవలెను. నేను దిగుట కభ్యంతరము లేదు." అని కెనడీ యనెను.

" నా కలవాటైనది." అని జో వనెను.

" ఈసారి మీతలంపుచే ప్రయోజనము లేదు, నము ద్రతీరమునకు నడచిపోవలెను."

" నేను బాగుగ నడువగలను." అని కెనడీ పలికెను.

" నే నంగీకరించను." అని జో వనెను.

" మీరు పోట్లాడవద్దు. అవసరమైనచో మువ్వురము నడచియే పోవుదము." అని డాక్టరనెను.

" అవును. నడక శరీరమున కారోగ్యము నొసగును. " అని జో వనెను.

" నడచుటకు ముందు వ్యాకోచయంత్రమును పార వేయుదము. అందుచే 700 పౌనుల భారము తగ్గును."

" దానిని పారవేసిన నుదజని నుష్ణీకరించు టెట్లు? "

" అది లేకుండనే చూడవలెను. మనల ముప్వురను గొనిపోవు శక్తి గలదు. లంగరులనుమాత్రి ముంచుదము. "

" నీవు మంచి యాలోచన వొడమినది. ఏమి చేయ వలెనో చెప్పుము. సిద్ధముగ నున్నాము. "

" యంత్రము నూడదీయుటయే. "

ఆపని చాలకాలము పట్టెను. తొట్టిలోనుండి యంత్రములుగల పీపాల నెత్తి పారవేయుటకు ముప్వురిబలము పయోగింపబడెను. ఆయంత్రభారముచే చెట్లకొమ్మలు విరిగెను.

" నీగ్రోలు కది దొరకినచో దానిని దేవతగ పూజింతురు. " అని జో వనెను.

" జోవు విమానముపై కెక్కి తీగల నూడదీసి గొట్టములనుగూడ పారవేసెను. విమానమున కుత్పతనశక్తి హెచ్చెను. రాత్రి రెండుఘాములకు ఆపని పూర్తియాయెను. వారారాత్రి చల్లనిపదార్థములనే భుజించిరి.

" మీరిద్దరు నిదురింపుడు. రెండుగంటలకు కెనడీని లేపుడు. జోవు నాలుగు గంటలకు లేచును. ఆరుగంటలకు బయలుదేరుదము. "

కెనడీ జోవులు నిదురించిరి. తెల్లవారుచుండ మేఘములచే వెన్నెల కాయుటలేనందున చీకటులు క్రమ్మెను. తొట్టికి దిగువ ఆకులచప్పుడు వినవచ్చెను. వారు నిలిచినది శత్రువుల దేశమగుటచేతను విమానము పూర్వపుస్థితిలో లేనందునను ఫెర్గుసనునకు భయముదవుటాశ్చర్యముగాదు. సంభాషణ కూడ వినబడెను. కెనడీని లేపి ఫెర్గుసను నిదురించెను.

కెనడీ పొగాకుగొట్టమును వెలిగించి కండ్లను తుడుచుకొనెను. మోచేతిపై నానుకొని గొట్టమును బాగుగపీల్చెను. సన్నని గాలివీచుటచే కెనడీకి నిద్రాదేవత యావహింప కనురెప్పలను బలవంతముగ తెరచుచుండెను. కాని తుదకు నిద్రాదేవతకు లోబడి కొంతకాలము మైమఱచెను. భూమిపై చిటచిటశబ్దము వినబడుటచే తిరిగి మేల్కాంచిచూడ వేడిగాలి సోకుచుండెను.

„ మంటలు! మంటలు! ” అని కెనడీ కేకలువైచెను.

ఫెర్గుసను జోవులు లేచిరి.

“ ఏమిదింత? ” అని ఫెర్గుసను ప్రశ్నించెను.

“అడవి మండుచున్నది! అని జో వనెను.

నీగ్రోల కేకలుకూడ వినబడెను.

“ వారే టాలిబాలు లనువారు. ఆల్ హడ్జీపరివారము. ”

విమాన మగ్నికుండములో వ్రేలాడుచుండెను.

చెట్లన్నియును మండుచుండెను.

"మనము దుముకవలసినదే. అంతకన్న వేరుపాయము లేదు." అని కెనడీ పలికెను.

ఫెర్గుసను కెనడీ నొక చేతితో పట్టుకొని విమానవు లంగరుత్రాటిని కత్తితో నరికెను. వెంటనే విమానము వేయిఅడుగుల యెత్తున కేగెను. అడవిలోనుండి కేకలును తుపాకులను కాల్చిన చప్పుడును వినబడెను. వాయుతరంగముచే విమానము పశ్చిమదిశగా కొనిపోబడుచుండ తెల్లవారెను.

---

# నలుబదిరెండవ అధ్యాయము.

"నిన్నటిరాత్రి విమానమును తేలికపరచినందున మనమీ యాపదను దాటితిమి." అని డాక్టరనెను.

"ఏసమయమున జేయవలసినపని నాసమయమున జేయుటచే కలుగు మేలే యిది." అని జో వనెను.

"మనము శత్రువుల దేశమును దాటలేదు."

"మన యిష్టములేనిదే విమాన మిప్పుడు క్రిందకు దిగునా?"

"ఏల దిగగూడదు?"

మహారణ్యము దాటబడినది. ఇరువది గుర్రపురౌతులు విమానమును తుపాకులతో తరుముచుండిరి. విమానము నెమ్మ

దిగ జనుచుండెను. రౌతులు విమానమును తుపాకులతో జడి పించుచుండిరి.

" వారే క్రూరులగు టాలిబాలులు. అడవిమృగముల మధ్యనైన నివసింపనగునుగాని వారిమధ్య నివసింపజాలము." అని డాక్టరనెను.

" పాపము! ఈక్రూరమృగములు యెగురలేవు." అని జోవు వారిని పరిహాసించెను.

" ఆపాడుపడిన గ్రామములను జూడుడు. వీరి పనియే యది. సారవంతపు భూములను నిస్సారములుగ జేయుదురు."

" వారు మనలను కలిసికొనజాలరు. మనము నదిని దాటిన వీరివలన భయముండదు."

" మనము ఆయుధములను చేకొనియుండుటమంచిది" అని కెనడీ తుపాకిని గైకొనెను.

" అవును. వాటిని పారవేయకుండుటచే గలుగులాభ మే యది."

తుపాకులలో మందును దట్టించిరి.

" మనము యెంతయెత్తున నున్నాము? "

" సుమారు 750 అడుగులయెత్తున. మంచిగాలిదొరకి నచో సెనిగాలునదిని త్వరలో దాటగలము."

" అవును. వారు నాతుపాకిబారులో నున్నయెడల దెబ్బ కొకనిని గూల్చుదును." అని కెనడీ పలికెను.

"అప్పుడు మనముగూడ వారితుపాకులబారిలోనుందుము. వారి తుపాకులబారు హెచ్చు. మన విమానవుగుడ్డకు చిల్లులుపడగూడదు."

ఉదయమున సూర్యుడతనికిరణములను ప్రసరింప జేయుచుండ టాలిబాలులు విమానమును తరుముచుండిరి. మధ్యాహ్నము పదునొకండు గంటలకు విమానము పదిహేను మైళ్ళ దూరమేగి క్రమక్రమముగ దిగుచుండెను. సెనిగాలు నది పండ్రెండుమైళ్ళ దూరమందుండెను. ఆవాయువేగముతో జనిన మూడుగంటలకాలము పట్టును. టాలిబాలులు కేకలు వేయుచు గుర్రముల నదల్చుచుండిరి.

"విమానము దిగుచున్నదా?" అని కెనడీ ప్రశ్నించెను.

"అవును."

పదునైదు నిముషములలో విమానము భూమికి నూటయేబది యడుగుల యెత్తున కేగెను. గాలి వడిగ వీవసాగెను. రౌతులు గురిచూచి కాల్చుచుండిరి.

"మూర్ఖులారా! మేము చాలదూరమందున్నాము." అని జోవు కేకవైచెను.

సమీపమున కేతెంచిన టాలిబాలులను కెనడీజోవులు గురిచూచి కాల్చుటచే రౌతులందరును కొంతకాల మాగిరి. అందుచే విమానము చాల దవ్వేగెను.

"వారజాగ్రత్తగ నున్నారు." అని కెనడీ నుడివెను.

"మనలను ముట్టడించుట సులభమని తలచిరి. కాని మనము వారిబారిలో లేము. విమానము నింకను తేలిక పరచవలెను."

"దేనిని పారవేయును?" అని జో వడిగెను.

"మిగిలిన పెమ్మికను. అది సుమారు 30 పౌనులు న్నది.

జోవు దానిని పారవేయ శత్రువుల కేకల మధ్య విమానము పైకేగెను. అరగంటలో విమానము తిరిగిక్రిందకు దిగి తొట్టి భూమిని తాకుటచే నెగిరి ఒక మైలు దూర మేగెను.

"క్రిందిని పనిముట్లను మిగిలిన లంగరును పారవేయుడు" అందుచే కొంతదూర మెగిరిపడెను.

"రెండు తుపాకులను పారవేయుడు."

"వాటిని కాల్చినంతవరకైన నాగుడు."

అని కెనడీ నాలుగుసారులు కాల్పగా నలుగురు దెబ్బలు తిని చనిపోయిరి. విమానము బంతివలె తూలెను. రెండుజాములైనది. విమానపు ఆకారము పొడవుగా మారి ముడతలుపడుచుండెను.

"మనము విమానమును విడువవలయును. విమానమెగురలేదు." అని కెనడీ నుడివెను.

"భయములేదు. మనయొద్ద నూటయేబది పౌనుల భారముకలదు." అని డాక్టరనెను.

“ ఏ దాధారము? ” అని కెనడీ ప్రశ్నించెను.

“తొట్టి. మనము వలను పట్టుకొని తొట్టిని పారవేయుదము. అందుచే సెనిగాలునదిని త్వరలో జేరగలము.”

వారు పైకెక్కిరి. కెనడీ తొట్టిత్రాళ్ళను కోసెను. అందుచే విమానము లేచెను.

“ ఆహా! ” అని జోవు పలికెను.

విమానము మూడువందల అడుగుల యెత్తున కేగి సమీపమందున్న చిన్నపర్వతమును దాటెను. శతృవులు చుట్టుతిరిగి వచ్చుటకు కొంతకాలము పట్టును.

“ సెనిగాలునది కనబడుచున్నది. ” అని జోవనెను.

రెండుమైళ్ళ దూరమందు సెనిగాలునది కనబడుచుండెను.

“ఇంకొక పదిహేనునిమిషములలో మనము సురక్షితముగ నుందుము.”

విమాన మంతకాలము నిలువక క్రిందపడి తూలి చెట్టుకొమ్మలలో పట్టుబడి నిలబడెను. వైమానికులు దిగి సెనిగాలు నదివైపున కేగిరి. నదీపతన శబ్దము వారిచెవుల బడుచుండెను. గయానాపతనము కాన్పించుచుండెను. నదిపై తెప్పయైన కాన్పించుటలేదు. నదివెడల్పు రెండువేల యడుగులు. నదీపాతము నూటయేబది యడుగులు. ఫెర్గుసను యోజించి,

“ ఇంకొక ఉపాయముగలదు. ” అనెను.

" నేనుకూడ నట్లే తలచితిని." అని జోవనెను.

సమీపమున నెండు గడ్డికనబడ డాక్టరు తనచెలికాండ్ర నిద్దరిని విమానమువద్దకు గొనిపోయె.

" మన శత్రువులు మనలను సమీపించుటకు గంట కాలమగును. ఈలోన నూరుపౌనుల గడ్డిని పోగుజేయుడు." అని పలికెను.

" ఎందుకొరకు ? "

" ఉదజని పోయినందున వేడిగాలిచే విమానమును పూరించి నదిని దాటుదము."

కెనడీ జోవు లిద్దరును ఎండుగడ్డిని కుప్పగా పేర్చిరి. డాక్టరు విమానవు వల్వమును తెరచి శేషించిన ఉదజనిని పోగొట్టి గడ్డికి నిప్పంటించెను. గాలిని 180 అంశలవరకు నుష్ణీకరించి నచో తారతమ్యగరిమ తగ్గి విమానమున కుత్పతనశక్తి గలుగును. విమానము వర్తులాకారమును దాల్చుచుండెను. ముప్పావుగంటకాలము ముగిసెను. శత్రువులు రెండుమైళ్ల దూరమున కనబడిరి. వారికేకలు గుర్రపుడెక్కల టకటకలు వినవచ్చెను.

" వారు మనల నిరువది నిమిషములలో చేరగలరు." అని కెనడీ పలికెను.

" కొంత గడ్డి నిమ్ము. మనము పదినిమిషములలో పారిపోవుదము."

విమానము చాలవరకు నిండుటచే,

"స్నేహితులారా! వలను పట్టుకొని నిలువుడు" అని ఫెర్గుసను నుడివెను.

పదినిమిషములలో విమానము యెగురుటకు సిద్ధపడెను. టాలిబాలులు 500 అంజలదూరమందుండిరి.

"గట్టిగా పట్టుకొనుడు." అని డాక్టరు కొంతగడ్డిని మంటలోవైచి తానుగూడ విమానముపై నిలబడెను. విమానము చెట్టుపై కెగిరెను. శత్రువులు తుపాకులను కాల్చుచుండిరి. ఒకగుండు జోవుభుజముమీదుగా నేగుటచే కెనడీ ఒకచేతితో తుపాకిని పేల్చి యాశత్రువును బరిమార్చెను. కోపోద్రేకమున టాలిబాలులు కేకలు వేయుచుండ విమానమెనిమిదివందల యడుగుల యెత్తున కేగెను. మంచి వాయుతరంగములో బడి గయానాపతనముమీదుగా జనుచుండెను. పదినిమిషములలో వారు రెండవతీరమును సమీపించుచుండిరి. ఆతీరమందున్న ఫ్రెంచి సైనికులు విమానము నాశ్చర్యముతో వీక్షించుచుండ వారిలో నొకడు వార్తాపత్రికయందు తాను జదివిన డాక్టరు ఫెర్గుసనుగారి విమానయానము జ్ఞప్తికివచ్చినందున తన స్నేహితులతో నాసంగతి నుడివెను. విమానము తీరమునకు సమీపమున నీటియందు పడుటచే వైమానికులు విమానమును వీడి తీరమును జేరుటకు నీదుచుండ ఫ్రెంచి సైనికులు

వారికి సాయమొనరించి గట్టునకు జేర్చిరి. విమానము నీటి ప్రవాహమున బడి పోవుచుండెను.

"ఫెర్గుసను గారా!" అని ఫ్రెంచి సేనాని ప్రశ్నించెను.

"అవును. వాని చెలికాండ్రిద్దరును," అని డాక్టరు నెమ్మదిగ ననెను.

ఫ్రెంచి సైనికులు వైమానికులను తీరమునకు జేర్చు చుండ విమానము సెనిగాలునదితో గయానా పతనమునం దదృశ్యమాయెను.

"ఆవిమాన మెంత సహకారియైనది. దానిఋణమును తీర్చుకొన జాలము." అని జో నుడివెను.

---

## నలువదిమూడవ అధ్యాయము

ఆఫ్రెంచిసైనికులు గయానాపతనము వద్దనొకకోటను నిర్మించుటకుగాను స్థలమును నిర్దేశింప సెనిగాలు గవర్నరుచే పంపబడిరి. వైమానికులు గయానాపతనము మీదుగా దాటి వచ్చినటుల రిపోర్టు నీయవలసిన దని ఫెర్గుసను ఫ్రెంచి సైనికులను కోరెను.

ఫ్రెంచిసైనికులు వైమానికులను తమవసతిగృహము నకు కొనిపోయి విందొసగి యీాద్రిగ్భువ నుదహరించి నటుల రిపోర్టు నొసగిరి.

* ఈదిగువ సంతకము చేసిన మేము యీాదిగువ నుద హారించిన తేదీనాడు డాక్టరు శామ్యులు ఫెర్గుసను, అతని చెలికాండ్రగు రిచ్చర్డు కెనడీ, జోసెఫు విల్సనుగార్లు విమాన పువలను పట్టుకొని సెనుగాలునదిలో మాకు సమీపమున దిగిరి.

24 మే 1862. శామ్యులుఫెర్గుసను

రిచ్చర్డు కెనడీ,

జోసెఫు విల్సను,

డఫ్రీజి లెప్టనెంటు

రోడమెలు ఎన్సను

డఫిజ్ సార్జెంటు

ప్లిస్పా మేయరు.

| | |
|---|---|
| పిలిస్సీరు<br>లొరోస్<br>రాస్కనెటు<br>గిల్లియను<br>వెబెల్ | సోల్జర్లు |

వైమానికులు గయానాపతనమును వీడి మెడీను చేర, నచ్చటి ఫ్రెంచియధికారులు వారికి స్వాగతమొసగిరి.

అచ్చటనున్న 'బెసిలిక్' అను పేరబరగు ధూమనౌక నధి రోహించి వైమానికులు సెనిగాలునదీ ముఖద్వారముగా జని

పదిహేనుదినములలో సెయింటులూయాని జేరిరి. అచ్చటి గవర్నరు వారికి స్వాగతమొసగెను.

జోవు కనబడినవారికెల్ల తనకృత్యముల వినిపించుచుండెను. ఆంగ్లేయధూమనౌక వీరిని జూన్ 25 వ తేదీనాటికి పోర్ట్సుమౌతురేవుద్దకు గొనిపోయి మరునాడు లండనునగరము వందు దింపెను.

రాయలభూగోళ పరిశోధనాసంఘమువా రొసగిన యాహ్వానము నేమని వర్ణింపనగును? పట్టణమంతయు నలంకరింపబడి వైమానికుల నూరేగించుచుగొనిపోయి లండను పురవాసులు గొప్పవిందొసగిరి. లండనునగరమందలి దినవార్తా పత్రికలన్నియును విమానయానము జయప్రదముగ జరిగినందుకు ఫెర్గుసనుగారి కభివందనము లొసగెను.

డాక్టరుఫెర్గుసను రాయలభూగోళపరిశోధనాసంఘము తరపున చక్కని ఉపన్యాస మొసగెను.

ఆసంఘమువారు 1862 సం॥న జరిగిన ఆఫ్రికాదేశపు పరిశోధనలకుగాను వైమానికుల మువ్వురిపేర నొకబంగారుపతకమును ఫెర్గుసనుగారి కొసగిరి.

ఫెర్గుసను జోవునకు దాస్యబంధమును తొలగించి స్నేహితునిగమార్చెను. కెనడీ వెంటనే ఎడింబరో నగరమునకు జని తనయింటి యజమానురాలైన ఎల్స్పెత్తనునామెకు ఫెర్గుసను పూనిన కార్యమును నిర్వహించె నని నుడివెను.

## ఉపసంహారము.

"మయుండు కామగమనంబును నతి విస్తృతం బుగా లోహంబును నిర్మించి 'సౌభకం'బను నామం బిడి సాల్వునకిచ్చిన..." —భాగవతము.

విహంగ విమానములను గురించి ముచ్చటించుటకు యిందు వలనుపడదు గనుక ఉదజని విమానములకును విహంగ విమానములకును గల స్వల్పవ్యత్యాసములను మాత్రమే యిందు పొందుపరచెదను.

ఈగ్రంథమును చదివినవారు విమాననిర్మాణమును గురించి కొన్ని ముఖ్యాంశములను గమనించి యుందురు. గాలిలో తేలియుండుటకు గాలికన్న తేలికయగు పదార్థమొందు కావలసియున్నది. అట్టి తేలికపదార్థ సహాయముచే నుత్పతన శక్తిని కలిగించు సాధనమును విమాన మందురు. ఆపదార్థము విమానపు భారముకన్న నెక్కువభారమును కొని పోవునట్లు చేయబడును.

అట్లు గాలిలో నిలబడు పదార్థమును ఒకచోటనుండి వేరొకచోటికి కొనిపోవుటకై వలయు చలనశక్తి నేర్పరుచుట. దిగునపుడుగాని ఎగురునపుడుగాని తేలికపదార్థమును వ్యయపడకుండునట్లు చేయుట.

ఇటువంటి విమానములలో వాడబడు తేలికపదార్థము ఉద్దజని వాయువు. ఈ విమానములను నడపు సాధనము వా

ణిజ్య వాయుతరంగములు. వీటిసాయముచే మనవిజయలక్ష్మి ఆఫ్రికాదేశమును దాటగలిగెను. ఈ విమానములు వాయు తరంగములకు వ్యతిరేకముగ నడువజాలవు. విమానము నొక దిశగా గొనిపోవలె ననినచో ఆదిశగా వీచు వాయుతరంగము లోనికి విమానమును గొనిపోవలయును. ఇందు కూర్చొని యున్న ప్రయాణీకులకు విమాన మంబరవీధిని నిలబడినను పడి పోవుదు రను భయములేదు.

ఈమధ్య హిందూదేశమందు ప్రదర్శింపబడిన విమానములను విహంగ విమానములందురు. ఈ విమానములను కనుగొనుటకు ముందుగా కొందరు శాస్త్రవేత్తలు చేతులకు రెక్కలను తగిలించి యిండ్లమీాద నుండియును చిన్న గుట్టల మీాదనుండియును పక్షులవలె నెగుర ప్రయత్నించిరి. అట్లు కొంతకాలము ప్రయోగములు సలుపబడి తుదకు యీా విహంగవిమానములు సృష్టింపబడెను. పక్షులకు వలెనే యీా విమానములకును రెక్కలువుండి దిగునప్పుడును ఎగురునప్పుడును దిశలుమారుటకును విహంగములు తమరెక్కలచేతను తోకలచేతను చేయు చలనములనే యీా విహంగవిమానముల కందు రెక్కలచే స్వల్పమార్పులతో ననుసరింపబడుచుండెను.

ఈవిహంగవిమానములకు ఒకరెక్కగాని రెక్కపై రెక్కలుగాని వుండి పక్షియాకారమును బోలియుండును. పక్షుల శరీరమునుబోలె నిలువుగానుండుభాగమందు మనుజులుకూర్చుం

దును. ముక్కు కండ్లుగల స్థానమందు సారథి, యింజను, ఇంజనునకు ముందు గాలిపంకాయున్ను గలవు. సారథి యిం జనును నడిపించుచు పంకాచే వాయుతరంగమును జనింపజేసి రెక్కలక్రిందుగా ప్రవహింపజేయుటచే విమానము గాలిలో లేచి పరుగిడును. రెక్కలయందుగల తలుపులసాయముచేతను తోకయందలి చిన్న రెక్కలసాయముచేతను ఎగురుట, దిగుట, తిరుగుట మొదలగు కార్యములు నిర్వర్తింపబడును. ఇందలిప్రయాణీకులు నిలబడుటకుగాని ఒకచోటనుండి వేరొకచోటి కేగుటకుగాని వీలుండదు.

ఈవిమానము గాలికన్న బరువెక్కువ. పక్షియైనను రెక్కలుముడుచుకొని గాలిలో నిలువలేదు. ఈవిమానమునకు గాలికన్న తేలికయగు పదార్థమవసరములేదు. గాలిలోలేచుటకును, తిరుగుటకును, దిగుటకును యింజనునకు తగిలింపబడిన పంకా జనింపజేయు వాయుతరంగమే ఉదజని వాయువుచేయు పనిని చేయుచున్నది.

ఇంజనుపని చేయక పంకా నిలబడినచో విమానము పడిపోవును. అందుచే సమీపమున రెండు మూడు మైళ్ళలో విశాలమగు ప్రదేశమును జూచి దిగవలయును. విశాలమగు ప్రదేశము దొరకనిచో హాని వాటిల్లగలదు.

ఈవిహంగ విమానములు వాయుతరంగములకు వ్యతిరేకముగ నడువగలుగుటచేతను ఉదజనివిమానములకన్న

వాయుపీడన తక్కువగుటచేతను ఉదజనివిమానములకన్న త్వరితముగ రావలయునని నిన చోటి కేగవచ్చును. ఐరోపామహా సంగ్రామమందు యీవిహంగ విమానములు వేగులవాండ్రకు మిగుల సహాయకారిగ నుండెను.

జెప్లినులు, డిరిజబులులు మొదలగు విమానములందు ఉదజని వినియోగపడుటచేత [illegible] గాలివంకా లమర్చబడి ఉదజనివిమానములకును విహంగవిమానములకును గలమంచి గుణములు ఐక్యమొనర్చబడెను. ఈజెప్లినులందు భోజనాదులు చేయుటకును తిరుగుటకును పడవలలోవలె వీలుగానుండును.

ఇంగ్లాండునుండి హిందూదేశమునకు టపా గొనిపోయి, గొనివచ్చుటకు విహంగవిమానము లుపయోగింపబడుచుండెను. హిందూదేశమునందుగూడ జనుల రాకపోకలకు విహంగ విమానయానము నెలకొల్పబడు సూచనలు కనబడుచున్నవి.